"Published with the Financial Assistance from
Ministry of Education, Government of India."

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## పదుమూఁడవ సంపుటము

రచయిత:
చాగంటి శేషయ్యగారు

సం. 4

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## పదుమూఁడవ సంపుటము


రచయిత :

శ్రీ చాగంటి శేషయ్యగారు



ప్రకాశకులు :

హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయం,

కపిలేశ్వరపురము (తూర్పుగోదావరిజిల్లా)

## -: విజ్ఞప్తి :-

ఇదివరలో ఆంధ్రకవితరంగిణి 12 భాగముల ప్రచురించి ఆంధ్రావనికందజేసి యున్నాము. అయ్యవి ఆంధ్రుల మన్ననల చూరగొన్న విషయమెల్లరు నెరిగినదే.

అంతేగాక కేంద్ర, రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక సంఘు మన్ననల నందుకొని తత్ప్రచురణకు ఆర్థికసహాయమునుకూడ బడసితిమి. ఆంధ్రకవితరంగిణి మిగిలియున్న భాగముల ప్రచురణకు యితోధికముగా తోడ్పడిన కేంద్ర రాష్ట్ర విద్యావిషయాధినేతలకును ఆంధ్ర ప్రజానీకమునకు మా నమస్కృతులు.

పదునాల్గవ సంపుట ప్రచురణమునుకూడ ప్రారంభించి యుంటిమని తెలుపుటకెంతయు సంతసించుచున్నాము.

కపిలేశ్వరపురం
కీలక మాఘ శు॥ 2
భృగువారం.

ప్రకాశకులు.

## ఏతత్కవి కృతులు:

| | |
|---|---|
| దుర్గేశనందిని | నవల |
| నవాబునందిని | ,, |
| విశ్వప్రయత్నము | ,, |
| శ్రీ | ,, |
| రాధారాణి | ,, |

హిందూలా (సమిష్టికుటుంబము)

మదరాసు లోకలుబోర్డుల ఆక్టు (రెండుసంపుటములు)

మదరాసు సహకార సంఘముల ఆక్టు

ఆంధ్రకవితరంగిణి (భాగములు)

## SRI C. RAMALINGA REDDY Kt.

M. A, (CANTAB), HON D. LITT

Vice-Chancellor, Andhra University

"I have read with much pleasure and appreciation Chaganty Seshayya's "Andhra Kavi Tarangini". It is a remarkably fine contribution to the History of our literature and our country. He has taken trouble to study the latest archæological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

.... .... Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the Andhra world with an authoritative Lives of Andhra poets.

He does not mix up Puranas with history and egend with truth and that is a rare and refreshing feature.

*(Sd). C. R. Reddy*

## THE HINDU

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is the first of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of Telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitherto laid hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions ......."

(True Copy)

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

(ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"మీగ్రంథము, మీరుచేసిన కూలంకష పరిశ్రమకు ఫలము కవిజీవిత కవిచరిత్రకారులు అడుగుపెట్టలేని గహనములలో మీరు రాచబాటలు వైచితిరి."

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

(ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"... మీకవితరంగిణి కల్హణుని రాజతరంగిణివలె సారస్వతములో ముఖతిలకంగా ప్రకాశింపకలదు......ఆధారవస్తువివేచనలో మీసమగ్రజ్ఞానమును ప్రమాణీకరణదృష్టియుద్యోతమగుచున్నది"

ఆంధ్రపత్రిక "...... శేషయ్యగారు నిష్పక్షపాత బుద్ధితో యదార్థమెంతయో గ్రహించడానికి అత్యధికంగా శ్రమపడ్డారు. అనుమాన ప్రమాణంతో కూడుకొన్న చరిత్రకు యిదమిద్ధమన్న నిర్ణయాలు మొండిగాచేసి చరిత్రకు అపకారం చేయకుండా చారిత్రక వస్తువులనందించి సూచనమాత్రం తన ఊహనుచెప్పి పాఠకులకు నిర్ణయాలకు సదవకాశమిచ్చారు. వీరిప్రయత్నం ప్రశంసనీయమే"

ఆంధ్రప్రభ: "ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథము లేని లోటుదీనితో తీరినట్టున్నది. తక్కిన సంపుటములను కూడత్వరలో వెలువరించడానికి తగినప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రుల పైనున్నది."

శ్రీ వేలటూరి వెంకటరమణయ్యగారు

(మదరాసు విశ్వవిద్యాలయము రిటైర్డు పండితులు)

"......తమగ్రంథమువలన పూర్వవిమర్శకుల రచనలకు వెదకి చూడవలసిన యావశ్యకత లేకపోయినది. ఆంధ్రకవితరంగిణి యందు తామవలంబించిన పద్ధతి యధునాతన చరిత్ర రచనాపద్ధతి వంటిది. మీయత్నముకడు ప్రశంసనీయము."

## శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు

"ఆంధ్రకవితరంగిణిని చాలభాగము చదివితిని. స్థూలదృష్టులకు మీపరిశ్రమము గోచరింపదేమోగాని తక్కిన యావధాంధ్రకవులే గాదు. పండితులే కాదు, పామరులే కాదు వీరలెల్లరును కన్నుల నద్దుకొందురని యే నాయాశయము. ప్రప్రథమమున మార్గదర్శి మహర్షి: అనుచొప్పున శ్రీగురుజాడవారి యుద్యమమునకు పూనిరి. కొంతవరకే కృతకృత్యులైరి. వారిని నేను ప్రత్యక్షముగా నెఱుంగుదును. మాకంటె సర్వదా కొంత పెద్దలైనను సమకాలీనులమే పిమ్మట వీరేశలింగంపంతుల వారారంభించి చాలవరకు కృతకృత్యులైరి తరువాత మీరు దీనికి నుపక్రమించిరి. ఇప్పటికి వారిద్దఱిని సూత్రకారులుగను. వృత్తికారులుగను భావించుచో మీకు భాష్యకారస్థానం లభించుననుకొంటిని......భవతు, ఇప్పటికి భాష్యకారస్థానము మీదే. మీ యుద్దేశము సర్వదా జయప్రదమగుంగాక! విద్యాశాఖాధికారులు మీపరిశ్రమను గమనింతురుగాక—ఇంతే వ్రాస్తి.

## శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, మద్రాసు.

"...మీకవితరంగిణి చాలవరకు చదివితిని. అందు మీరు తీసికొనినశ్రమ అపారము. దానిప్రయోజనమపరిమితము. వెనుకటివిషయములనేగాక ఆయాకవులనుగూర్చి యిటీవలివిమర్శనల మూలముగాను శాసనాదిపరిశోధనల మూలముగాను బయలువడిన యనేక విషయములనుగూడ పొందుపరచి యాకవుల చరిత్రను సమగ్రము గావించితిరి ఏవిషయమునను తీవ్రవాదములకు లోనుగాక నిష్పాక్షికమగు చారిత్రికదృష్టిని నిలకొల్పుటకు మీరుచేసిన ప్రయత్నము మిగుల ప్రశంసనీయము. తక్కిన భాగములుకూడ త్వరలో ప్రకటితము లగునని యాశించుచున్నాఁడను..."

**దుర్గేశనందిని** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందు పఠానులకును రసపుత్రులకును జరిగిన కలహము- రాజా మాన్ సింహుని పుత్రుఁడగు జగత్సింహుని మహావీరత్వము – చక్కని శైలితో తెనుఁగుభాషలో మేటినవలా రత్నమనుటకు సందియము లేదు. ఇదిసప్తమముద్రణము. (టెక్స్టుబుక్ కమిటీ వారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవుకాబడినది) రు 2–8

**నవాబునందిని** రచయిత:- శ్రీ చాగంటి శేషయ్యగారు

దుర్గేశనందని యందలి మిగిలిన కథా విశేషములన్నియు "నవాబునందిని" యందు చదువవలయును వెల 2–50

**రాధారాణి** రచయిత:– శ్రీ చాగంటి శేషయ్యగారు రు. 0–50

నిరుపేదబాలిక "రాధారాణి" – గొప్పధనవంతుడు దేవేంద్రనారాయణరాయ్ దైవికసమావేశము—వీరిరువురి పరిణయగాథ.

**శ్రీ:** రచయిత– శ్రీ చాగంటి శేషయ్యగారు

చక్కని చారిత్రాత్మకమైన నవల

మహమ్మదుపురము శత్రువుల హస్తగతమైన పిదప అద్వితీయ ప్రతిభాశాలియు, మహారాజునగు సీతారామరాయ లెట్లు ప్రవర్తించెనో ఏరూపముతో నెట్టియవస్థయందెట్టి కార్యములాచరించుటలో బ్రవృత్తుడయ్యెనో యిందుమనోహరమైన శైలిలో హృదయరంజకముగా వర్ణింపబడినది. ప్రకృతియొక్క రీతి, నీతులిందు వివరింపబడినవి. చక్కనిఅచ్చు మంచిగ్లేజు కాగితం వెల రు 2-50 పై

**విశ్వప్రయత్నము** రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందలిరంగములును పాత్రములునునాంధ్రదేశమునకు సంబంధించినవి. కథాకల్పనము పాత్రగుణపోషణము, మొదలగునవి యిందు జక్కఁగాఁ బ్రదర్శింపబడినవి. ఇది సాంఘిక నవలయైనను, నపరాధ పరిశోధక నవలాలక్షణములచే నతి మనోహరముగ నలరారుచున్నది. మంచి గ్లేజు కాగితము, చక్కనిఅచ్చు!

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము

కపిలేశ్వరపురము తూర్పుగోదావరి

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 328 | విజయరంగ చొక్కనాథభూపాలుడు | 1 |
| 329 | ముతెంగంటి సింగరాచార్యులు | 6 |
| 330 | ముత్తరాజు వేంకటకృష్ణకవి | 18 |
| 331 | శేషము వెంకటపతి | 22 |
| 332 | వంగల సీనయార్యుఁడు | 28 |
| 333 | పాలవేకరి కదిరీపతి | 33 |
| 334 | బచ్చలి వీరవెంకకవి | 41 |
| 335 | రాపాక లక్ష్మీపతి | 51 |
| 336 | రేకపల్లి సోమనాథకవి | 61 |
| 337 | నెల్లూరి వీరరాఘవకవి | 73 |
| 338 | మంగళగిరి ఆనందకవి | 81 |
| 339 | సముఖం వెంకటకృష్ణప్పనాయకుఁడు | 96 |
| 340 | తుపాకుల అనంతభూపాలుడు | 109 |
| 341 | కళువె వీరరాజు | 114 |
| 342 | ఋగ్వేది వేంకటాచలకవి | 117 |
| 343 | శాహాజీ మహారాజు | 124 |
| 344 | తెనాలి రామలింగకవి | 131 |
| 345 | శేషాచలపతి | 142 |

| | | |
|---|---|---|
| 346 | బాలకవి సుబ్బన్న | 148 |
| 347 | సత్యవోలు భగవత్కవి | 151 |
| 348 | రేవూరి అనంతనార్యుఁడు | 164 |
| 349 | మాచవరం పాపనార్యుఁడు | 171 |
| 350 | కూచిమంచి తిమ్మకవి | 177 |
| 351 | పైడిపాటి వేంకట నృసింహకవి | 210 |
| 352 | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు | 217 |
| 353 | తాడేపల్లి పానకాలరాయకవి | 234 |
| 354 | తాడిపల్లి పానకాలరాయకవి | 240 |
| 355 | దర్భా గిరిరాజకవి | 244 |




శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## పదుమూడవ సంపుటము

### విజయరంగ చొక్కనాథభూపాలుడు

—⁂—

ఇతడు శ్రీరంగమహాత్మ్యమను వచనకావ్యమును రచియించి శ్రీవేంకటేశ్వరునకంకిత మొనర్చెను.

ఈ కవి, క్రీ. శ 1706 మొదలు 1732 వఱకును మధుర రాజ్యమును బరిపాలించిన నాయకప్రభువు మధురజిల్లాయును దాని చుట్టుప్రక్కలనున్న కొన్ని ప్రదేశములను మధురరాజ్యములో చేరియుండెడివి. దీనికి పాండ్యదేశమని పూర్వపుపేరు. దీనిని బరిపాలించెడిప్రభువులు పాండ్యులని పిలువఁబడుచుండెడివారు. ఈపాండ్యుల యనంతరమీరాజ్యము నాయకప్రభువుల యాధీనమైనది. ఈనాయక ప్రభువులలో నీవిజయరంగ చొక్కనాథభూపాలుఁడు కడపటివాఁడు. తంజావూరురాష్ట్రము విజయరాఘవభూపాలునితో నంతమయినట్లే మధురరాజ్యమున నాయకప్రభుత్వ మీ విజయరంగభూపాలునితో నంతమైపోయినది. మధుర నేలిన నాయకప్రభువుల వంశవృక్షమీ క్రింద నొసంగుచున్నాఁడను.


నాగమనాయక (కాశ్యపగోత్ర)
విశ్వనాథనాయక (భార్య) నాగమ 1
(శ 1529-64)
కృష్ణప్పనాయక I (భార్య) అక్కమ్మ 2
(1564-72)
or అక్కాయ్యంబిక 3
వీరప్పనాయక (భార్య) తిరుమలాంబిక 4
(1572-95)
కృష్ణప్పనాయక II
(1595-1601)
విశ్వప్ప
కస్తూరి రంగప్ప
ముట్టు కృష్ణప్పనాయక 5
(1601-1609)
ముట్టు వీరప్పనాయక I
(1609-శ-1623)
తిరుమలనాయక
(శ 1623-59)
కుమార ముట్టు 6
ముట్టు వీరప్పనాయక II
(1659)
చొక్కనాథనాయక
(1659-82)
(భార్య) మంగమ్మాళ్
(1689-1706)
ముట్టు లింగనాయక
(1678)
ముట్టు వీరప్పనాయక III భార్య ముత్తమ్మాళ్
(1682-89)
విజయరంగ చొక్కనాథనాయక
(1706-32)
(భార్య మీనాక్షి) (1732-36)

శ్రీకృష్ణ దేవరాయల కాలమునఁదంజావూరు మధుర రాజ్యములు రెండును గర్ణాటకమునకులోబడి యాప్రభువులు సామంతులై కర్ణాటకమునకుఁగప్పముగట్టుచుండెడివారు. ఆకాలమునఁదంజావూరు పాలకుఁడగు చోళుఁడు బలవంతుఁడై పాండ్యుని జయించి మధురను దనరాజ్యమునఁ గలుపుకొనియెను. రాయలదిసహింపక చోళుని జయించి మధురను బాండ్యునికిప్పింపుమని తనసేనానులలో మిగుల పరాక్రివంతుఁడగు నాగమనాయకునిపంపెను. ఆతఁడట్లే చోళుని జయించెను. కాని మధురను బాండ్యునికిప్పింపక రెండురాజ్యములను దానేస్వాధీనము చేసికొని స్వతంత్రుఁడై పరిపాలింపనారంభించెను. రాయలదిసహింపక కోపోద్దీపితుఁడై యాతనికుమారుఁడైన విశ్వనాథనాయకుని పంపించి, యాతనిజనకుఁడగు నాగమనాయకుని పట్టి తెప్పించి తంజావూరుమధురరాజ్యము లెవరివి వారికిప్పించివైచెను. ఆ విశ్వనాథనాయకుఁడేపై వంశమునందలి మూలపురుషుఁడును. రాయల యనంతరమునఁ దంజావూరు మధురలను బరిపాలింపసమర్థులు లేక పోవుటచేఁ దంజావూరునకు చినచెవ్వనాయకుని, మధురకు విశ్వనాథ నాయకుని, ప్రభువులుగాఁగర్ణాటకరాజులు నియమించిరి. అదిమొదలు దాదాపు రెండువందల సంవత్సరములీరాజ్యములు రెండును నాయక ప్రభువుల పరిపాలనమునందుండెను.

ఈ కాలమున నా రెండురాజ్యములందును నాంధ్రులు బ్రిబలులై యుండిరి. ఆకాలమున నాంధ్రిభాషయు వర్ధిల్లినది. ఈనాయకప్రభువుల కాలమున నాంధ్రకావ్యములు, కవులు బయలు వెడలిరి.

తంజావూరు రాజ్యమునకు కడపటినాయక ప్రభువైన విజయ రాఘవుని కాలమున యక్షగానకావ్యములు మిగుల నభివృద్ధిలోనికి వచ్చినవి. మధుర రాజ్యమునకు విజయరంగచొక్కనాథుఁడు కడపటి

నాయకప్రభువు. ఇతని కాలమున నాంధ్రభాషలో వచనకావ్యములు చాలనభివృద్ధిలోనికి వచ్చినవి. ఈ చొక్కనాథుఁడు శ్రీరంగ మాహాత్మ్యము, మాఘమాహాత్మ్యమునను రెండు కావ్యములను వచనమున రచియించెను. ఈతని యాస్థానకవులుకూడ వచన కావ్యములు రచించి యున్నారు.

తంజావూరు మధుర రాజ్యములలోని ప్రజలు అరవలు. వారి మాతృభాష అరవము. అయినను ఆ రాజ్యములను బరిపాలించిన నాయకులు నాంధ్రులగుటవలన వారినాశ్రయించి, యుద్యోగములను సంపాదించి, వృత్తులనేర్పఱచుకొని యాంధ్రులనేకులాకాలమున నా రాజ్యములలో నివాసముల నేర్పఱచుకొని జీవనయాత్రలను గడపు చుండెడివారు. వారివంశీయులిప్పుడును నారాజ్యములలో నున్నారు. కాని వారు తామాంధ్రులమనుమాట మరచిపోయి తమిళులలో నైక్యమైపోయిరి.

విజయరంగచొక్కనాథుని యాస్థానమున నాంధ్రకవులనేకు లుండెడివారు. అందు జాణిగె కృష్ణకవీంద్రుఁడుండెడివాడట ఆతఁడు రచించిన గ్రంథనామములు నాకెఱుంగరాలేదు అందుచే నాతని నీతరంగిణియందుఁ జేర్చలేదు. తక్కిన కవుల చారిత్రములను క్రమముగానిందు వ్రాయుచున్నాఁడను.

ఆ కాలమున వచనకావ్యముల రచనము నూతనమైనను జొక్కనాథుని రచనము మృదువై సరసముగాను, మధురపదసంయుతముగానుండి హృదయరంజకముగా నున్నది. ఇతఁడు కవియు కవిపండితపోషకుఁడునై యున్నవాఁడు.

విజయరంగచొక్కనాథ నాయకుడు 1706 లో రాజ్యమునకు వచ్చెను. 1712 వ సంవత్సరములోని మార్చి 8 వ తారీఖునందలి

శాసనమందు కస్తూరి రంగయ దళవాయిగను, వెంకటకృష్ణయ ప్రధానిగను చెప్పబడి యున్నది. ఇతను తనదృష్టిని దేవాలయముల మీదను, దానధర్మముల విషయములందును కేంద్రీకరించెను. ఆలయనిర్మాణములనుగూడ గావించెను. నిత్యము మతవిషయములందు మనసును, కేంద్రీకరించి రాజకీయములపై నశ్రద్ధవహించెను. ఇదియే అదననుకొని అతనిమంత్రులు నరవప్పయ, వేంకటరాఘవాచార్యులును శిస్తులనపహరించుచుండెడివారు. ఇదియే మధుర రాజ్య వినాశమున కంకురార్పణమైనది. దానికితోడు యితని ప్రబలశత్రువగు భవానీశంకరుడు తరచు దండయాత్రలు సల్పుచు నీతని ననేక బాధలకు గురిచేసెను. ఉద్యోగుల అవినీతిపరిపాలనకుతోడు 1710–1720 మధ్యనవచ్చిన కరువు ప్రజలనెక్కుడు బాధపెట్టెను.

ఇతని యనంతరము నీతని భార్యయగు మీనాక్షి సింహాసనమలంకరించి 1732–36 వరకును రాజ్యము నొడుదుడుకులతో పాలించెను. చివరకీమె 36వ సంవత్సరమునందు విషముతీసుకొని ఆత్మహత్య గావించుకొనెను. దానితో మధుర రాజ్యము నంతమైపోయినది. ఈమె కుమారముట్టువంశీయుడగు బంగారు తిరుమలకుమారుడగు విజయకుమారుని దత్తతచేసికొనెను. బంగారు తిరుమల, మధురనాక్రమించుకొనిన మహమ్మదీయులతో పోరు సల్పెను, కాని అన్వారుద్దీన్ చే చంపబడెను. తరువాత మధుర రాజ్యమంతయు మహమ్మదీయుల హస్తగతమయ్యెను. తండ్రి మరణానంతరము నాతని కుమారుడగు విజయకుమారుడు శివగంగకు పారిపోయి అచటనే స్థిరనివాసమేర్పరచుకొని సామాన్యముగా జీవితమును గడిపెను.

ఈతని శ్రీరంగమాహాత్మ్యమను, వచనకావ్యము నంతనిర్దుష్టముగానుండునని తలంచుటవలననుపడదు. ఈతని రచన సులు

వుగా నర్థమగునట్లు, వ్యావహారిక శైలిని సాగిపోయినది. ఈ కవిచంద్రుని యాస్థానమున నాంధ్రకవులు అగ్రస్థానము వహించి యనేక వచన కావ్యములను రచియించి యుండిరి. అందు శేషయ వేంకటపతి, సముఖం వేంకటకృష్ణప్పనాయకుడు. వెలగపూడి కృష్ణకవి నీకవి యాస్థానకవులుగాయుండిరి. అందుకొందరు నీకవితల్లజునికి తమ రచనలంకితమొనర్చిరి.

—❁★❁—

## 329. మఱింగంటి సింగరాచార్యులు

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు. హారీతగోత్రుఁడు. నైజామురాష్ట్రములోని నల్లగొండ మండలమందలి దేవరకొండసీమలోనున్న పణకరాజుపల్లెయను గ్రామ మీతనినివాసము.

ఇతనితండ్రి తిరువెంగళాచార్యుఁడు; తిరుమలదేశికుఁడు పితామహుఁడు; భట్టరు ప్రపితామహుఁడు; చెన్నరాయాచార్యుఁడు వృద్ధప్రపితామహుడు.

ఈవంశమువారికి తొలుత ఆసూరివారు యను గృహనామముండెను. తరువాతను మఱింగంటివారైరి. మఱిగల్లు యను గ్రామనామమునుబట్టి మఱింగంటియను గృహనామము వచ్చియుండవచ్చును. ఈవంశమువారికి మఱింగంటియను నింటిపేరు గలుగుటకొక కథకలదు. ఒకప్పుడు భక్తాగ్రేసరులగు లక్ష్మణమునియు, కూరేశాచార్యులును, సాధుభట్టారకుఁడును శ్రీరంగమునందలి శ్రీరంగశాయిని దర్శింప నేగిరి. శ్రీరంగనాథుఁడీ మూవురిలో మొదటి యిరువురను గుర్తించి, మూఁడవవారినిగూర్చి మఱింగంటినాతఁడెవ్వఁడని ప్రశ్నించెనట. అతడు సాధుభట్టారకుఁడని తెలుప

సంతసించి వారి ననుగ్రహించెనట. ఆ సాధుభట్టారకుఁ డీవంశము నకు మూలపురుషుఁడు. శ్రీరంగనాథుఁడాతనిని 'మఱింగంటి' యని యడుగుటచే నాతనిని మఱింగంటి సాధుభట్టారకుఁడని ప్రజలన జొచ్చిరఁట! తరువాత నాతని వంశమువారందఱును 'మరింగంటి' యను నింటిపేరుగల వారైరఁట. ఈవిషయము లీక్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది

క. కంటిన్ లక్ష్మణమునివరుఁ
గంటిన్ గూరేశ దేశిక స్వామి మఱిం
గంటి నదెవ్వరన మఱిం
గంటి మహాన్వయము దనరెఁ గణ్యంబగుచున్.

తే. గీ. సలలితాసూరికుడిచేఁ బ్రశస్తిఁగన్న
సాధుభట్టారకుఁడు రంగశాయివలన
నిల మఱింగంటివారన్న యింటిపేరు
గురుశిఖామణులెన్నఁగా బరిఢవిల్లె.

క. నిరహేతుక కృపచేతను
సిరివరుఁడగు రంగశాయి సిరులింపొదవన్
గరుణాకటాక్ష వీక్షణ
గరిమను బ్రియపుత్రుఁగాంచు కైవడికూర్మిన్.

క. మునురంగశాయి కృతిపతిఁ
గనుఁగొని కూరిధి నాథుఁగాంచి మఱింగం-
టిన దెవ్వరి ననసాశో
భనగతి నాసూరిసాధుభట్టరుఁడలరెన్.

తే. పరమకృపచేత శ్రీరంగపతియు యిట్లు
లానతిచ్చిన శ్రీసూక్తి యన్వయముగ

మఱింగంటి వార నేయింటి పిర
గురుశిఖామణులెన్నంగఁ బరఘనిల్లె. —సీతాకల్యాణము.

తాలాంకనందినీ పరిణయకర్త మరింగంటి వెంకటనృసింహాచార్యులు కవి తన్ను గూర్చి చెప్పుకొనుసందర్భమున

కం. కంటిమి మిముకూరేశుల
కంటిమి మీవెంటవచ్చు ఘనులెవరా మఱిం
గంటిమనివల్క నదిమా
కింటికి పేరుంటనామహిన్ రహికెక్కెన్.

అని తమగృహనామము 'మఱింగంటి' యనుటకు ప్రశస్తిని చెప్పి యుండెను.

సింగరాచార్యులుతల్లి వరదాంబ. తండ్రి తిరువెంగళాచార్యులు. ఈదంపతులకుఁ గలిగిన యెనమండ్రు తనయులలో సీతఁడాఱవవాఁడు. ఈ సోదరుల నామము లీక్రింద పద్యమువలనఁ దెలియును.

సీ. ముగురు రాజులచేత మొ్రక్కులుగొన్నట్టి
భగవత్సమానుఁ డప్పలగురుండు.
వేదవేదాంగాది వివిధార్థసంపత్తి
నతిశయిల్లిన వెంకటార్యమౌళి.
కవితసౌందర్య రేఖావిలాసంబులఁ
జెంగలించెడి (శ్రీ) నృసింహవిభుఁడు
కుపితమాయావాది గురుశాస్త్ర పా
రగుఁడైన కోనేటి రాయశౌరి

గీ. సరసశతపద్యలేఖకా విరచనోక్తి
గల జగన్నాథసూరు లగ్రజులు గాఁగ

వలరి రంగప్ప నరసింగరప్ప తమ్ము
లై మెఱయువాఁడ భువి సింగరాహ్వయుఁడ.

ఈ సింగరాచార్యులు సంస్కృతాంధ్రములయందు గొప్పపండితుఁడు. ఉభయభాషలయందును గవిత్వము చెప్పఁగలిగిన మహాకవి. ఆంధ్రమున దశరథరాజనందన చరిత్రము నిరోష్ఠ్యముగ నొకమహా ప్రబంధమును రచియించెను. మఱియు శుద్ధాంధ్రనిరోష్ఠ్యముగ సీతాకళ్యాణమను పద్యకావ్యమును జేసెను.

ఇతఁడు తొమ్మిదేండ్ల వయసునుండియు గ్రంథరచనమును సాగించినట్లీ క్రిందిపద్యమువలన దెలియుచున్నది

సీ. సిరులఁ దొమ్మిదియేండ్ల వరదరాజస్తుతి
శ్రీరంగశతకంబుఁ జెప్పినావు
పదియేండ్లనాడును బహుచమత్కృతులచే
శ్రీ సుదర్శన నుతిఁ జెప్పినావు.
ఎలమితోఁబదునొకండేండ్ల బాలుఁడవయ్యు
కవి కదంబరచనఁ గావించినావు
వరుసతోఁ బండ్రెండు వత్సరంబుల వేడ్క
శతసంహితయుఁ దెల్పు సల్పినావు
రమణఁబదియు మూఁడేడుల రామకృష్ణ
చరిత మిల ద్వ్యర్థి సంశ్లేషచంద మొదవ
నాంధ్రభాషను రచియించి తౌరభువిని
శబ్దశాసనం బిరుదాంక శాలివగుచు.

గీ. వరుసఁబదునాల్గు పదియేను వత్సరముల
సరస కవితాష్ట భాషా విశేషకృతుల

సరణులేర్పడ నాటకశాస్త్రమెల్ల
గరిమ విరచించితివిగాదె కవులు నెన్న!

గీ. అనఘ! ప్రేమాభిరామ ధనాభిరామ
కావ్యములు జాతివార్తలు గడలుకొనఁగ
ద్విపదలుగఁ జేసితివి కవినృపతులెన్నఁ
బూని షోడశ వత్సరంబులనె మొదల.

క. నలయాదవ రఘుపాండవ
సలలితలీయార్థ కావ్యసంశ్లేషకృతుల్
ఎలమిదశసప్త హాయన
ములవడు కాలంబునందు నతిమధురోక్తిన్.

సీ. తనరఁబదునెన్మిది వత్సరంబులనాఁడు
సలలితాలంకార సంగ్రహంబు
రాకాసుధాపూర్ణ రసపుష్పగుచ్ఛంబు
నాంధ్రభాషాభూషణాఖ్యకృతియు
విరివిగారచియించి వెలయఁబందొమ్మిది
హాయనంబులనాఁడ నఖిలశబ్ద
కవినేత లిలశిరఃకంపంగావింప
ఘనశబ్దశాస్త్రాది కల్పనల
నెలమిఁగావించి యిరువది యేండ్లనాఁడు
ఘననిరోష్ఠ్యాది వింశతికావ్యములను
విలసిత ప్రౌఢినిర్మించి వెలసి తీవు
సింగరాచార్య కవిరాయ శ్రితవిధేయ!

ఇంత చిన్నతనముననే కవిత్వమారంభించుటయు నిన్నిగ్రంథములను రచించుటయుఁ గవియొక్క పూర్వజన్మ పుణ్యమని చెప్పనొప్పును.

ఈ కవి వంశీయులు పూర్వమునుండియు గొప్పపండితులై యుండిరి. ఈతని యితర గ్రంథములెవ్వియు నీతని దశరథరాజనందన చరిత్ర యందు బేర్కొనియుండలేదు. కవితన్నుగూర్చి గద్యయందు యిట్లు చెప్పుకొనియున్నాడు.

గద్య 'ఇది శ్రీమత్కర్పరాచల లక్ష్మీనృసింహ వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ సకలైశ్వర్యధురీణ శారదాప్రశ్నవివరణ శతఘంటావధాన వినయధునీతరంగ విజృంభణాజృంభిత సలలిత మృదుమధుర వాగ్వైగరీ ఝరీణ ధురీణ స్థాపితాశేష విశేష ప్రసిద్ధసాహిత్య సారస్వతాసు కవితాష్ట భాషావిశేష సంస్కృతాంధ్ర నిరోష్ఠ్యోష్ఠ్యాది వింశతిప్రబంధనిర్మా ధురీణ మౌద్గల్య మహర్షిగోత్ర పవిత్ర తిరుమల దేశికేంద్రపౌత్ర తిరువేంగళాచార్యపుత్ర మఱింగంటి సింగరాచార్య కవిరాజ ప్రణీతంబయిన'

గద్యలోనున్న 'శారదాప్రశ్నవివరణ' 'శతఘంటావధాన' అను బిరుదములనబట్టి నీ కవిశతావధానియనియు, శారదయొనర్చిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పెననియుఁ దెలియుచున్నది. సరస్వతి ప్రచ్ఛన్న రూపముతోఁ గవికిఁ బ్రత్యక్షమై 'నఱుక' 'పెఱుక; 'ఎఱుక; 'యిఱుక' యను నాల్గుపదములగూర్చి పద్యముఁ జెప్పుమన నీకవి యాపదములఁ బవ్యాదినిఁ జేర్చి యొకపద్యము రచించెనట. అది మొదలు సరస్వతి వశ్యురాలయ్యెనని ననేకలు చెప్పుచున్నారు.

ఈతఁడు తననిరోష్ఠ్యప్రబంధమగు దశరథరాజనందన చరిత్రమును శ్రీ వేంకటేశ్వరస్వామికిఁ గృతియిచ్చెను. నిరోష్ఠ్య ప్రబంధమనగా ఉచ్చరించునప్పుడు ఓష్ఠసంచలనమయ్యేడి ఉపవర్గము, వయను నక్షరములు రాకుండు రచించిన గ్రంథమనియర్థము. అట్టి

గ్రంథమును సంస్కృతమున శాకల్యమల్లన రచించెనట. ఆంధ్రమున మొదట తానే యిట్టి గ్రంథరచనకుఁ బూనికొంటినని కవి యీ క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. మును రామాయణము నిరోష్ఠ్యముగ నింపుల్ మీఱ శాకల్యమ
ల్లనతా సంస్కృతభాషఁ జేసె ననినాలాగున్ జెవుల్ నిండగా
వినుటే కాని ధరిత్రిపై నిజముగా వీక్షింప లేదట్టిదేఁ
దెనుగుం జేసెద నల్లెడం గవులకున్ దృష్టాంతమై యేర్పడన్.

సింగరాచార్యకవి కవితాశిల్పమునఁ గ్రొత్తవన్నెలఁ బచరించుటయందు నైపుణిఁ గలవాఁడు. అంతకుఁ బూర్వమాంధ్రకవులు బూసిన నిరోష్ఠ్యరచనముఁ గావించెను. అంతటితోఁ దృప్తినొందక శుద్ధాంధ్రమున నిరోష్ట్యము బాటించి సీతారామకళ్యాణమును రచించెను. ఈయుభయ మార్గములకు నీకవియె యాద్యుఁడు. సీతాకళ్యాణము మూడాశ్వాసముల ప్రబంధము. కర్పూరాద్రియందలి శ్రీహరికి గృతి యీయబడినది. శైలికి పద్యముల నీదిగువనుదహరించుచున్నాను.

మ. జిగిచన్గట్ల సియాడఁ దీఱయిన లేచెక్కిళ్ళ చక్కిన్నిగ
న్నిగ లీనంగఁ గడారికంటి సిరిడాల్ నిండంగఁ గై చిన్నియల్
తెగలైనల్ దెసలానిచక్కఁగఁ జికిల్ సేయన్ నెఱా సిగ్గదన్
దగలన్ రానెలఁ జేరి కాళ్ళకడ చెంతన్ సాగిలెన్ తిదాన్.

సీ. చేరి నాదారంగఁ జేరిన నెదిరి
తిన్నగఁగ న్దెఱచి గాంచి నగఁగ నేర్చె
కెంజాయ దేఱిన కెంగేలిఁ గాల్లాచి
తటతట నాడించి తఱల నేర్చె
సారె నట్టిట్టయి సాగి చక్కగ నేల
... యానకయసి యాడ నేర్చె

తననీడఁదాఁజక్కఁగని యాని
నంటఁగాఁజాల నక్కఱచేతఁజరగనేర్చె

తే. ఎంతెయుండెల గజ్జల రంతెసంగ
దిగదిగఁ నఁగనెచ్చెరిక నేర్చె
నేర్చినీడఁ బురానెలవేనిండి యా
గై సేత తేటచిన్నెలు చెలంగ.

ఈ మహాకవి దినమునకొక్క ప్రబంధమును రచింపగల దిట్టయని యాక్రింది పద్యమువలనఁ దెలియనగును.

మ. వరవందారు జనావళీహృదయ సద్వాంఛార్ధ కృద్వేంకటే
శ్వర సంపూర్ణ కృపాసుధామిళిత వీక్షామాధురీమార్గ వి
స్ఫురితైకైక దినప్రబంధ రచనాస్ఫూర్జద్వచశ్శ్రీకుడన్.

గీ. వాసి దెబ్బదినాల్గు, సింహాసనముల
గురువుల సమగ్రవైభవాకరులఁగొలిచి.

ఈకవి గణపవరపు వెంకటకవివలె స్వరచిత గ్రంథసంఖ్యను ధారాళముగ బెంచినవాఁడు. ఇతడు నరపతులయొక్కయు గజపతుల యొక్కయు అశ్వపతులయొక్కయు సభలయందు సన్మానములంది యున్నట్లు చెప్పికొని యున్నాఁడు.

ఇతని యన్నయగు అప్పలాచార్యుఁడు తనపాండిత్య ప్రకర్ష చే అశ్వపతి నరపతి గజపతులను మెప్పించి వారలచే మ్రొక్కులుగొన్న వాఁడట. ఆతని నీకవి నీక్రిందివిధముగా స్తుతిచేసియున్నాఁడు.

గీ. రాజపూజితు వేదశాస్త్ర ప్రవీణు
సరస సాహిత్యలక్షణ చక్రవర్తి
నుభయభాషా కవిత్వధుర్యుని మదగ్ర
జన్ము మరిగంటి యప్పలాచార్యునెంతు.

పొన్నికంటి తెలగనాచార్యునిచే యయాతి చారిత్రమును అమీను ఖానునకుఁ గృతిసేయించినదీ యప్పలాచార్యుఁడే. అందుచే తెలగనార్యుఁడును సింగరాచార్యకవియును సమకాలికులు. కావున నీ సింగరాచార్యులు క్రీ.శ. 16వ శతాబ్దాంతముననున్న వాడని చెప్ప వచ్చును.

ఈకవి పింగళి సూరనార్యకృతమైన రాఘవపాండవీయద్వ్యర్థి కావ్యమును; బాలసరస్వతి విరచితమైన యాదవ రాఘవపాండవీయ త్ర్యర్థి కావ్యమును జూచి నల్ల యాదవ రాఘవ పాండవీయమును నాల్గర్థముల గ్రంథమును రచించి తన ప్రతిభావిశేషమును బ్రకటించెను.

ఈకవి తనవంశమునకు బూర్వుఁడగు చెన్నయాచార్యమౌళి నిట్లు వర్ణించుచున్నాఁడు.

సీ. రాజపుత్రికిఁబూను రాక్షసుఁబోఁదోలి
   బెనుబాముముక్తికిఁ బెట్టిపంపె
నవని బందొమ్మంద్రయన్నలతోఁ బుట్టి
   హరిలీలఁ బావనుఁడగుచు మించె
మనవాళయోగికి మఱియుద్ధియైయుండె
   వనదంతిచేతఁ బూజనములందె
శాస్త్రోక్తినరటర చక్రవర్తులగెల్చె
   బైకొన్నబెబ్బులిఁ బాఱనడచె

తే. తగ ననంతాళువారలఁ దనరునట్టి
యురగపతిసంగతిని దల్లి కుద్భవించె
విమలగుణవర్తి ప్రత్యక్ష విష్ణుమూర్తి
చారుతరహేళి చెన్నయాచార్యమౌళి.

తే. సిరుల దేవరకొండకుఁ జేర్వ పడక
రాజపల్లియగట్టుపై రాజులెన్న

శ్రీమరింగంటి చెన్న దేశిక శశాంకుం
డహహా మరింగంటి చెన్న రాయడన వెలసె.

కవి తనతండ్రినిగూర్చి ఈక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

తే. వడమ ద్రావిడ యాసూరివంశ రాజు
గురుతరంబైన మౌద్గల్యగోత్ర రాజు
చతుర మఱింగంటి వేంగళాచార్య రాజు
రాజరాజాది దేశిక రాజరాజు.

ఉ. దాపున నాయనంతగిరి ధర్మపురీస్థలి యూరుగొండ గం
గాపురి బ్రహ్మరాయపురి కర్పర రేబలి యెండబెట్లు బా
ధేపలి యాదియైన హరితీర్థములం గురురాయపట్టణ
స్థాపకుఁడై చెలంగెబుధ సమ్మతి వేంగళనాథుఁ డెంతయున్.
—సీతారామకల్యాణము

పై గ్రామములన్నియు నిజాం రాష్ట్రములోనివే. కవిది పణకరాజు పల్లె, నివాసమైయుండి 'పణకరాజుపల్లెను' 'కర్పరిపురి' యనియు నచటి శైలమునుఁ గర్పరాచలమనియు సంస్కృతీకరించి యుండును. నిజాం రాష్ట్రములో నల్లగొండ మండలములోని దేవరకొండ ప్రాంతమునగల పణకరాజుపల్లె నొక కుగ్రామమైయున్నది.

ఇతడు రచించిన వింశత్యాధిక గ్రంథములలోను దశరథ రాజనందనచరిత్ర అయిదాశ్వాసముల నిరోష్ఠ్యప్రబంధము; సీతాకళ్యాణము ముద్రితమైనవి. తక్కిన గ్రంథములు మృగ్యములు.

చరిత్రకారులకుపయోగకారియగు నను నుద్దేశ్యముతో డా॥ బి. రామరాజుగారు 'ఆంధ్రభూమి' 30-9-1960 తేదీ పత్రికలో ప్రకటించిన ఆసూరి మఱింగంటికవులు అనుశీర్షికయందలి కొన్ని భాగము లిందుపొందు పరచితిమి. ప్రకాశకులు

"తరతరములనుండి గీర్వాణాంధ్రభాషా కవివతంసులుగా పేరెన్నికగన్న ఆసూరి మఱింగంటి శ్రీవైష్ణవకుటుంబములకు తెలంగాణమందలి నల్లగొండమండల మాకరము. దేవరకొండతాలూకాలోని కనగల్లు, జనగామ తాలూకాలోని మల్లంపల్లి, మిరియాలగూడెం తాలూకాలోని అనుమూల గ్రామములు వీరి నివాసభూములు. ఈమఱింగంటివారి కోవలో చరిత్రకందిన ప్రాచీనులు ఆసూరి మఱింగంటి సింగరాచార్యులు. వీరికి పదునాల్గవ తరమువారగు ఆసూరి మఱింగంటి శ్రీరంగాచార్యులు వారరువదియేండ్లుదాటిన వృద్ధులు. కనగల్లుగ్రామమున సజీవులై యున్నారు. వీరికడనే పూర్వకవుల గ్రంథముల ముద్రితములు తాళపత్రములందు భద్రపరుపబడి యున్నవి. విశిష్టాద్వైతమత ప్రవర్తకులగు భగవద్రామానుజలవారి యింటిపేరుకూడ యాసూరివారే ... ... ... ...

మహాకవి సింగరాచార్యులు జన్మస్థలము హుజూరు నగరము తాలూకాలోని యాతవాకిళ్ల గ్రామము. సింగరాచార్యులు మహాకవియగుటయేగాక మహాపండితుఁడై ప్రతివాదభయంకరుఁడై నెగడినవాఁడు. ఆశుకవి, ప్రతివాదభయంకర శబ్దశాసన, శతఘంటావధాన బిరుదవిభ్రాజితుఁ డీకవివతంసుఁడు. మల్కిభరామని తెలుగు వాఙ్మయమునఁబ్రసిద్ధి గాంచిన ఇబ్రహీంకులీ కుతుబ్‌షా వలన నీమహాకవి మత్తగంధేభ సితచ్ఛత్ర ముత్తమాశ్వ హాటకాంబర చతురంతయానాగ్రహారములందెనని శ్రీకృష్ణ శతానందీయము నందున్నది. కనుక నీకవి పదునారవ శతాబ్దము నుత్తరార్థమున నుండినట్లు భావింపవచ్చును...... సింగరాచార్యులు తన కవిత్వమునుగూర్చి చెప్పుకొన్న పద్యము గమనింపదగినది.

చం. అరువతె చన్నులంబలె బయల్పడనీయక ఘూర్జరాంగనా
గురుకుచయుగ్మముల్వలె నిగూఢముఁగాక తెనుంగు దేశపుం

గరిత చనుంగవంబలె నొకానొకయించుక గానుపించఁగా
సరసులు మెచ్చఁ జెప్పెదను సత్కవిశబ్ద పటుత్వవైఖరిన్.

పై వ్యాసములో నుదాహరింపబడిన 'శ్రీకృష్ణ శతానందీయము' మజెంగంటి వెంకట నృసింహాచార్యులు కృతము.

మహాకవి సింగరాచార్యులు రచనలశైలి దెలియుటకై కొన్ని పద్యములు నిట నుదహరించడమైనది.

శా. ఆరాలేనెల లంతకంత కతిరాజకార లేఖాకళా
సారాచారా శరాసనాస్త్ర కలనాసారస్య లక్ష్మ్యాశ్రం
గారజ్ఞాన దయాంచిత స్థితి తితిక్షాసత్య ధైర్యక్రియా
శ్రీరంజిల్ల జరించసాగిరి జయశ్రీ హెచ్చ నానాటికిన్.

చ. చనిచని కాంచెఁ జెంగటు నిశాచర హంత సతీసహాయతన్
ఘనతర కేతకీ కదళికాహరిచందన కందరాళ కాం
చన ఘనసార తాళ గణసంచిత కాననధాత్రినందజా
ఖ్యానతిశయిల్లినట్టి జటినంచిత శిమ్యజనచ్ఛటా తతిన్.

చ. కటకట తాటకారి తనకాంతదలంచఁగలేక యుష్టది
క్తటు హరిసేనలన్ గలసికన్నిధి చెంగటికేగి నిల్చినా
డట గిరిజాగిరీశ సహితాద్రి నహీనకరాళసార సం
ఘటిత కరాగ్రశక్తి సిరగందుఁగనెత్తిన నన్నెఱుంగఁడే.

ఉ. ఎంచనిశాటసంతతి జయించగ నాశ్రితదాసరాజ ర
క్షించగ శాపశాయి హరికిడ్డధరా తనయాధిక ర్తయై
నించినకీర్తిసంధిల జనించిన కట్టడియాది నాకెటిం
గించె రణాళనర్థియడగించఁగరిత్తచనంగ నేర్చెనే.

చ. అలరగనింకిటన్ హాలధరాకృతి నాగడరీతి కాంతలం
గలచెడి యాకృతిన్ గలిక గాగలచరలెటన్ననష్నయా

జలజజకర్ణరేఖతతి జక్కనిదృష్టిని దేలికాంచ దా
గలకలగేర దాశరథి కాంతిదనర్చి శశాంకరీతిగాన్.

మఱింగంటి వారి వంశవృక్షమునకు మఱింగంటి వేంకటనృసింహా చార్యులు వారి చారిత్రమున జూడనగును.



## 330. ముత్తరాజు వేంకటకృష్ణకవి

ఈతఁడార్వేలనియోగి బ్రాహ్మణుఁడు; అపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు; తండ్రి శివరామమంత్రి; తల్లి వల్లమాంబిక కొండయార్యుఁడు తండ్రితండ్రి; సీతాంబ తండ్రితల్లి.

ఈకవి బ్రహ్మోత్తరఖండమును నైదాశ్వాసముల పద్యకావ్యముగా రచియించి, జన్నవాడ మల్లేశ్వరస్వామికిఁ గృతియిచ్చెను. అందలి గ్రంథాంతగద్యవలన నీతఁడు జయదేవ విరచితమైన అష్టపదులను కర్ణామృతమును గేయములుగా రచించినట్లు కన్పట్టుచున్నది. కాని, యాగ్రంథములిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు.

"ఇది శ్రీమదభినవ సంస్కృతాంధ్ర భాషాద్వయ ప్రకల్పిత పటుశబ్ద నాటకాలంకార విశేషనైపుణ్యానల్పకల్పిత శ్రీ జయదేవ లీలాశుక మహాకవి ప్రశస్త విరచితాష్టపది కర్ణామృతాది షడ్విధ సంస్కృతాంధ్ర భాషాప్రకటిత భగవద్విలాసాదిచూర్ణికాల సద్భరత శాస్త్రానుకూల గీతాదివిచిత్ర కథానుమేయ వైదికాచార ప్రయుక్త షడ్దర్శన జాలాగమప్రవీణ ధౌరేయ ముత్తరాజ వంశపయః పారావార సంజాత శిశిరకరాయమాన శ్రీమజ్జన్నవాడ కామాక్షీ వర

ప్రసాదలబ్ధ సారస్వత విస్ఫూర్జిత జేగియమూన శివరామ ప్రధానాగ్ర గణ్యాతనయ వేంకటకృష్ణాభిధేయ ప్రణీతంబైన బ్రహ్మోత్తర ఖండం బను మహాపురాణప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము''

ఈతని బ్రహ్మోత్తరఖండమింకను ముద్రింపఁబడలేదు. శిథిలా వస్థలోనున్న యముద్రిత ప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్నది. ఈకవి యీగ్రంథమును రచించి కృత్యాదివ్రాయకుండఁ గాలధర్మమునొందుటచే, నీతనికుమారుఁడైన వేంకటాచలమనునాయన మైనముపాటి కేశవకవిచే కృత్యాది వ్రాయించి గ్రంథమును బూర్తిచేసెను. కేశవకవి పద్యములు వెంకటకృష్ణకవి కవిత్వమంత సరసముగాలేవు.

ఈకవి గృహనామము మొట్టమొదట నరహరిప్రగడ వార నియు నందు ముత్తరాజను నాయన శ్రీకృష్ణదేవరాయనికాలములో యుద్దగిరి సర్వేపల్లి సర్కారులలో మిరాశీలను గల్పించి, కీర్తినార్జిం చిన వాఁడగుటచే నప్పటినుండియు నీవంశమువారు ముత్తరాజువారని పిలువఁబడుచుండిరనియు నీక్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది.

సీ. ఆదిపీఠకగ్రమంబంతయు ముదముతో
వివరించెదను మహావిశదఫణితి
ధరనమాత్యులలోన నరహరిప్రెగడ వా
రని ప్రసిద్ధముగా మదన్వయంబు
ప్రకటమై సద్యశోభరిత దిగంతర
శోభితంబై మహావైభవమున
నుండెనంతట సుగుణోత్తరుఁడగు మహా
పురుషుఁడుద్భవమయ్యె భూరిమహిమ

గీ. నతనిపేరను పునరన్వయక్రమాభి
వృద్ధి భూమండలమున సమృద్ధినొంది

భాసురంబయ్యెనే తత్ప్రభావగరిమ
నలరు పావననామ విఖ్యాతి వినుఁడి.

మ. పరదుర్మ్రాత్రి విభంగకృచ్చతురిమా పాండిత్యలాక్ష్వేల భూ
సురవంశాగ్రిణులైన మంత్రివరపూజ్యుల్ ధీమణుల్ వారం
డటిలోఁ గమ్మెలుకి నుత్తముల్ ఘనముఖ్యుల్ ధన్యుల్
ప్రసిద్ధాన్వయా
కరులై వృద్ధి సమృద్ధిగాంచరనుచున్ గల్పించె నాధాతయున్

శా. ఈరీతిన్ బుధబంధుమంత్రి వరసాహిత్యాగ్రగణ్యుల్ సదా
చారోదారులు సజ్జనుల్ నిరతమున్ సంతోషితస్వాంతులై
వారల్ సంతతిసన్నుతింపఁగను నీవంశంబుశంబుట్టి గం
భీరారంభుఁడు ముత్తరాజనఁగ శోభిల్లెన్ ధరామండలిన్

మ. జననంబాదిగఁ గృష్ణరాయల మహాస్థానంబు గన్పట్టి స
ద్వినయోద్యద్గుణ వైభవంబుల మహావిఖ్యాతిచే రాచకీ
విని జెంపొంది చరించి యుద్దగెరి సర్వోపల్లె సర్కార్లలో
ఘనమామేర మిరాశిజీవనములన్ గల్పించి తావంశ పా
వనుండై మించెను ముత్తరాజు బుధవర్గంబుల్ నుతింపన్ ధరన్

క. ఆముత్తరాజు పేరను
శ్రీమించుమదన్వయ ప్రసిద్ధంబయ్యెన్
క్షేమంబున రజితాద్రి
స్వామికరుణ ముత్తరాజువారనఁగ ధరన్

కవితండ్రియైన శివరామామాత్యుఁడు, జన్నవాడకామాక్షీ భక్తుఁడనియు, నాతనిపై నెవఁడో దుర్మార్గుఁడు తుపాకిగుండ్లను ప్రయోగింపఁగా నాతని యిష్టదేవతయగు కామాక్షీదేవి యాతనిని రక్షించెననియు నీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. రాజితపుణ్యశాలి శివరామసుధీమణి జన్మవాడ వి
భ్రాజిత మల్లికార్జున వరాంగనచే సకలేష్టదంబులై
రాజివిభాగ్యవైభవకరంబులునైన వరంబులంది పం
కేజభవాండభాండమునఁ గీర్తి చెలంగ మెలంగె నిద్ధరన్.

తే. అతనిగుణచర్యలెల్ల మహాద్భుతంబు
లవని పదివత్సరములు శూద్రాన్నభక్షుఁ
డైన విప్రునిఁ జేపట్టి యతులబ్రహ్మ
నిష్ఠునిగఁ జేసె నవ్విధం బెట్టిదనిన.

శా. హాలాపాన విజృంభమాణ మదరాగాయత్తుఁడై యొక్కఁ దు
శ్శీలుండా శివరామ మంత్రివరుపై సీసానలజ్వాలికా
జాలోద్యద్ఘుటికా ప్రయోగమడరించన్ దేవి కామాక్షి తాఁ
జేలాగ్రంబునఁబట్టి కాచెను గటాక్షీభూతదాక్షిణ్యయై.

కవి కగ్రజుఁడైన కొండమంత్రి యీక్రింది పద్యములో వర్ణింపబడినాఁడు.

ఉ. ఆరయ నగ్రజుండతుల హర్షసమగ్ర మనోజ్ఞ మన్మథా
కారుఁడు నాశ్రితార్థిజనన కల్పసమానుఁడు కొండమంత్రి కె
వ్వారును సాటిలేరనుచు వర్ణనచేయఁ జగత్ప్రసిద్ధిగా
ధీరుఁడు మంత్రిశేఖరుఁడు ధీయుతుఁడై విలసిల్లె నిద్ధరన్.

ఈకవి నివాసము నెల్లూరుమండలములోని కొవ్వూరు తాలూకాయందలి జొన్నవాడయను గ్రామము. ఈకవి పదునెనిమిదవ శతాబ్దివాఁడని తోఁచుచున్నది.

నెల్లూరు మండలములోని అన్నారెడ్డిపాలెం వాస్తవ్యులైన ముత్తరాజు చెంచు కృష్ణారావుగారి పేర వ్రాయఁగా నీకవి వంశవృక్షమును సంపాదించి పంపిరి. ముత్తరాజు అను గృహనామము

గలవారిలో నేడు శాఖలున్నవట. జన్నవాడ నెల్లూరునకు పడమ రను నాలుమైళ్ల దూరములో నున్నదట. వెంకటకృష్ణకవి క్రీ.శ. 1700 ప్రాంతమునం దుండెనని యావంశవృక్షమునఁ గలదు. ఈ కవి నాలుగురు పౌత్రులు. వీరివంశము మిగుల నభివృద్ధిలోనున్నది. కవిమనుమలలో సీతన్నగారను వారొకరు. ఆ సీతన్నగారి మనమ లలో చెంచురామయ్యగారొకరు. ఈయన 1820 లో జన్మించిరట. ఈ చెంచురామయ్యగారిమనమలలో గోపాలరావుగారు 18-7-1905 తేదీని జన్మించి సజీవులై యుండిరట. దీనినిబట్టి వెంకటకృష్ణకవి క్రీ.శ. 1700 ప్రాంతమునందుండెనని నిర్ణయింపవచ్చును.



## 331. శేషము వెంకటపతి

ఈకవి తారాశశాంకవిజయమను నైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి వంగల సేనయామాత్యున కంకిత మొనర్చెను. ఈకవి శేషము కృష్ణయార్యుని పుత్రుఁడు; కందాళ రామానుజగురు నకు శిష్యుఁడు; ఈ శేషము వెంకటపతియును రాధికాసమాగమాది కృతులను రచించిన సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడును, జూణిగె కృష్ణకవియును, పాండ్యమండలాధీశుఁడగు విజయరంగచొక్కభూపా లుని యాస్థానకవులు. కృతిపతియైన సేనయామాత్యుఁడు విజయ రంగ చొక్కభూపాలునిచేత మన్ననలందినవాఁడు; వెంకట రాఘవ దీక్షితునకును దిరువెంగళమ్మకును దనూభవుఁడు. ఈ సేనయామా త్యుని గవి యిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. సకలసామాజిక సంఘంబు మదికి నిం
పుగ బృహస్పతిలీలఁ బుద్ధి దెల్పఁ
గార్య ఖడ్గక్రియాఘటనా ఘటనశక్తి
దొరనుబ్రమోదంబు దొరయఁజేయు
జననంబు మొదలుగా సకలజనోపకా
రంబు వ్రతంబుగా రహినొనర్చు
జనకునివైఖరి జ్ఞానకర్మప్రప
ధనభక్తి గురునిష్ఠలొనర మెలఁగు

ధరనుపనయన కన్యకాదానశతము
లన్నదానంబు జలదానమాదియైన
దానములొసంగు ఘనుఁడభిమానధనుఁడు
శ్రీపతినిభుండు వంగల సీనవిభుఁడు.

ఈ సీనయామాత్యుఁడు కవియై రామానుజ చరిత్రమును రచించి శ్రీవెంకటేశ్వరున కర్పించెననియు, దారాశశాంకవిజయమును రచించి తనకుఁ గృతియిమ్మని గవినిగోరెననియు నీక్రింది పద్య గద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. వంగలకుల కుంభవారాసి జనియించి
కన్నులకామోద గరిమనించి
యందంద సకలకలాభ్యాసియైమించి
జైనాత్మకత్వ ప్రశస్తిగాంచి
కౌముదీప్రజ్ఞాన గౌరవంబువహించి
సతతంబు కవిసమాచరణమించి
యిమ్మైన గానామృతమ్ములు గురియించి
యరికులంబుల గర్వమపహరించి

సీ. యతిశయిత లక్షణాఢ్యత నధిగమించి
భాతి శ్రీరామానుజ మహాచరిత్రఘటన
కలన కువలయ వికసన కళధరించి
సీనఘనకుండు సర్వజ్ఞ శేఖరుండు.

క. ననురంగేశ్వర పదయుగ
ఘనతర భజనానిరూఢ కవితాసామ్రా
జ్యుని శేషము కృష్ణసుధీ
తనయుని బిలిపించిపలికెదయ దయివాలిన్.

కృతిపతియైన సీనయార్యుఁడు గవియగుటచే నాతని చరిత్రము నీసంపుటమున మరియొకతావున వ్రాసియుంటిని.

ఈ వెంకటపతి విజయరంగచొక్కనాథభూపాలుని యాస్థాన కవియని పైనవ్రాసి యున్నాఁడను. చొక్కనాథభూపాలుఁడు కూడఁ గవియగుటచే నాతని చరిత్రము నీసంపుటమున దొలుత వ్రాసి యుంటిని. చొక్కనాథుడు మధురరాజ్యమును క్రీ.శ. 1706-1732 సంవత్సరముల నడుమఁ బరిపాలించినవాఁడు. కావున నీవెంకటపతి కవియు నప్పటివాఁడనుటకు సందియము లేదు.

ఈ వెంకటపతి మరికొన్ని గ్రంథముల నాంధ్రమున రచించెనని చెప్పుదురు కాని యవి బయటపడలేదు. ఇతని కులగోత్ర సూత్రాదు లేమియు నీ శశాంకవిజయమునఁ జెప్పుకొనలేదు. ఈతఁడు శ్రీవైష్ణవుఁడని నేను తలంచుచున్నాఁడను. నియోగిశాఖా బ్రాహ్మణుఁడని కొందఱందురు కాని యందులకాధారములు లేవు. శేషమువారు శ్రీవైష్ణవులలో గలరు. కావున నీతఁడాశాఖకుజెందిన వాఁడని నాయభిప్రాయము.

కృతిపతి దననుగూర్చి పలికినట్లీకవి తారాశశాంక విజయము నందిట్లు చెప్పుకొని యున్నాఁడు.

చం. అసదృశభక్తి సద్గురుకటాక్షముఁగాంచి సముంచితాత్మతన్
బిసరుహమాకరంద రస పేశల కౌశల వన్మృదూక్తులన్
రసికులకింపుగా కృతిపరంపరలన్ రచియించి కీర్తి చే
నెసఁగితివయ్య వేంకటపతీ భళి శేషము వంశసత్కృతీ.

క. నీవిప్పుడు మాపేర శు
భావహము శశాంకవిజయమనెడు ప్రబంధం
బావిష్కృత శృంగారర
గావింపుము రసికహృదయ కౌతుక మొసగన్.

గ్రంథాంతగద్య యిట్లున్నది:-

"ఇది శ్రీ జానకీరామచంద్ర చరణారవింద వందన కందళితా నంద కందాళ రామానుజ గురుచరణ సేవాసమాసాదిత సాహితీ వైభవ శేషము కృష్ణయార్య తనూభవ సుకవిజన విధేయ వేంకట పతినామధేయ ప్రణీతంబైన శశాంకవిజయంబను మహాప్రబంధము నందు సర్వంబును పంచమాశ్వాసము."

ఈ పద్య గద్యములవలన నీకవి తండ్రి కృష్ణయనియునట్లును, గురువు కందాళ రామానుజాచార్యులైనట్లును మాత్రమే తెలియు చున్నది. ఇంతకంటె నతని కులగోత్ర సూత్రములు తెలియు వాక్యములీగ్రంథమున లేవు. భావిపరిశోధనమువలన నేమేని తెలి యువఱకు నీతనిని శ్రీవైష్ణవునిగనే భావింతము.

ఈ శశాంక విజయము కేవలము శృంగార ప్రబంధము. ఇది యువతీయువకులు పఠింపఁదగిన గ్రంథముగాదనియు నిందు శృం గార రసము మిక్కిలి పచ్చిగా వర్ణింపబడియెననియు చెప్పనగును.

ఈగ్రంథము బ్రౌనుదొర నాకర్షించినది. వారు దీనికి వ్యాఖ్యలను వ్రాయించిరి. ఈగ్రంథము ముద్రితమయినది.

చంద్రుఁడు సురగురువుయొద్ద విద్యనభ్యసించుటకు వచ్చుటయు గురుపత్ని తార చంద్రుని మోహించుటయు, ఇంద్రయాగమునకు బృహస్పతి వెళ్లిన యదనుజూచి తార చంద్రుని వశపఱచుకొనుటయు నిందలి యితివృత్తము.

"ఈకథను ... శ్రీనాథమహాకవి కాశీఖండమున రచియించి యున్నాఁడు. అందు చతుర్థాశ్వాసమున 36 గద్య పద్యములలో నిది ప్రౌఢ తమరీతిని రచితమైనది. ఈకథకు మూలప్రాయమైన తారాశశాంక ప్రణయపరిణామమును శ్రీనాథ మహాకవియొక్క పద్యమున నిట్లు చెప్పియున్నాడు.

గీ. చదివె చంద్రుండు ధర్మశాస్త్రంబుదొలుత
పరమతాత్పర్య విశ్వాసభక్తిగరిమ
జదివె చంద్రుండు కామశాస్త్రంబుపిదప
తలిరుఁబోన్పున ననురక్తితారయొద్ద"

— దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము.

ఈ తారాశశాంక పరిణయగాథను వెంకటపతి అయిదాశ్వాసములలో 756 గద్యపద్యములలో మృదుమధురరీతిని రచించెను. శైలితెలియుటకై కొన్ని మచ్చుపద్యములు.

శా. అంతన్ గొన్నిదినంబులేఁగ ననసూయాదేవి భూమీజనుల్
సంతోషింప శుభగ్రహాళి ననువౌలగ్నంబు నందద్భుతా
నంతశ్రీఁ దగుపుత్రులంగనియె దత్తాత్రేయు దుర్వాసునిన్
కాంతామోహన చారుమూర్తి రుచిరేఖాసాంద్రునిం
జంద్రునిన్.

చ. గళరవ మంత్రములు్చెలఁగగా జిగిసిబ్బెపు గుబ్బచన్నులన్
గలశములందియుంది జఘనంబను వేదికయందునుండి ను
జ్జ్వల రశనన్ గ్రహించి జిగివాతెర సోమరసంబుగ్రోల వే
డ్కలుగల మన్మథక్రతువుకన్నను వేఱొకజన్మమున్న దే.

చ. అనియిక మాఱుబల్కవలదంచును డీనతఁదోఁప నాడుచున్
జనుగవయుబ్బఁగాఁ బయఁటజాఱఁగఁ గ్రొమ్ముడివీడ దేహమె
ల్లన బులకింప నీవి వదలం గరకంకణ కింకిణీ కన
ద్ఘనమణి మేఖలాధ్వనులు గ్రమ్మఁగఁబైఁబడి కౌఁగిలించినన్.

ఉ. ఓసి యిదేమి యీనడతయెప్పుదు సాధ్వివటంచు నమ్మితిన్
మోసమువచ్చె నీని నతిమూర్ఖుని శిష్యుఁడటంచు నెంచితిన్
వాసవముఖ్య సర్వసురవర్ణిత చర్యుఁడనై చరించు నా
వాసియు వన్నెయుందొఁఱఁగివచ్చెను దుర్యశ మేమిచెప్పుదున్.

ఉ. నావిని చంద్రుఁడిట్లనియె నవ్వుచు మీరిటులాడ నుత్తరం
బీవలె మీవలెందిరుగ నేరికినౌను జితేంద్రియస్థితిన్
భావజుగెల్చినాఁడనని పల్కితివంతటివాడవ య్యుమా
దేవికిదక్కె మోహమున దేహములో సగమియ్యఁజూతురే.



## 132. వంగల సీనయార్యుఁడు

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు. విశిష్టాద్వైతమత ప్రవక్తయగు శ్రీరామానుజులవారి చారిత్రము నీకవి యాంధ్రమునఁ బద్యకావ్యమునుగా రచియించి తిరుపతి శ్రీవెంకటేశ్వరస్వామి కంకితమొనర్చెనఁట. ఆగ్రంథ మముద్రితము. దాని ప్రతినైనను జూచుభాగ్యము నాకలవడలేదు.

శేషము వెంకటకవి ప్రణీతమగు తారాశశాంక విజయమను శృంగార ప్రబంధమున కీకవి కృతినాథుఁడయ్యెను. ఆ శశాంకవిజయమందు యీకవిచారిత్రమును దాదాపు ముప్పది పద్య గద్యములలో గీర్తించియున్నాఁడు. ఆగద్య పద్యముల నన్నిటినిట నిచ్చుట గ్రంథవిస్తరమగుననివిడచితిని. ఆవంశవృక్షము నీ క్రిందనిచ్చుచున్నాఁడను.

వెంకటపతికవి రచించిన పద్యములనుబట్టి, యీసీనయార్యుని వంశమువారు దాన ధౌరేయులనియుఁ బరాక్రమవంతులై రాజకీయోద్యోగములలోఁ బనిచేసి పేరువడసిన వారనియుఁ దేటపడుచున్నది. ఈ సీనయార్యుని సీనమంత్రియనియు, వీరిపూర్వులలోఁ గొందరి కమాత్యపదములనుఁ జేర్చియుండుటచే వీరు నియోగిశాఖా బ్రాహ్మణులేమోయని యనుమానము కలుగుచున్నది. కాని వారి యుద్యోగములనుబట్టి యాపదము లుదాహృతములయ్యెననియు, వీరు నియోగిశాఖవారు కారనియు శ్రీవైష్ణవులేయనియు నిశ్చయింపదగియున్నది.

ఈ సీనయార్యుని వర్ణించిన గద్యపద్యములుకూడఁ బెక్కులున్నవి. గ్రంథవిస్తరభీతిచే విడచితిని.

## వంశవృక్షము


అత్రిమహర్షి
వెంకట కృష్ణయ్య
పెద్దకృష్ణయ్య
గోపాల కృష్ణయ్య
వంగల వెంగన్న
= భార్య నాంచారమ్మ
గోపాలా
చార్యుడు
కళ్ళ
కృష్ణయ్య
రంగప్పయ్య
తిరువెంగ
ళప్ప
బుచ్చికృష్ణయ్య
= భార్య సీతమ్మ
శేషార్యుఁడు
కస్తూరయ్య
ఆదివరాహులు
వెంకట రాఘవ
సోమయాజి
= భార్య తిరువెంగళమ్మ
శేషకృతి
సీనయార్యుఁడు
= భార్య సీతమ్మ
వెంకట
కృష్ణయ్య
వెంకట
తిరుమలార్యు

వెంకటపతిరచించిన యీదిగువపద్యములనుబట్టి యీవంశము వారు మొదట కిడాంబియను గృహనామముగల వారైనట్లును, దరువాత గొంతకాలమునకు వంగలవారైనట్లును గన్పట్టుచున్నది.

శా. మాయావాది భుజంగ భంజన గరుత్మంతుండు శిష్యావళీ
శ్రేయస్సాగర పూర్ణ చంద్రుఁడు త్రయీసిద్ధాంత సింహాసన
స్థాయి శ్రీయతిసార్వభౌమ పదపద్మధ్యాయి తత్త్వాన్వితుం
డైయాఖ్యన్ వెలసెన్ కిడాంబికులజుండై యత్రిగోత్రంబునన్.

క. వేంకట కృష్ణయ ఫణి
పర్యంక పదాబ్జప్రసన్నుఁ డాచార్యకులా
లంకారుఁడ హిమాచల
లంకారమశేయ యశుఁడు రహిమీఱె మహిన్.

మన నీనయార్యుని వంశమునకు మూలపురుషుఁడు కిడాంబి వేంకట కృష్ణయ యనియు ఆత్రేయసగోత్రజుఁడనియు స్పష్టమగుచున్నది. ఇతఁడు చెంజిదుర్గపాలకుఁడైన వేంకటపతిరాయలుయొద్ద మంత్రిగా నుండెను.

ఈ వెంకటకృష్ణయ్య పౌత్రుఁడు కొప్పెర కృష్ణయ్య. ఇతఁడు శూరాగ్రేసరుఁడు. వైరి వధూవితతుల కొప్పెరలు గొనుటచే నీతఁడు కొప్పెర కృష్ణయ్యయని ఖ్యాతిగాంచెను.

క. అతనికి కొప్పెర కృష్ణయ
సుతుఁడయ్యెఁ దదీయహేతి శూరాళివధూ
వితతుల కొప్పెర గొనుటన్
క్షితికొప్పెర కృష్ణుఁడన సుకీర్తిం దనరెన్.

ఈకొప్పెర కృష్ణుని కుమారుఁడు వెంగన్న. ఇతఁడు వంగల వెంగన్న యని గీర్తిగాంచినట్లు యీక్రింది పద్యములవలన దెలియుచున్నది.

క. రంగన్నిజ భుజశక్తి
న్వేంగలువై రిపులు సమర వీధిన్బరవన్
వెంగన్నయట్టి వంగల
వెంగన్న నతండుగనియె వేడుకమీఱన్.

ఈ వెంగన్న ప్రపౌత్రుఁడు మనకవివతంసుఁడైన సీనయామాత్యుఁడు. సీనయార్యునితండ్రి వేంకటరాఘవసోమయాజి. తల్లి తిరువెంగళమ్మ. ఇతఁడు వాధూలవరదదేశికుని శిష్యుఁడు.

"కౌముదీప్రజ్ఞానగౌరవంబు వహించి
సతతంబు కవి సమాచరణమించి
ఇమ్మైన గానామృతములు గురియించి
యారికులంబుల గర్వమహరించి

గీ. యతిశయిత లక్షణాఢ్యత నధిగమించి
ధాత్రిరామానుజ మహాచరిత్ర ఘటన
కలనకువలయ వికసనకళధరించి
సేనఘనకుండు సర్వజ్ఞ శేఖరుండు.

క. శ్రీమన్మరుదంగాధిప
నామాంకిత గేయకల్పనా నుతమతికిన్
రామానుజ విజయాంకగ
వీమధురసమోదమాన వేంకటపతికిన్.

అను పద్యములవలన నీతఁడు రామానుజచరిత్ర రచియించి వేంకటేశ్వరునకంకిత మొనర్చినట్లు స్పష్టమగుచున్నది.

"వెండియు నఖండ మండిత మహీమండల మండనాయమాన పాండ్యమధురాధరాఖండల శ్రీ విజయరంగచొక్కనాథ కృపాకటాక్ష వీక్షణానుక్షణ వర్ధమాన పరబలార్ణవమంథ శైలయమాన

గంధమందరసింధుర ఘటాపవనజవనసింధు కాంబోజ గంధర్వకోటీ" అను వాక్యములవలన నీసీనయార్యుఁడు విజయరంగచొక్కనాథుని కాలములో నాతనికడయుద్యోగులలోనుండి పేరుగన్న వాఁడనియు ధృవపడుచున్నది.

విజయరంగచొక్కనాథుఁడు మధురను క్రీ. శ. 1706-32 నడుమఁబరిపాలించిన వాఁడగుటచే నీతఁడాకాలమున నుండినవాడని నిర్ణయించుటకు సంశయపడనక్కఱలేదు.

వెంకటపతివంటి మహాకవిచే తారాశశాంకమువంటి గ్రంథమును గృతినందినవాఁడగుటచే నీతని యౌన్నత్యము వర్ణింపదగినది.

ఈకవి వంశమును గూర్చియు నీతనిగూర్చియు విశేషముగా నెఱుంగఁగోరినవారు తారాశశాంక విజయమునందలి కృత్యాదిని జదివి యానందింతురుగాక.

ఇతఁడు కేవలము కవియేగాక కవిపండిత పోషకుఁడు. సంగీత విద్యా విశారదుండు.

షష్ఠ్యంతములలో '(శ్రీ)మన్నారు రంగాధిప నామాంకితగేయ కల్పనా నుతమతికిన్' అనుటచే నీతఁడు రామానుజచరిత్రము నేగాక మన్నారు రంగేశ్వరునిపై గేయములు చెప్పినట్లు కాన్పించుచున్నది.

[''మన్నారు రంగముద్రగల పదములు నేడు లభించుచున్నవి. ఈపదములీతని చివరినివాసస్థానమగు మన్నారుపోలూరు గ్రామమున వెలసియున్న మన్నారురంగనిపై రచితములైనవి. కురవంజి రాగముననున్న 'శివదీక్షాపరురాలనురా' అను మనోహరపద మీతని రచితమే!'' ]

—దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము.

# 133. పాలవేకరి కదిరీపతి

ఇతఁడు శుకసప్తతియను పద్యకావ్యమును రచించెను. ఇది సంపూర్ణముగా లభింపలేదు. కృత్యాదిలేకట్టియు, నాల్గవయాశ్వాసములో గొంతవఱకున్నట్టి ప్రతిని, సరస్వతిపత్రికలో పోలవరము జమీందారులగు శ్రీ కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు బహద్దరు జమీందారుగారు ముద్రింపించినారు. వారి కంతవఱకు మాత్రమే లభించినదఁట. బహుశః కవి యంతమాత్రమే రచియించెనేమో !

కృత్యాది లేకపోవుటచే కవి చారిత్రమేమియుఁ దెలియుట లేదు. ఆశ్వాసాంత గద్యయిట్లున్నది. "ఇది శ్రీమత్ఖాదిరీనృసింహ కరుణాకటాక్ష వీక్షణ సమాగత కవితాధార, పాలవేకరి కులకలశాంభోనిధి సుధాకర తాడిగోళ్లకరియ మాణిక్యనృప హర్యక్ష పౌత్ర పవిత్ర చరిత్ర ఖదిర ధరామండలాఖండలపుత్త్రి విద్వత్కవిరక్షణానుసంధాయక ఖదిరీపతినాయక ప్రణీతంబైన శుకసప్తతియను మహాప్రబంధము."

దీనినిబట్టి యీకవి నాయకకులజుఁడైనట్లును, ఖదిరియందున్న శ్రీ నృసింహస్వామి కరుణావీక్షణ కవితాధారుఁడైనట్లును కరియ మాణిక్యనృప పౌత్త్రిఁడును ఖదిరభూపతి పుత్త్రిఁడునైనట్లును గనుపట్టుచున్నది.

ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఇతఁడే కాలమువాఁడో తెలియదు. వీరేశలింగముపంతులుగారు ఇతఁడాధునికుఁడనుటకు సంశయము లేదనిమాత్రము వ్రాసియూరకున్నారు. ఈగ్రంథముయొక్క వ్రాతప్రతులు క్రీ. శ. ౧౮౩౦ కి పూర్వమే

యుండుటచే కవి ౧౮౦౦ సంవత్సరమునకుఁ బూర్వుఁడనియు నిప్పటికి రెండువందల సంవత్సరములకుఁబూర్వమనగా, పదునెనిమిదియవ శతాబ్ది మధ్యయందున్నవాఁడనియుఁ దలంపవచ్చును.

బ్రౌను పండితుఁడు శుకసప్తతి తాళపత్రప్రతులను సేకరించి శుద్ధప్రతి వ్రాయించి యీపుస్తకమువిషయమై వారి యభిప్రాయము నింగ్లీషున వ్రాసియుంచినారు. దాని భాషాంతరీకరణమును ముద్రితప్రతి పీఠికాకారులు పీఠికలోఁ బ్రకటించియున్నారు. అద్దాని నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

"ఈశుకసప్తతి లేక చిలుకచెప్పినకథలు అనునవి తెలుఁగులోఁగొన్ని చక్కని శృంగారకథలు పుస్తకము పూర్తిగాలేదు. ఇది యిరువదికథలు జాతీయోక్తులతో సులభమైనభాషలో వ్రాయఁబడినందున నిది యరుదైనదనియు, ముఖ్యముగాఁ ప్రకటింపవలసినదియును. ఈ వ్రాఁతప్రతి నా నియోగమువలన 1831 సం॥న సిద్ధముచేయఁబడినది. ఈ శుకసప్తతి ఆంధ్రభాషావైలక్ష్యమును బ్రకటించు కథలుగల యొక తెలుఁగుగ్రంథము. ఈ యమూల్యగ్రంథముయొక్క ప్రతులు చాలనరుదు. నిండుప్రతి యెక్కడను నాకు దొరకలేదు. ఈదేశమునంగల యనేకస్థలములలోని యైదు వ్రాఁతప్రతులనుబట్టి యతికష్టముపై నీప్రతిని వ్రాయించినాను.

ఇది భాషకు రాజావలంబనము చక్కఁగఁగల కాలములో వ్రాయఁబడి యున్నయెడల భద్రముగాఁ గాపాడఁబడియుండును. అవలంబనలేని యిటీవలిదినములలో వ్రాయఁబడిన గ్రంథములెంత విలువఁగలవియైన జాగ్రత్తచేయఁబడి యుండలేదు.

"శుకసప్తతి" యనుపేరుగల ప్రసిద్ధగ్రంథమొకటి సంస్కృతమునంగలదుగాని యాపేరునే యిదియుఁ గలిగియున్నను, దానికి

భాషాంతరీకరణము మాత్రము కాదు. దాని ననుసరించి వ్రాయఁబడినది. ఈగ్రంథ మసమగ్రముగాఁ గనఁబడుచున్నది. దీనిం బట్టిచూడఁ గవియే దీనినిబూర్తి చేసినట్లు తోఁచదు. ఇందు డెబ్బది కథలు లేవు. వివిధప్రతులలోఁ బరస్పర విరోధములు చాలఁగలవు. చరణములకుఁ జరణములే మార్పులుండుటచే నేదిశుద్ధప్రతియో నిర్ణయించుట కష్టము.

హంసవింశతియు నిట్టిగ్రంథమే. చాలపద్యములందు నిందును సరిపోలియుండుటచేత నొకదానినిగాంచి యొకటి వ్రాయఁబడినట్లెంచవలసియున్నది.

నే నీగ్రంథమును బరిష్కరించుటలో మిగుల సమర్థతగల తెలుఁగుపండితుఁడగు జూలూరి అప్పయ్య సాహాయ్యమునుబొంది యున్నాఁడను. అతఁడు మిగుల జాగ్రత్తగను జయప్రదముగను నీకార్యమును జరపినాఁడు. హంసవింశతిలో జాతీయపదములు విశేషముగా నీయఁబడియుండినను వానికంటె నీగ్రంథ మీ రచనయందును మాధుర్యమునందును హెచ్చుగానున్నదని యాతఁడు తలంచుచున్నాఁడు. అయినను నీగ్రంథమునకీపేరు తగియుండలేదని యాతఁడు తలఁచియున్నాఁడు. అది సత్యము. దీనిని శుకసప్తతియనుటకంటె శుకత్రింశతి యనఁదగునని నుడివినాఁడు. ఎందుచేతననఁగా గ్రంథము పూర్తి చేయఁబడి యుండలేదుగనుక.

తెలుఁగులో శుకసప్తతియను నొక వచనకావ్యమంగడులలో దొరకునుగాను యిది దానినిబట్టి వ్రాసిన పద్యకావ్యముకూడఁగాదు. 1839 సం॥లో మఱికొన్ని యెక్కువపద్యములుగల ప్రతినొకదానిని సంపాదించినాఁడను.

శుకసప్తతిలోని యీకథలను, ధౌమ్యుఁడు ధర్మరాజునకుఁ జెప్పినట్లీక్రిందిగద్యపద్యములలో గ్రంథారంభమునఁ జెప్పియున్నాఁడు.

క. తెలివిగల భూసురుఁడవు
కులగురుఁడవు మాకు మానికుంజర వినుమీ
యలఘుమతి నొక్కకార్యము
తెలియన్వివరింపవే సుధీజనతిలకా.

ఉ. భామలచిత్తవృత్తి తెలియ బ్రహ్మకునైన వశంబుగాదు త
త్కామిత యత్నము ల్తలఁప ధాత్రి విచిత్రములందు కావున
న్నామది యే తదీయకథనంబు వినం గడఁగెన్మహీసుర
గ్రామణి యానతిమ్మనుఁడు రాజబిడౌజునితోడ వేడుకన్.

వ. అప్పుడా ధౌమ్యమహర్షివర్యుండు నిరవధిక కుతూహల ధుర్యుండై యిట్లనియె. స్త్రీజనంబుల చిత్తంబులు లోకాతీతదుర్వృత్తంబులు తదీయకృత సాహసకార్యంబు లనివార్యంబులగుట నిక్కువంబిందులకు నొక్కయితిహాసంబు గలదు. తొల్లి మహాదేవుండు పార్వతీవరారోహ కతిరహస్యంబున నానతిచ్చిన తెఱంగెఱింగించెద సావధానుండవై యాకర్ణింపుమని యిట్లనియె.

ఒకానొక పట్టణ ప్రభువాపట్టణమందలి యొకవైశ్యునిభార్య మిగుల సౌందర్యవతియని యొక యెఱుకసాని చేవిని, యామెపైఁ దభిలషించియందులకనువగు నుపాయంబుకల్పించుటకై యొకజరభిని నియోగింపయామె యామదవతితో స్నేహమొనర్చి యామెహృదయమును రాజువంకకు మరల్చుటయు, భర్తదూరదేశమునకు వర్తకమునకేఁగిన తరుణము నదనుగాఁజూచి, రామె రాజుతోఁగలయుటకై ప్రయత్నింప నామెచేఁ బెంపఁబడుచున్న రాచిలుక, నీవు రాజుతోనున్నప్పుడెవ్వరైనఁ జూచినచో నెట్లుతప్పించుకొనెదవని యడిగి యందులకామె

యుత్తరము చెప్పలేకపోఁగా, నొక కథ చెప్పి యాకథయందు జారిణి భర్తను మోసగించి యుపపతితోఁ గలిసియుండ భర్తయే తేర, నామె యించుకయు జంకక, బొంకాడి తప్పించుకొనిన యుక్తిని చెప్పి యంతటి సాహసాది శక్తులుండినఁగాని, వ్యభిచార మొనర్చుటకుఁ దగవని యారాత్రి కామెను మరలించుటయు, నిట్లే యొక్కొక రాత్రి కొక్కొక కథ చెప్పి యామె భర్త వచ్చువఱకు నాచిలుక యాసతి శీలముఁగాపాడుటయు నీగ్రంథమందలి ప్రధానకథ. హంసవింశతి యందలి కథయు నిదియే. భర్తను మోసగించి, యుపపతితోఁ గలయుటకైన సాధనములు, యుక్తులు, సాహసములు స్త్రీలకు బోధించుట కనువగు నీకథలను పరమేశ్వరుఁడు పార్వతికిని, ధౌమ్యుఁడు ధర్మరాజునకు నేలబోధించిరో తెలియకున్నది. యావనమునందుండు స్త్రీ పురుషుల హృదయముల కుద్రేకము గల్గించి చెడుదారులకీడ్చుకొనిపోవుట కీగ్రంథము సాయపడునను మాటనిజమే యైనను పాతివ్రత్యమును నీతిని బోధించు పద్యములిందు లేకపోలేదు. మచ్చునకొకటి రెండు పద్యములట్టివి యిట వ్రాయుచున్నాఁడను.

సీ. దశకంధరుని మోహదశ విచారించెనే
　　　సకల జగన్మాత జనకజాత
నహుషమభూపాలు మన్నన కొప్పుకొనియెనే
　　　స్త్రీరత్నమైన శచీపురంధ్రి
యలసింహబలుని మాయలఁ జిక్కిచొక్కెనే
　　　విపుల సద్గుణమాన్య ద్రుపదకన్య
శబరాధిపుని దురాశలకు లోనయ్యెనే
　　　రతినిభాకృతి భీమరాజపుత్రి
తొల్లిఁటి మహాపతివ్రతల్ దుర్మదాంధ
కాపురుషులంగ భవశరాఘాత వికల

చిత్తులై తమ్ముఁజేరి యాసించినపుడు
సిగ్గు వోనాడు కొనిరఁటే చిగురుబోడి.

గీ. కలిగినప్పుడెల్లఁ జెలువుని చెంగట
నడఁగి మడఁగియుండు టరిదిగాదు
చేరిలేమి యప్పుడారీతినుండెనా
యది పతివ్రతా జనాగ్రగణ్య.

ఈకవి కవిత్వము, పౌఢత్వము స్వభావోక్తులతో నిండి, మనోహరముగా నున్నదనుటకు సందియము లేదు.

శైలిచూపుటకై - గొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

మ. నిలువెల్లం గనకంబు ముద్దుపలుకుల్నిర్యత్సుధాబిందువు
ల్వొలపుంజూపులు చంద్రికా రుచులటంచున్నమ్మియున్నట్టులి
క్కలకంఠుల్భువి సాభిమానలని వక్కాణించితింగాని దో
షలతా దోహదలై ప్రవర్తిలుట యోజింగాన లేనైతిఁగా. ౧౭

ఉ. ఓ చతురాగ్రగణ్య భువినున్న నరేంద్రులలో భవన్నిభుం
డీచతురబ్ధివేష్టిత మహీన్నహియంచు జనుల్నుతింప నీ
యాచరణం బెఱుంగక మహాగహనాంగణభూమి నొంటిమై
నేచి చరింప నీతియగునే తగునే యిటువంటి కృత్యముల్. ౧౮

ఉ. ఏల విచారమింతుల నొకింత యెఱుంగని బుష్యశృంగునిం
బాలికలందఁజేరి యొకబాలికఁ బెండ్లియొనర్చి భామినీ
లోలునిఁజేయువార్త మహిలో నుడువన్వినరే కొ యట్లనే
శాలికనా సమగ్ర గుణశాలికిఁ బెండ్లియొనర్తునావుడున్. ౧౯

చ. పదినెలపోరుమాన్ప నిజవల్లభు నిద్దురపుచ్చ మామనో
రదమఁగ నత్తగారికి భయంబొనరింప మఱందినూరకే
గదమఁగఁ దోడికోడలి కొకానొకనింద ఘటింపవచ్చుఁ బో
కదిసిన నేర్పుచేత బెళుక న్వాఱవొందిన జారకాంతకున్. ౨౮

ఉ. అన్నము పున్నమే నటుఁగ నమ్మమతిం బతినాదుపాలికిం
బెన్నిధిగాఁగఁజూతు మఱిమెచ్చులుగా వొరునట్టివానినేఁ
గన్నులనైనఁజూడ నిదికల్లయె సత్యము చూచుచున్నవాఁ
డన్నలినాప్తుఁ డింకొకటి యారజముట్టిపడ న్నిలంగుదున్. ౨౮

ఉ. అక్కట పొట్టచించిన నొకక్షరమైనను రాదు టెక్కులుం
డక్కులుగాని యమ్మనిన డమ్మనేరఁడు వేదమందు సాం
పెక్కిన యన్నివిద్యల నహీనుఁడ నేనని కాపువారిచే
మ్రొక్కులుగొంచు నాతఁడు సమున్నతగర్వము
హాత్తి వర్తిలున్. ౨౮

చ. అపుడొక్కించుక మబ్బుగానఁబడి యింతై యంతయైమించి వి
ష్ణుపదంబంతయు నాక్రమించి జనసందోహేక్షణాంధత్వ కృ
చ్చపలంబై కడుగర్జిత ప్రబలమై సంజాత ఝంఝామరు
ద్విపులంబై యొకవానవట్టె వసుధావిధూత పంకంబుగన్. ౩౮

గీ. సకల శుభమస్తుతే వైశ్యసారసాక్షి
యక్కడికిదెల్పి నిల్పితి నమ్మకథయు
మదిఁ దలఁపువచ్చినటుల నమ్మంత్రితనయు
వేగమఱునాఁడె భూమీశు వెఱ్ఱిబుద్ధి
మాన్ప మదిలోఁ దలంచి సంభ్రమముతోఁడ. ౩౮

ఉ. అంతకుమున్నె యచ్చటికి నొయ్యారముమీఱఁగ వచ్చియున్న త
త్కాంతిమతీవధూటి నను గన్గొని మోమరవాంచి నిల్చినం
తెంతకుఁ జేరి దాసి యిదిసిగ్గువడ న్సమయంబుకే గృహా
భ్యంతరసీమఁ జేర్పుదమటంచు ననుంగొనిపోయిరిద్దఱున్. రఆ

ఉ. అంత నృపాలుఁడా లలన యంఘ్రులకుం బ్రణమిల్లి యామినీ
కాంతముఖీయరుంధతివి కానక నీవయిఁ గాని పోని యా
వింత ఘటించినట్టి యలివేణుల నోరికి శాస్తిసేసి య
త్యంతయశంబు నిల్పితికదా యిఁక నింటికి నేఁగఁగాదగున్. రఆ

చ. సకలపురాణముల్ నిగమచర్చ లెఱింగిన వైదికాఖ్యుఁడో
నొకగృహమేధి పిల్వఁగఁ దదుజ్జ్వల మందిర సీమఁ జేరి యిం
చుక తలవంచుచుం జెళుకుజూపులతో వెసఁ బాద్యమిచ్చు త
న్ముకురకపోలఁ గన్గొని కనుంగవకుం బ్రమదంబు పొందగన్. రఆ



# 134. ఐచ్చలి వీరవెంకకవి

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; తిమ్మరాజ సీతాంబలకుఁ బుత్త్రుఁడు; వేంకటాద్రిరంగమ్మలకుఁ బౌత్త్రుఁడు; రంగనమంత్రి యమ్మతిమ్మలకుఁ బ్రపౌత్త్రుఁడు.

ఈకవి కాళిదాసు రచించిన రఘువంశమును నాల్గాశ్వాసముల పద్యకావ్యముగా రచియించి, విరించి పురమందలి మార్గసహాయేశ్వరునకుఁ గృతియొసంగెను. కర్ణాటరాజ్య పరిపాలకుడగు బాఖరల్లీఖానుచేఁ దాను గౌరవింపఁబడితిననియు, మార్గసహాయేశ్వరుఁడు స్వప్నమునఁ గన్పడి రఘువంశము నాంధ్రీకరించి తనకంకితము సేయుమని యానతినొసంగెననియుఁ గవి యీక్రింది పద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

సీ. తన వీరరాహుత్తత సాహసప్రౌఢి
విక్రమార్కునకైన వెఱగునింపఁ
దనచారుకర ముద్రనవధి వేష్టిత
ధరాజన నాయకులు శిరసావహింపఁ
దనమహోన్నత శాశ్వతైశ్వర్య గరిమంబు
గౌరీశ్వరునితోడి కవగొనంగఁ
దనమజారీసు చందము పురందరసుధ
ర్మాస్థానికైన విస్మయము నెఱప
నిజభుజాందూనిబద్ధ వినిద్రిజలధ
రాధ కర్ణాటరాజ్యేంది రాజ్యేందిరాక రేణుఁ
డలరు శ్రీ బాఖరల్లీఖానాభి ధాన
మాన్యుఁడగునట్టి యవన రాజన్యమౌళి.

సీ. ఏవజీరు హజారమిభకాండ గండశ్రీ
వద్దాన ధారానివాసభూమి
యేసాహెబు కటాక్ష మిందిరాసుందరీ
చరణనూపుర ఝుళం ఝుళరవంబు
యేషాదుషాశౌర్య మింద్రనందన ధనంజయ
సారసాప్తుల సాముగరిడీ
యేఖానుని మహాజ్ఞ యితరఖాన ప్రజో
త్తమ శిర స్తతికి గేదంగిరేఖ

ఏదునేదారు మధురోక్తులేపు చూపు
నైతకవ ఠీంపూరంబు ననుకరించి
యతఁడు శ్రీ చాఖరల్లీఖానాభిధాన
మహిత కర్ణాటరాజ్య రమావిభుండు.

వ. అతండొక్కనాఁడు ధరామండలం బేలుచుండి తన ప్రజాపాలనాది సూనృతచర్యా విధానావధానంబునకు ననుగుడ ప్రధానతిలకంబితండ యని నన్నుఁ బిల్వఁబంచిన నేనునుం దదాజ్ఞార తిం గతిపయ ప్రయాణంబులంజని యవ్వీర బరీద మేదినీవల్లవ వల్లభు చేత నధికృతానేక రాజ్యభాగుండనై సత్కృతివడసి మగిడివచ్చు నప్పుడంబర విడంబి జాంబూనద ప్రాసాదశోభితంబును మరకతమణి వినిర్మిత వితర్ధికా విరాజిత రథ్యాభిరామంబును. ... ... నగువిరించిపురంబు దఱియవచ్చి యనర్గళ ప్రభావిభాసిత మరకతవల్లీ మనోహరుండగు మార్గసహాయేశ్వరుంగాంచు వేడ్కందదవస్థానంబు నకుంజని భక్తి వినయపూర్వకంబుగా సాష్టాంగం బెరఁగి యారేయి నిదురించు నాలవజామున ... ... ...

గీ. వీరవెంకప్రధాన ! కవిత్వకల్ప
నావధానంబు నీయంద యలరుఁగానఁ
గృతి వినిర్మించి మాకు నంకితముగాఁగఁ
జేయుము శుభంబు నీకు సుస్థిరతఁగాంచు.

చ. మరకతవల్లి పేరిటి యుమారమణీ మణియు న్వరించినా
మఱుచిరపట్టణంబును గుమార ముఖాఖిల పుత్రవర్గముం
దరుణ శశాంకభూషయు నుదారతతో నరుదేర నేను నీ
పురమునవచ్చి నిల్చెద నపూర్వ కళాకలనా విలాసినై.

... ... ...

చ. అనివినుతించు నప్పుడు మహాత్ముకుఁ డాతఁడు బ్రమ్మతంగఁ బ
ల్కెను రఘువంశనామకృతి కేవలహృద్యతఁగాంచుఁ గావునం
దెనుఁ గొనరించి మాకొసఁగి తేనియు నీయెడ వత్సలత్వము
న్నని చెఱ నిష్టసంపదలు నీకగునంచుఁ దిరోహితాంగుఁడై.

ఈకవి తననుగూర్చి వ్రాసికొనిన గద్య పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. వీనినిబట్టి యీతఁడాత్మశ్లాఘనా ప్రియుండని తోఁచుచున్నది.

సీ. తనకీర్తి మౌక్తికధామ వల్లులు దిశా
లలనాకుచారి నలంకరింపఁ
దన దాన కవితాంబు ధారాప్రవాహంబు
లుదధిసంతతులకు నుబ్బొసంగఁ
దనప్రతాపజ్వలద్ధవ హుతాశనకీల
కమలాప్తునకు వింత కాంతిఁ బెనుపఁ
దనమేదినీభార ధౌరేయతాశక్తి
విమథకేశున కాటవిడుపొసంగ

నలరె నతివేల కరుణారసాతిసాంద్ర
గంధ గంధిల నిజమనః కమల విమల
కర్ణికాంత రాధిష్టిత గ్రావరాజ
కన్యకాజాని వీరవెంక ప్రధాని!

వ. వెండియు నాఖండల తుండి తుండ ప్రతీకాశదోర్దండ మండితాఖండ మేదినీమండల మండనాయత మార్కెళ్ల సీమా సంస్థాన స్థలకరిణిక ప్రభుత్వ ప్రభాభాసమానుండును... ... ...
మార్గసహాయేశ్వర వరప్రసాదప్రాప్త ప్రదీప్త చ్ఛత్ర చామరాందోళికాగంధ కరి తురంగ రంగద్రాజ్య సామ్రాజ్య వైభవాభిరాముండును ... ... ... ... ...
బాఖరల్లీఖా నాసంధానిత మహారాజ్య భారుండును. భారద్వాజ పవిత్ర గోత్రారాధనీయుండును ... ... ...
బచ్చలి కులపయః పయోధిరాకాసుధాంకుండును నగు వీరవెంక ప్రధానాగ్రగణ్యుండు సామాన్యుండె ... ... ...

ఈకవి చారిత్రమును కవికైదవ పురుషుండగు బచ్చలి నారాయణయ్యగారు వ్రాసి గ్రంథముతోఁబాటుగ నాంధ్ర సాహిత్య పరిషత్తున కిచ్చియుండిరి. దాని నీక్రింద వ్రాయుచున్నాఁడను.

"నెల్లూరుమండలములో చేరిన కనిగిరియనబడు కనిగిరితాలూకా గ్రామములన్నిటిని 1750వ క్రీస్తుసంవత్సరమునకుపూర్వమునుండియు మార్కెళ్ల సీమయని పిలుతురు. ఈ తాలూకాలో చేరిన మార్కెళ్ల యను గ్రామమును ప్రధానస్థానముగా చేసికొని ఆర్కాడు నవాబుగారగు బాకరల్లీఖాను పరిపాలించుచుండెను. 1750 వ సంవత్సరమునకు పూర్వమే యీ పరగణానంతయు గోగులపల్లె కాపురస్తుడును స్థలకరణము నగు బచ్చలి సీతారామయ్యగారికి జమీనుగా

యిచ్చి పరిపాలింపుచుండుమని చెప్పెను. తదాది సీతారామయ్య గారు పరిపాలింపుచుండిరి.

వీరు ఆరువేల నియోగి బ్రాహ్మణులు. ఈయన తండ్రి పేరు వెలుగోండప్పగారు. సీతారామయ్యగారి చిన్న వయసునందే తండ్రి కాలధర్మమునొందుటచే పినతండ్రియు ప్రకృతగ్రంథకర్తయు నగు వీరవెంకన్నగారు దగ్గరదీసి పెంచి విద్యాబుద్ధులు గరపెను. అట్టి బాల్యదశయందే విద్యాబుద్ధి, ధైర్య, శౌర్య, గాంభీర్యాది గుణములు గలవారగుటంజేసి రాజ్యమును ఖానుసాహేబువద్దనుండి సంపాదించెను. రాజ్యప్రాప్తియైన పిమ్మట పినతండ్రి తనను పెంచిన కృతజ్ఞతకు మారుగా యిద్దరున్ను రాజ్యము నెరవేర్చ వలయుననియు రెండు కుటుంబములకు రాజ్యహక్కులుండ వలసినట్లు నిర్ణయించుకొని యీ సంగతి నవాబు గారికి తెలిపి వారి యనుమతి చొప్పున పరిపాలించుచు అగ్రహారములు భూదానములు మాన్యములు మొదలగునవి యిద్దరి చేవ్రాలుతోటి యిచ్చుచుండిరి. ఇట్లుండ 1750 వ సంవత్సరము మొదలు 1754 వ సంవత్సరము లోపల వీరవెంకన్న సీతారామయ్య గార్ల నిద్దరిని ఆర్కాడుకు రమ్మని బాకరల్లీఖాను చెప్పిపంపెను. ఆతని యాజ్ఞమేరకు నవాబు సన్నిధానంబునకుం జని సకల సన్మానంబులం బొంది తిరిగి వచ్చునట్టి మార్గమధ్యమందు ఆర్కాడుకు సమీపమందున్న విరించిపురంబను గ్రామంబున నిల్చిరి. అచ్చట మార్గసహాయేశ్వరస్వామి దేవాలయంబుంగని దానిలోని దేవుని సందర్శించి యారాత్రి యచ్చటనే నిదురించిరి. ఇట్లు నిదురించుచున్న వారిలో వీరవెంకన్నగారి స్వప్నమందా మార్గసహాయేశ్వరస్వామి ప్రత్యక్షమై రఘువంశ మహాకావ్యమును ఆంధ్రభాషలో తనకంకితముగ జెప్పవలసినట్లును తాను మీాపట్టణమునకే వచ్చెదననియు తెలిపినందున వారుతక్షణమే

ప్రియాణమై నివాస స్థానమైన గోగులపల్లెకు వచ్చి అచ్చట కోట గట్టించి ఆంజనేయస్వామి దేవాలయమున్ను బ్రతిష్ఠించి యీపుణ్యకాలమందు ఆయూరికి సమీపమునందే విరంచిపురమను నొకయగ్రహారము నేర్పరచి బ్రాహ్మణులకు ధారాపూర్వకముగ నొసంగిరి. దేవాలముల నిత్య నైవేద్యోత్సవాదులకు కొన్నిభూములను ఏర్పరచి కల్యాణోత్సవము స్వంతసంస్థానపు ఖర్చుతో జరుపుచుండిరి అందు చేనద్దానికి జీవనములేదు. ఇట్లు జరుగుచుండగా 1759-60 సంవత్సరములలో సీతారామయ్యగారు కాలధర్మము నొందిర.

సీతారామయ్యగారు జీవించి యుండుకాలమున నెల్లూరిమండలములో చేరిన ఉదయగిరి తాలూకా దేశముఖయగు జూపల్లి లక్ష్మారాయడు అనునతడు మహాక్రూరుడై మారెళ్ళ పరగణా గ్రామాలలో దొంగతనములు బందెపోటులు గ్రామములు తగులబెట్టుట మొదలగు కార్యములు చేయించుచు కరణములవద్ద వసూలయిన సర్కారు ద్రివ్య మపహరించు చున్నందువల్ల సీతారామయ్యగారు యుద్ధముచేసి ఆలక్ష్మారాయని సంహరించెను. తరువాత నిష్కంటకముగ కొలది కాలముండి సీతారామయ్యగారు మరణించిరి. వెంటనే లక్ష్మారాయని కుమారుడనువాడు 1760 వ సంవత్సరమునకు సరి అయిన విక్రమ సంవత్సరమున గోగులపల్లె కోటమీదకు దండు కట్టుకొని వచ్చెను. అప్పటికి వీరవెంకన్నగారు సీతారామయ్యగారు నిద్దరు లేరు. సీతారామయ్యగారి కుమారుడైన చినవెంకటరామన్నయున్ను సీతారామయ్యగారి తమ్ముడైన తిమ్మరాజుగారున్ను వీరవెంకన్నగారి మనుమడగు పెదవెంకటరామన్నయు నుండిరి. అప్పుడు వీరి వద్ద సరియైన బలము లేక కాళహస్తి రాజాగారగు దామెరవారిని సహాయము నిమిత్తమై యడుగబోయిరి. వారి నేల యడుగవలయునన్న మారెళ్ళసీమకు దక్షిణహద్దుగానుండిన పామూ

రు తాలూకాను వాడవారు, రావువారు అను పాలెగాళ్ళు పాలించు చునుండి వారికిని సీతారామయ్యగారికిని యేదో కలహము కలిగి కాళహస్తి వారిని పామూరు తాలూకామీద దండెత్తి రమ్మని తన సైన్యమునంత నిచ్చి పామూరు తాలూకాను జయించి కాళహస్తి వారికి స్వాధీనముచేసి యుండెను అది కారణమున సీతారామయ్య గారికిని కాళహస్తి వారికిని సహోదర భావము కలిగి యుండెను. అట్లుండుటంజేసి ప్రకృత లక్ష్మారాయని యుద్ధ సందర్భమున సహా యముకై పోవగా అప్పుడు కాళహస్తివారు దుర్వృత్తి నవలంబించి మీ తాలూకా నంతయు మాకు వ్రాసి యిచ్చుపట్ల మేమును సహా యము చేసెదమని చెప్పిరి. ఆమాటకు సమ్మతింపక వీరవెంకన్నగారి మనమడు పెదవెంకటరామన్న అచ్చటనే సమీపమందున్న వెంకట గిరివారిని అడుగుటకై పోయెను. ఈ వృత్తాంతమును కాళహస్తి వారు తెలిసికొని వెంకటగిరివారికి యిదే ప్రకారము మేము అడిగి నట్లు మీరున్ను అడుగుడని గూఢముగా చెప్పి పంపిన కారణమున వారున్ను అదే ప్రకారము చెప్పిరి. అంతట నిరుత్సాహులై కడప జిల్లా ఉయ్యాల వాడలోనుండు నొక ప్రబలుండైన రెడ్డిగారిని సహా యము కోరగా వారు సమ్మతించిరి. ఈ సంగతి వెంకటగిరి వారు తెలిసికొని మేమేసహాయము చేసెదమని బచ్చలి వారికి చెప్పిపంపిరి. అందుకు బచ్చలివారు సమ్మతించినందున వెంకటగిరివారు తమ సేన లతో గొగులపల్లెకోట వద్దకు వచ్చి జూపల్లి లక్ష్మారాయని సేనలను తరిమివేసిరి. అప్పుడు కొంతకాలము వెంకటగిరి వారి సేన బచ్చలి వారికోట కాపాడుచు నిలచియుండిన కారణము చేతనయిన బత్తెపు ఖర్చులు మొదలగునవి వెంకటగిరివారికి బచ్చలివారు బాకీ పడిరి. ఆడబ్బునిమ్మని వెంకటగిరివారు కోరగా వీరివద్ద ద్రవ్యములేక కొన్ని సంవత్సరములు మాత్రము తాలూకా మీద వచ్చే వరుంబడితో

చెల్లుపెట్టుకొనేటట్లు యేర్పాటు చేసికొనిరి. తరువాత యిప్పటివరకు కనిగిరి తాలూకాలోని కొన్ని గ్రామములు వెంకటగిరివారి స్వాధీనమందేయుండుటకున్ను కొన్నిసర్కారులో చేరియుండుటకున్ను అసలు బచ్చలివారికి యేమియులేక యుండుటకున్ను కారణము తెలియదు.

వీరవెంకన్న సీతారామయ్యగార్లు రాజ్యముచేయు కాలమున మార్కాపురము తాలూకాలో 1 విరించిపురము 2 కామంచిపురము 3 శంకరాపురము 4 తక్కెళ్ళపాడు 5 ఉమామహేశ్వరపురము 6 దాదిరెడ్డిపల్లె మొదలగు అగ్రహారములున్ను ఇంకను గొన్ని భటవృత్తి, యీనాములున్ను బ్రాహ్మణులకు యిచ్చియున్నట్లు ఆయాశాసనములు దానపత్రములు వారి యనుభవములు కనుపడుచున్నవి. ఇదియుగాక గుంటూరు మండలములోని నరసారావుపేట తాలూకా చీమలమర్రి గ్రామమునుండి కొందఱిని మద్దాళి గ్రామమునుండి కొందఱిని తమబంధువులను బిలిపించి వారికుమార్తెలనిచ్చి కనిగిరి, చాకిరేల, కోడిగుడ్లపాడు, వాగుపల్లె, శంఖవరము, మనుమడుగు, కాశీపురం మొదలగు గ్రామ కరిణీకములను చీమలమర్రి వారికిని కూటాగూండ్ల, నల్లగండ్ల మొదలగు గ్రామకరిణీకములను మద్దాళి వారికిని యిచ్చియున్నారు. రాయసం రమణయ్య, చక్రప్ప, నరసింహుడు అనువారలు వీరికి మంత్రులుగా నుండినవారు వీరలకు కొన్ని భటవృత్తియీనాములను యిచ్చియుండుటంజేసి యవి యిప్పటికిని అనుభవములో నున్నవి."

ఈచరిత్రమును జదివిన వారికి, ఆకాలపు బ్రాహ్మణులశక్తి సామర్థ్యములును, బరోపకార చింతయుఁ దెల్లము కాఁగలదు. రాజ్య పరిపాలనావిషయమైన తొందరలలో నుండియు సీతఁడీ కావ్యమును రచించెనని నప్పుడాతని మనోదార్ఢ్యమును, విద్యాసక్తియుఁ గొనియాడఁదగినవి. ఇతని కవిత్వము రసవంతమై మనోహరముగా నున్నది.

చ. ఇతర నృపాల దుర్లభసమిద్ధ యశుండు దిలీపుఁడాలితో ౧ఆ
నతిగమన శ్రమాకుల రథాశ్వచతుష్కముగల్గి ప్రొద్దు గ్రుం
కు తఱిఁ దపః ప్రయాసమునకుం గుదురైన వసిష్ఠమౌని ని
ర్మిత మహితాశ్రమస్థల సమీపముఁ జేరెఁ బ్రియంబు మీఱఁగన్

శా. ఆదిత్యాన్వయ మిప్పరార్థ్య జనిచే నస్మత్తనూజాతుచే ఆ ౧
బోదైదె సుస్థితిమంతమౌననుచు సమ్మోదంబునుం జెందె మ
ర్యాదాస్థాపకుఁ డాదిలీపుఁడు పరబ్రహ్మంబు సత్త్వాదులం
బ్రోదిం గన్న స్వమూర్తి భేదమునఁ బెంపుంగాంచు సృష్టింబలెన్

చ. క్రతువునకుం బ్రధానము తురంగమ రాజముగాన యజ్ఞదీ
క్షితమగు హాయనంబు నెడసేయక క్రిమ్మఱి నిచ్చటొప్పు స
న్మతులకుఁ జెల్లునే మలినమార్గ విహారము వారు సత్పథ
వ్రతపరిపాలనంబు గలవారని మున్వినవే యెఱుంగవే ... ౧ ఆ

చ. మునులు దయాళురాటఁ గుశముల్నియ వ్రజసాధనంబులై
నను దమమేఁత మాన్పక యనారతముం బెనుపంగవృద్ధిఁ గై
కొనుచుఁ దదంకతల్పములకు స్ఖలితస్వకనాభినాళ మం
డనము లొసంగుచుండు హరిణంబుల పిల్లలు లెస్సయున్నవే ౨ఆ

చ. అరిపృప కామినీ కుచములందతిపీవర మౌక్తికాభ సుం
దర నయనాంబు బిందు సముదాయములీనరనాథు చేతఁ బ
ల్మరు నెఱయింపఁ గాఁబడి చెలంగ నసూత్రములైన హారముల్
వరుస సమర్పితంబు లగులాగున నీతని శౌర్యమెట్టిదో ... ౨ ఆ

ఉ. ఆరఘువంత నాలువదియైన యతిత్వముఁ బూని పట్టణ
ద్వార బహిః ప్రదేశమునఁ దావసియించి జితేంద్రియైక మే
ధారతి నొప్పి కోడలి విధంబున నందన భోగ్యమైన ధా
త్రీరమచే భజింపఁబడి దివ్యతపోద్ధతి సల్పెనిచ్చలున్ ...౩ఆ

ఉ. ఆయత బాహుశక్తి నిరతాభ్యుదయంబునకై ప్రియత్నముం
జేయు నృపాలు వేఁటపఁ యుం జిలతదలంకెఁ దొరంగె జూదమున్
డాయదు చంద్రికాంతి ప్రకటంబగు మద్యముఁ జేరదుత్తమ
ప్రియముగల్గి యొప్పు పరభామలు గొంరి దేమిచిత్రమో 3 ఆ

ఉ. ఏ నరనాథు గర్భమున నీభువనత్రయ జన్మ కారణం
బైన జనార్దనుం డుదయమందఁ దలంచె మహాత్ముఁడందున
న్మానవనాథు లందతని మంజుల సద్గుణ పుంజ మన్యభూ
జానులయందు లేదని ప్రసంగము చేసిరి పండితోత్తముల్ 3 ఆ

ఉ. శ్రావణభాద్ర మాసములసందున వృష్టి నవగ్రహంబు లో
కావకర ప్రచారమపహార మొనర్చు తెలుంగునన్ సుమి
త్రావరపుత్ర రామ వసుధాధవమధ్య గతన్మహీసుపం
గా వరపోతువాఁడు హరణంబొనరించెఁ గఠోర చిత్తుఁడై 8 ఆ

చ. తనకుఁ గళత్రనింద బెడిదంబగు దుర్యశమున్ ఘటిల్లఁ జే
సినఁ దపనాన్వవాయ నృపశేఖరు చిత్తమయో ఘనంబుచే
నినుమును బోలెఁ దప్తమయి యెంతయు దుస్సహ వేదనా భరం
బునకు నివాస దేశమయి పొంకముదప్పె దురంత చింతతోన్ 8 ఆ

చ. మునుజన నిర్మితోటజ సమూహము చేత పవిత్ర తీరమై
ఘనతర పాతకాపహృతి కారణమౌ తమసాసరిద్విగా
హన మొనరించి తత్పులినహారితలంబున నిష్ట దేవతా
ర్చన నెఱపంగ నీమదికి సంధిలుఁ జుమ్ము ప్రసాదమంగనా !



# 335. రాపాక లక్ష్మీపతి

ఇతఁడు బ్రాహ్మణుడు; ఆపస్తంబ సూత్రుఁడు; పరాశర గోత్రుఁడు; లింగనార్యపుత్రుడు.

ఈకవి శంకర విజయము, సీతావివాహము, శ్రీమదుమాపాఖ్యానము, భద్రాద్రాయురభ్యుదయము, శ్రీకృష్ణవిలాసము అను గ్రంథములను రచియించెను ఇందు తుది రెండు గ్రంథములను నిజాం రాష్ట్రమునందలి దోమకొండ సంస్థానాధిపతులచే ముద్రింపఁబడి ప్రకటింపబడినవి. ఈ రెండు గ్రంథములును దోమకొండ సంస్థానాధిపతుల పూర్వుఁడైన కామినేని రాజన్న చౌదరిగారి ప్రేరణముచే రామారెడ్డిపేటయందు శ్రీ రాజేశ్వరునకును శ్రీరామచంద్రునకు నంకితము చేయబడినవి. తక్కిన గ్రంథములింకను లభించ లేదు.

కృతిపతి కవినిగూర్చి పలికినట్లు రచింపఁబడిన యీక్రింది పద్యములవలనఁ గవి సామర్థ్యాదులును గవి కృత్తాంతమును దెలియ వచ్చుచున్నది.

మ. నను శబ్దార్థ పరిష్క్రియాకలిత వాఙ్నైపుణ్య గణ్య ప్రదా
జనితానంద కవిత్వ తత్వరచనా సౌజన్య జన్యాత్మ మో
దన వద్దేశికపాదుకా నియతచిత్త ప్రస్ఫురన్మార్గభే
లను నైదిఘుంటిక యుక్తి యుక్తమతి బిల్వాంబంచి పల్కెన్
దయన్.

సీ. అద్వితీయాప్య పరోక్షానుభూతి ప్రసి
ద్ధాచార్య విజయ మాంధ్రాంచితముగ
ఘన జగజ్జన్మాదికారణ శ్రీమదు
మాఖ్యానము దెనుంగు నైదలిర్చ

లలిత పదార్థాద్యలంకార సహిత నీ
కావివాహము సముల్లాసమలర
గృతులు మెచ్చంగ శ్రీకృష్ణవిలాసంబు
జన మనోహరముగా మును రచించి

గీ. మించియున్నట్టి నిన్ను వర్ణించఁదరమె
ప్రబల రాపాక వంశసంభవ నవీన
జవన కవన ప్రభవన భాషావిశేష
లక్ష్మణ ప్రతిభాధుర్య లక్ష్మనార్య!

గీ. నీవు శబ్దార్థచిత్ర సన్నిహితమైన
కవశ మొనరించు ప్రోఁడవుగాన నొక్క
దైవికావ్యక్త సూక్త సంధానమహిమ
గలిగిన ప్రబంధము రచింపు కౌశలమున.

భద్రాయురభ్యుదయము.

శా. అంకోట్టంకణ వృత్తిరీతి రసశయ్యాశ్లేష పాకాది ని
శ్శంకాతంక నిరంకుశాంధ్ర కవితాశ్లాఘా నిరాఘుంటితా
లంకర్మీణ విశంకటోత్కట జటాలస్పర్ధ శబ్దోభయా
లంకార ధనిస్తూయమాను నను బిల్వన్పంచి పల్కెన్నృపన్.

సీ. అలరు శ్రీరామచంద్రాకృతి వహియించు
రాజేశ్వరుండు విభ్రాజితుండు
నతనికి భద్రాయురభ్యుదయ ప్రబం
ధము సమర్పించితి నమలమతిని
భక్తి రామాయణ పారాయణంబు గా
వించి తృప్తుఁడనైతి నంచితముగ

వర్ణిత శ్రీ భాగవత పురాణంబు దై
నందిన శ్రవణంబునను మెలంగి

గీ. యున్నవాఁడను నేను దదుభయమార్గ
నిర్గళ దనర్గళ పరాపవర్గ లక్ష్మి
ఘనతఁ జెన్నొందు నాత్రివర్గమునకంటె
ననుచు పెద్దలు వచియింతు రనవరతము

క. కావున శ్రీమత్కృష్ణ క
థావిర్భాతాశయామృతాస్వాద సుఖ
ప్రావీణ్యంబునఁ దగుమ
ద్భావము రామార్పిత ప్రబంధము గోరెన్.

క. శ్రీకృష్ణ విలాసంబను
నాకృతి శ్రీరామవిభుని కర్పించుట మే
లేకృతియైన సకలలో
కాకృతి రామప్రభుండు నరయుచునుండున్.

శ్రీకృష్ణ విలాసము.

గద్య:-ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్ష
వీక్షణ ప్రసాద ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్య పూజ్య
రాచర్లగోత్ర పాత్ర కామినేని వంశపయః పారావార రాకా
సుధాకర రాజన్న దేశాయి సార్వభౌమాజ్ఞాపితాంధ్ర గీర్వాణ
కవిత్వ చాతుర్యధురీణ పరాశరగోత్ర రాపాక లింగనార్య
పుత్ర లక్ష్మీపతి ప్రణీతంబైన భద్రాయురభ్యుదయంబు..."

గద్య:-ఇది శ్రీమద్రామచంద్ర సాంద్ర కరుణాకటాక్ష వీక్షణ ప్రసాద
ప్రాప్తోభయ భాషావిశేష కవిత్వ తత్వనిర్మాణ కర్మణ చాతుర్య

ధుర్య పరాశరగోత్ర రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతికవి ప్రణీతంబైన శ్రీకృష్ణవిలాసంబను మహాప్రబంధంబు...”.

పై గద్య పద్యములను జదివినవారికిఁ గవియును ప్రేరకుఁడును భగవద్భక్తిపరాయణులనియు నాధ్యాత్మిక చింతనాపూరిత హృదయులనియుఁ దోఁచును. భద్రాయురభ్యుదయములోని సీసపద్యము వలన శ్రీకృష్ణవిలాస మంతకుపూర్వమే రచియించినట్లు కన్పట్టుచున్నది. శ్రీకృష్ణవిలాసమందలి సీసపద్యమువలన భద్రాయురభ్యుదయ మంతకుపూర్వమే శ్రీ రాజేశ్వరున కర్పించియున్నట్లు తెలియుచున్నది. ఇది పరస్పర విరుద్ధమైన విషయము. భద్రాయురభ్యుదయ గద్యయందు కృతిప్రేరక ప్రశంసకూడ కలదు. శ్రీకృష్ణవిలాస గద్యయందది లేదు. ఈరెండు గ్రంథములలో నేదిముందు రచియించినను కృతిప్రదాన మేకకాలమున జరిగియుండినట్లూహింపఁదగియున్నది. భద్రాయురభ్యుదయమున గృతిప్రేరకుని నాతని వంశమును వర్ణించిన పద్యము లెక్కువగా గలవు. శ్రీకృష్ణవిలాసమున తక్కువగా నున్నవి. ఈ రెండు గ్రంథములలో శ్రీకృష్ణవిలాసము ముందును, భద్రాయురభ్యుదయము కడపటను రచించెనని నాయూహ.

ఈకవికిని, కృతి పేరకుఁడైన రాజన్నచౌదరికిని, రామభద్రుఁడు గురువైనట్లీక్రింది పద్యములలో వర్ణించి యున్నాఁడు.

సీ. చిదచిదీశ్వర శేష శేషి సంబంధాది
భేద దర్శనవాది నాదరించి
భాషితేష్ట ప్రాణ భావ భక్త ప్రసా
దమహేశ శైవసిద్ధాంత మెంచి
అద్వితీయా ప్రమేయాప్రతిబద్ధా ప
రోక్ష సాక్షాత్కార రూఢిఁగాంచి

పర రహస్యస్వరూప విమర్శినీ యోగి
నీ హృదయగ్రంథ నియతిఁగాంచి.

గీ. భారతీంద్రాశ్రమ సరస్వతీ రసజ్ఞ
తీర్థముల సాంప్రదాయ ప్రధీ విధిజ్ఞ
ధీరుఁడగు రామభద్రేంద్రు దేశికేంద్రు
పాదపద్మంబు లాత్మలోఁ బ్రస్తుతింతు.

సీ. చైతన్య చిచ్ఛక్తి సంవిద్విమర్శ హృ
దయ పరాసూత్ర సందర్భమరసి
సరసారుణ శ్వేత సమ్మిశ్రనిర్వాణ
చరణ సంజ్ఞల రహస్యంబుఁ దెలిపి
యాజ్ఞవల్క్యోక్త యోగమార్గ భార్గవరామ
ఖండ తాత్పర్యసంగతి వచించి
నిస్సంశయాగమ నిగమాంత రాద్ధాంతి
తైకత్వ తత్వసంప్రాప్తిఁ జెలఁగి

గీ. కుశలియగు రామభద్రేంద్ర గురువరుండు
సలలిత పరాపర రహస్యములనుఁ దెల్ప
రాజభూపాలుఁ డతని సామ్రాజ్య పూజ్యుఁ
డగుచు వర్తించెననిద త్తు ననుదినంబు.

ఈ రామభద్ర గురుఁడెవ్వరో తెలియలేదు. గృహనామ మిచ్చియున్న యెడల నతని జాడలు కొంతవరకైనఁ దెలిసికొనుట కవకాశముండి యుండును.

కృతి పేరకుఁడయిన రాజన్న చౌదరి పూర్వులలో కామారెడ్డి ఎల్లారెడ్డి అనువారలు పట్టమట్ట సోమనాథాదులచే గృతులనంది యున్నారు. మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రాది గ్రంథములను

రచియించి యున్న వాఁడు. వీరిని వర్ణించి యుండియు, నీ లక్ష్మీపతి కవి వారు రచించిన, కృతిపొందిన గ్రంథములమాట యెత్తలేదు. కారణము దురూహ్యము. కామారెడ్డి కాలము క్రీ. శ. ౧౫౮౦ సంవత్సర ప్రాంతమని సోమనాథకవి చరిత్రమునందును, మల్లారెడ్డి చరిత్రమునందును వ్రాసియున్నాఁడను. రాజన్న చౌదరికిని కామారెడ్డికిని నడుమ నాల్గుతరములు గడచినవి. వీరు రాచుర్ల గోత్రజులైన పాకనాటి రెడ్లు. వీరి వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.



దీనినిబట్టి రాజన్నచౌదరి క్రీ.శ. ౧౭౫౦ ప్రాంతమునందున్న వాఁడని యూహింపఁదగియున్నది. లక్ష్మీపతికవియు నప్పటివాఁడను టకు సందియము లేదు. ఈతని గ్రంథములను ముద్రింపించిన దోమ కొండ సంస్థాన కవులును పీఠికలో నీకాలమునే యిచ్చియున్నారు.

కృతిపతి నివాసము నిజాము రాష్ట్రములోని రామారెడ్డిపేట యని గ్రంథకర్త స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. గ్రంథకర్త నివా సముకూడ నదియేయని యూహింపఁ దగియున్నది. భద్రాయురభ్యుదయ గ్రంథాంతమందలి యీక్రిందిపద్యమునుబట్టి కవి నివాసము నిజాము రాష్ట్రమందలి వేములవాడయై యుండునాయని సంశయము కలుగుచున్నది.

మ. ఇది శ్రీ వేములవాడ పట్టణ నివాసేశాన సంప్రాప్తశ
శ్వదయ ప్రాభవ కామినేనికుల రాజారెడ్డిదేశాయి స
మ్మదలక్ష్మీపతి పండితోదిత సుధీమందార భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము రుచింపున్పంచమోల్లాసమై

భద్రాయురభ్యుదయమైదు ఉల్లాసములు కలది. మొదటి యుల్లాస మంతయుఁ గృత్యాదితోడను గృతిప్రేరకుని వంశాభి వర్ణనము తోడను నిండియున్నది.

అవంతి పట్టణమందు మందరుఁడను బ్రాహ్మణుఁడు వేశ్యా లోలుఁడయి చెడియుండుటంగాంచి శివయోగి యొకఁడాతనికి శివమం త్రం బుపదేశింప నాతఁడీజన్మంబున సత్ప్రవర్తనుఁడై మఱుచటి జన్మంబున వజ్రనాభుండను రాజునకు సుమతియను భార్యయందు తనయుండై జన్మించి, పూర్వజన్మకృత పాపంబులచే తల్లితోఁగూడ వ్యాధిపీడితుండై వాపోవుచుండ తండ్రి యారోదన ధ్వనులను వినసే రక యాతనిని తల్లితోఁగూడ నరణ్యంబున దిగవిడిచి రమ్మని

యాజ్ఞాపించెను. అరణ్యంబున నీ కుమారుఁడు కాలధర్మమునొంద నతనికై విలపించు తల్లియందుఁ గరుణించి పూర్వోక్త శివయోగి వచ్చి మంత్రాక్షతలచే నాతని బ్రతికించి యాతనికి భద్రాయువని పేరిడెను వారిరువుర నొక వైశ్యుండు తన గృహంబుననుంచి రక్షించుచుండెను. ఇంతలో మగధదేశాధి నాథుఁడు హేమాద్రి రాజు వజ్రనాభుని పైదండెత్తివచ్చి, జయించి యాతనిని బంధితునిం జేసికొని పోవుచుండ ఋషభునిచేఁ దెలుపంబడి భద్రాయువు మగధు నిపైకేఁగి వానిని జయించి, తండ్రిని విడిపించెను. పిదప నాశివ భక్తుని నియోగంబున చంద్రాంగదుఁడను రాజునకు సీమంతినియం దుద్భవించిన కీర్తిమాలినియను కన్యకను బరిణయంబయి, తలిదండ్రు లతోఁగూడ స్వస్థానమున కేఁగి రాజ్య పరిపాలనము చేయుచుండెను. ఈకథయే భద్రాయురభ్యుదయమను పేర తక్కిన నాలుగుల్లాసముల లోను వర్ణింపఁబడినది.

శ్రీకృష్ణ విలాసమునందు శ్రీకృష్ణుఁ డెనమండ్రు పట్టపుదేవు లను బరిణయమాడిన కథలు క్లుప్తముగా నైదుల్లాసములలోఁ జెప్పఁ బడినవి.

లక్ష్మపతి కవిత్వమున సంస్కృతపదము లధికము. దీర్ఘ సమాసములతో శబ్దాడంబరము కలిగి యుండును. మొత్తముమీఁద సరసమై యనర్గళధార కలిగియున్నదని చెప్పవచ్చును. శైలి తెలి యుటకై రెండు గ్రంథములనుండియుఁ బది పద్యములనిట నుదాహ రించుచున్నాఁడను.

భద్రాయురభ్యుదయము:—

మ. చతురాస్యుల్ రసనాంచల ప్రకటభాషామూర్తు లభ్యంచిత
శ్రుతులత్యూర్జిత సత్యలోకమతి దక్షుల్ సర్వకాలోల్లస

ద్రవ్యతులా పద్మనివాసులై తగిన విప్రశ్రేణులప్పట్టణ
స్థితులై బ్రహ్మానుధికరింతురు మహాదేవున్ బ్రశంశింపుచున్

మ. కమలాభ ర్తల సత్స్వరూపగుణ యోగధ్యానమా ద్వీకపా
నముచేత న్గడుమత్తుఁడై చెలఁగి యన్యంబించుకం తైన చి
త్తమునం దెంచక ధన్యుఁడై ప్రకృతిబంధముల్ దెగంగోసి యు
త్తమయోగీశ్వర గమ్య ముక్తిపదమందంబూను సర్వేశ్వరా!

శా. అంభోజ ప్రభవాండముల్ బగుల మాద్యచ్ఛాత్రప్రాలంభ సం
రంభారంభ విజృంభమాణ విలయాభ్రధ్వాన వద్భాంక్రియా
స్తంభీభూత జలేంధనాగ్నిభయ కృత్స్నప్రార్ణ వారా వకృ
చ్ఛుంభచ్ఛంఖము నొత్తెరాట్సుతుఁడు విస్ఫూర్తి
ప్రభావంబునన్. 3ఉ

చ. వలపుల రాజరాజవయి వారిచలోచనలన్ వధించి మా
వలఁగలుషంబు నొందఁదగవా పగవారలకైనఁ దద్గతుల్
వలవదటంచు మించు జనవార్తలెఱింగి యెఱుంగనట్టులన్
జలమొనరించ మంచిదగు నాభువనా వనజుండవై భువిన్. 3ఉ

మ. అవనీనాథ! యితండు నీసుతుఁడు రోగార్తుండునై యుండ నీ
వవినీతాత్మత మాతృయుక్తునిగ బ్రిహ్మారణ్య మార్గంబునన్
దవులం జేయఁ బరిభ్రమత్కవివ సమిద్ధవ్యాధిచే నాధిచే
వివిధాపద్దశచేఁ గృశింపుచు సమావిర్భూత భీతస్థితిన్. ౨ఉ

శ్రీకృష్ణవిలాసము:—

ఉ లోలత వర్ష బిందువులలో నొకటైనను సోకనీక గు
ఱ్ఱాలను ద్రోలువాఁడనను రాణొమరున్నగ చెప్పినట్లు పోఁ
జాలిన తేజులం బరవజాలుదు రెప్పుడు రాజశేఖర
శ్రీ లలితాత్మజాధిపులఁ జెప్పఁగ నేటికి వశ్వవిద్యలన్. ౧ఉ

చ. చెలువగు మోములన్ సరకుసేయక రేబవలున్ జలంబునన్
బలితపు తాపమొందియును పారముబొందవటంచు నవ్వియా
జలజములన్ గరంబుల వెసన్ వసియింపఁగఁజేసి డాసి యా
లలనలువాహినిం దళములన్ విదళించికలంచిమించుచున్. ౨ఉ

చ. తొలిమనసిచ్చి మచ్చికలతో బహుమానముచేసి యిట్లు తా
య్యాలినలయింప మంచిదగునా తగునా తెగువైన సేతలన్
జలమరివౌదువైన వినుసారసమార్గణ మార్గణార్తికిన్
గలఁగినెలంత చింతిలుటగాదది నీకహితంబగుంజుమీ. ౩ఉ

ఉ. చూచితి దేవతాసతులఁ జూచితి యక్షసరోజనేత్రలం
జూచితి నాగకన్యకలఁ జూచితి సాధ్యవధూలలామలం
జూచితిఁ గిన్నరాంగనలఁ జూచితి సర్వజగల్లతాంగులం
జూచితిఁగాని యాపడఁతి జోఁడగుచేడియఁ జూడనచ్యుతా. ౪ఉ

ఉ. పంపినఁజూచి ధర్మజుఁడు పార్థునకిట్లను రుక్మిణీప్రియుం
డింపుజనించు ముచ్చటలనెన్నుచుఁ దిన్నఁగవ్రాసినాడు చు
ట్టంపు పథంబు దల్చినికటస్థులమై మనమెల్ల కాల మా
పెంపునగాదె నల్గురిలో పేరుకు వాసికి వన్నెకెక్కుటల్. ౫ఉ

కృతిపతికిఁ బిమ్మటఁ గొంతకాలమున కాతని వంశీయులు దోమకొండను రాజధానిగాఁ జేసికొని రాజ్యమును బరిపాలించుచుండుటచే నప్పటినుండియు దోమకొండ సంస్థానాధీశ్వరులని పిలువఁబడుచుండిరి.



# 336. రేకపల్లి సోమనాథకవి

ఈకవి రుక్మవతీ పరిణయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి కాకర్లపూడి గోపాలరాయపాయకరావుగారి కంకితము చేసెను. ఈగ్రంథ ముద్రితప్రతికిఁ బీఠికవ్రాసిన మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారీ కవిచారిత్రమును బీఠికలో వ్రాసియున్నారు. అందలి ముఖ్యాంశముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

"ఈ కవిశిఖామణి వ్యవహారనామము సోమప్పశాస్త్రి. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. ఇతని తండ్రిపేరు సూర్యనారాయణ సోమయాజి. ఇతని జన్మభూమి గోదావరిమండలములోని తాళ్లపూడి ఇతఁడు ముప్పదిసంవత్సరములవాఁడై యుండఁగా, నీయన తండ్రిగారు స్వగ్రామమగు తాళ్లపూడిలో దారిద్ర్యపీడచేఁ గుటుంబభరణము చేయనోపక స్వగ్రామమును వదలి సత్యవరమను గ్రామమును జేరుకొనిరి. సత్యవరము విశాఖపట్టణమండలములో తాండవనదీతీరమందున్న తునికి సమీపములో నున్నది. సోమప్పశాస్త్రి కాలమున నాసత్యవర గ్రామము శ్రీ కాకర్లపూడివారికి రాజధానియై యుండెను ఆదినములలో కాకర్లపూడివారిలో నొకకుటుంబము సత్యవరములోను, మఱియొక కుటుంబము అనకాపల్లికి దగ్గఱగానున్న మెళుపాకలోను వేఱొక కుటుంబము అనకాపల్లిలోను రాజ్యము చేయుచున్నట్లు లేఖనప్రమాణముల వలన స్పష్టమగుచున్నది సోమప్పకవికాలము సులభముగా నిర్ణయింపవచ్చును. ఎట్లనఁగా. ఇతఁడాకాలమందు శ్రీ విజయనగర సంస్థానమందు ఆస్థానకవియగు అడిదము సూరకవికి సమకాలికుఁడై యుండెను. అనఁగా (క్రీ. శ. 1720-1790) ఈ యుభయులకు కవితాగర్వప్రయుక్తమైన స్పర్థమెండుగా నుండెను. ఆనాఁడు సత్యవరములో

రాజ్యము చేయుచున్న శ్రీ కాకర్లపూడి గోపాలరాయ పాయక రావు (పాయకరావు అనఁగా యుద్ధమునందున్న వాఁడని యర్థము) గారు సోమప్పకవిని అత్యాదరముతోఁ దనయాస్థాన కవిగాఁజేసి సకలవిధములఁ బోషించుచు మాన్యముల నొసంగి సత్యవరమందే నిల్పెను.

ఈ సోమప్పశాస్త్రి తర్కవ్యాకరణాది శాస్త్రములయందు మిక్కిలి నిష్ణాతుఁడు సాంగశిరస్క వేదాధ్యేత. కనుకనే యితఁడు కృత్యాదిలో:-

ఉ. ఆదర మొప్ప పాణినికి నానతిచేసి తదీయశాస్త్ర మి
మ్మేదిని భాతిజెంద నెలమిన్ బ్రకటాత్మ సహస్ర వక్త్రి సం
వాదము చేసి వాణికనవద్య విలాసము గల్గఁజేయు వ్యా
ఖ్యాదిత శబ్దమంజరిఁ బతంజలి నంజలిచేసి మ్రొక్కెదన్.

అని పాణిని పతంజలులను జేర్కొనెను. ఇట్లితఁడు మహాపాండితీ విరాజమానుఁడై వావదూక శిఖామణియై యున్నను. ఆకాలమందు ముఖ్యముగా రాజులకు హృదయాకర్షకమగు కవనముఁజెప్పు శక్తి లేనివాఁడై యుండెను. కవితా లక్షణముకూడ నెఱుంగఁడు. అందుచే నతఁడు తనకిది గొప్ప లోపముకదాయని తలంచి వెలివెల గాతమరాజను నొక యాంధ్రపండితకవి నాశ్రయించి యతనియొద్ద నాంధ్రఛందశ్శాస్త్రఁ జదివి కొలఁదికాలములో కవనశక్తి నలవడఁ జేసికొనెను. శాస్త్ర ప్రతిభావంతుఁడు గావున నల్పకాలములోనే నిరర్గళ నిరవద్య కవితాధోరణీ సంతర్పిత సర్వపండిత కవిలోక హృదయాంతరంగుఁ డయ్యెను. శాస్త్రజ్ఞాన పరిష్కృత కవిత, శ్లాఘ్యతమము కాదె! ఇతఁ డాస్థానపండితుఁడుగా నున్నకాలమున కానంపూడి తిమ్మకవియను నాతఁడాస్థాన కవిగా నుండెను. గోపాలరాయణింగారి తనకి దోసలపాడను నగ్రహారమునిచ్చి గౌరవించుచు

వచ్చిరి. సోమప్పకవి పండితుఁడుగాఁ బ్రవేశించిన కొలఁదికాలము నసే తిమ్మకవి దేవభూయము నొందెను. అంత నాకవి కుటుంబములో నెవ్వఁడు పదవి నధిష్ఠింపఁగల యర్హతగలవాఁడు లేనందున రాజుగారు సోమప్పకవిని దమ యాస్థానకవిఁగా జేసి యగ్రహారమును దయచేసిరి

ఈకవిశేఖరుఁడు, ఇటీవలఁ బ్రబంధములను రచించిన మధ్య కాలపుఁ గవులవలె నుభయభాషా పాండిత్య విశారదుఁడై యుండు టయేకాక. శాస్త్రజ్ఞానభాసురుఁడై యుండుటచే నీతని కవనము సంస్కృతపద భూయిష్ఠమై ప్రకాశించుచున్నది. ఈ కవిశైలి ఉత్తర రామాయణమును రచించిన కంకంటి పాపరాజు, సమీర కుమార విజయప్రణేతయగు పుష్పగిరి తిమ్మన్న, రాజవాహన విజయప్రబంధకర్తయగు కాకమాని రాయఁడు మొదలగువారి శైలిని బోలియున్నది. ప్రబంధమందెచ్చటఁ జూచినను ఓజస్సు, ప్రసాదము మొదలగు కావ్యగుణములే కానవచ్చుచున్నవి. ప్రబంధమందు నానావిధ వృత్తములను గవి రచించి యుండెను. వర్ణనలయందుత్ప్రేక్ష, అతిశయోక్తి, ఉదాత్తము మొదలగు నలంకారములు మెండు. కవనము వెదకినట్లు గ్లిష్టముతోఁగూడి యుండలేదు. వైదర్భివృత్తియే గానవచ్చుచున్నది.''

ఈకవితో సమకాలికుఁడగు అడిదము సూరకవికిని ఈకవికిని స్పర్థ యెక్కువగా నుండెడిది. అందునుగూర్చిన కథలు కొన్నిఁటిని సూరకవి చారిత్రమున వ్రాసియున్నాఁడను. సూరకవి సోమనాథ కవి యంతటి పండితుఁడుగాఁడు. కాని సరసముగా కవిత్వము చెప్పఁ గలిగినవాఁడు. సూరకవిని మనసునం దుంచుకొనియే యీతఁడు కుకవి నిందారూపమున రుక్మవతీ పరిణయమునం దీక్రింది పద్యములను రచియించినట్లు కన్పట్టుచున్నది.

చ. సరస మహాకవీశ్వరుల చాయలఁజెప్పుట యుత్తమంబు త
ద్విరచిత యుక్తి కన్య పదవిందగఁ గూర్చుట మధ్యరీతి, యీ
సరణులుమాని సాహసి సత్కృతి చౌర్యకృతి ప్రయుక్తిచేఁ
బరగెడు నిస్త్రపాత్మకులఁ బాడియె నెమ్మది సంస్మరింపగన్.

మ. ఘనవృత్తుల్ గుణముల్గణింపక నలంకారంబులున్ రీతులున్
ఘనవాక్యార్థ పదార్థ సంగతు లెఱుంగన్నేరకే యూరకిం
పునఁ బ్రాబంధికులైరి కొందఱుకవుల్ "పుణ్యైర్యశోలభ్యతే"
యనువాక్యంబుప్రమాణమయ్యెనిపుడాహా! చిత్రమిద్ధారుణిన్

చ. వరకవులంచుఁ గొందఱఁట! వారలు సాహితిలేక యే కవీ
శ్వరులఁట! వాగ్ధికలన చాలఁగ గల్గఁట! చిత్రమయ్యెడిన్
వరములొసంగు దైవములు వాగ్ధరినిచ్చుచు శాస్త్రసంగతిన్
వరమిడలేవె, సిగ్గడలు వాదులుగాక కవిత్వరీతులే!

కృతిపతియైన కాకర్లపూడివారి వంశచారిత్ర మీగ్రంథమునఁ గొంతవఱకు వర్ణింపఁబడినది. వీరు సూర్యవంశపు క్షత్రియులనియు, వసిష్ఠగోత్రజులనియు, నీవంశమునకు మూలపురుషుఁడైన కనవరాజను నాతఁడు కాకర్లపూడియను గ్రామము రాజధానిగా రాజ్యమేలుటచే నీవంశీయులప్పటినుండియు కాకర్లపూడి వారైరనియు నీక్రింది పద్యములలో వ్రాసియున్నాఁడు. కాకరలపూడి విశాఖమండలమ్ములో నున్నది.

క. ఆకస వత్సాంతలపతి
యేకచ్ఛత్రంబుగాఁగ నేలుచు జగతిన్
గాకరలపూఁడియను పురిఁ
జేకొని నిజరాజధానిఁ జేయఁగఁదానన్.

క. కాకరలపూడి కులము ది
వాకరవర వంశసంభవంబై ధరణిన్
శ్రీకరముగ సద్వంశం
బై కర మొప్పు నృపమణుల కాశ్రయమగుచున్.

ఈ కృతిపతి పూర్వులలో నప్పలరాయ పాయకరావను నాతఁడు గోలకొండప్రభువగు మహమ్మదు కుతుబ్ షాహా కాలములో నుండి యాతనికి సాహాయ్య మొనర్చినట్లును గజపతియగు ముకుంద దేవును జయించినట్లు నీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది. దీనినిబట్టి కాకర్లపూడివారు పరాక్రమవంతులై దండనాయకులై రాజ్యపాలకులైనట్లు స్పష్టమగుచున్నది.

సీ. ఘనతరామీర వాహినులకు జీవన
ప్రదమయ్యె నెవ్వాని భవ్యశరధి
వీర వజీరు తేజోరాజికి సహాయ
మైయొప్పె నెవ్వాని యాశుగంబు
లతనిజామాభీల చతురంగబల సము
ద్ధాంకం బెవ్వాని భూరిశక్తి
ఖానసంగతరణక్రమ సాహసస్థితిఁ
దనరిన దెవ్వాని ధర్మకలన
తే. మామహమ్మదు కుతుబు శాహాశ్వపతికిఁ
బ్రాణధారణ మెవని కృపాణధార
యతని నుతియింపఁ దరమె మాధ్యమికలోక
రక్షునప్పల పాయక రాయఘనుని.

ఉ. కుంతిపురాంతిక ప్రథితఘోర మహారణరంగసీమలో
నంతక వైరితేజుఁడగు నప్పల పాయకరాయ శౌరిచే

నంతము నొందియున్ రిపుల నంతతమీాఱుచు స్వస్థులైమదిన్
సంతసమంది తత్ప్రబల శౌర్యము నెన్నుదు రద్భుతంబుగన్.

సీ. ధైర్యమందరమెత్తితగనహీనగుణ క్రి
యాజృంభణంబు నొయ్యనఘటించి
నిఖిల భూపాలక నిర్జరస్తోమంబు
లురువిక్రమస్ఫూర్తి నుత్సహింపఁ
బటుభేరికా వీరభటకాహళధ్వనుల్
మధనజ నిర్ఘోష మహిమఁదెలుప
ద్వీపనాయక ముకుందదేవ దుగ్ధపయోధి
మధియించి విజయరమను గ్రహించి

గీ. యవని నవసుధ నశ్వరాజాఢ్యుఁ డగుచు
దనరుకుదుపుశాహసురత్రాణునకు నొ
సంగెనే మేటియతఁడు శశ్వత్ప్రతాప
గేయుఁ డప్పల పాయకరాయమౌళి.

ఈతని సోదరపుత్త్రుఁడగు రామభద్ర పాయకరావు కవియై పద్మినీ పరిణయమును నీలగిరినాథ శతకమును రచియించినట్లీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. పద్మినీ పరిణయ ప్రథితసత్కృతిఁజేసెఁ
బ్రతిభానుభావ సమ్మతముగాఁగ
రతి నీలగిరినాథ శతకంబుఁ గావించె
సుప్రసాద మహత్త్వదీప్రముగను
నవలేఖినీ లేఖ్యకపతానవద్యత
వెలయించె ననురూపవృత్తి దనర

సతతచాటునిబంధ సరసోక్తులలరించె
సహృదయ హృదయైక సరణిమీఱ

గీ. ననుచుఁ గవులు నుతింతురెవ్వాని నతఁడు
సంగరాభీల కరజాల శమితవిమత
దవహుతాశుఁడు రామభద్రక్షితీశ
ఘనుఁడు భువన ధురంధరఖ్యాతిఁ దనరె.

ఈ రామభద్రకవి చారిత్రమును వేఱుగ నీగ్రంథమున వ్రాసి యున్నాఁడను.

కృతిపతియైన గోపాలరాయపాయకరావుగారు రుస్తుముఖాను కుమారుని సంహారించి జయముఁగొన్నట్లు వర్ణించిన పద్యములలో నొకటిదాని నీక్రింద నుదాహరించుచున్నాఁడను

ఉ. కాకరపూడి జగ్గమహీకాంతుని గోపనృపాలుఁ డుగ్రతన్
జేకొని రుస్తుమాత్మజవ జీరబలంబులఁ ద్రుంపశోణితో
ద్రేక నదీరయాగత తదీయవిభూషణ రత్నరాజి ర
త్నాకర నామమింపలరె నాహవరంగ సమీపవార్ధికిన్.

ఈగోపాలరాయఁడు మఱికొందఱు మహమ్మదీయ నాయకులను వధించినట్లాశ్వాసాంత పద్యములయం దీక్రిందివిధముననున్నది. రుస్తుంఖాను కుమారుఁడిందొకఁడేమో ?

క. రుస్తుముఖాన తనూభవ
మస్తక బలిపూర్వకాత్త మహితఘనశ్రీ
నిస్తుల సువిదిత నిధిసు ని
రస్తైకాంతనిధి రాజరాజైశ్వర్యా !

క. సమదముజాయతుఖాన జ
నిమథన యజసార కవిమణీనుత నానా
నమచమిత రాజలీలా
సమకర కారుణ్య రుచిర సరసకటాక్షా!

క. వార్ధవితరణ విహారో
దుర్దమ చతురంగసైన్య ధూర్వహాదరకృ
న్మార్ది హలుశేఖ్ఖాన శిరో
మర్దన చణ బాహుసార మహితవిచారో!

క. మోహాన వసుధాదాన దు
రూహాతిక్రమణ సాహసోద్యమ భాగా
జీ హలుశ్శేన తనూభవ
రాహుశిరచ్ఛేది చక్రరాజితహస్తా!

క. బలవదెకిఖియార్ ఖానో
జ్జ్వల సైనికనాథ మాపుశాహప్రముఖా
ఖిలవజ్జిర యశోహిమ
జలజేశిత తేజదాన సారమహీజా.

కృతిపతియైన గోపాలపాయకరావుగారు సత్యవర ప్రభువై నట్లీక్రింది యాశ్వాసాంత పద్యమువలనఁ దెలియుచున్నది.

శా. ఖశ్వత్క్షోణి వరార్పిత ద్విపఘటావిఖ్యాత దానాఝ్ఝరీ
విశ్వాసోపగ తద్విరేపనిన దద్వేశ్యోత్తమాస్థాన స
ప్తాశ్వాగ్ని ప్రతియాని తేజ జనతాపాశేష నిర్వాపకృ
చ్ఛశ్వత్సత్య వరాభిధానకపురీ సౌభాగ్యకందాయితా.

కృతిపతిని గవి "శ్రీకృష్ణలీలాసుధారస సరసకృతి ప్రముఖ సప్తసంతాన నిరంతరీకృత సంతోష స్వాంతుండును" అని వర్ణించి

యుండుటనుంబట్టి శ్రీకృష్ణలీలా సుధారసమను గ్రంథమును కృతిపతి కృతినొంది యుండెనని ద్యోతక మగుచున్నది. ఈ గ్రంథమును రచియించిన వారెవ్వరో తెలియదు.

ఈశ్వరుని కంటిమంటచే దగ్ధుఁడై పోయిన మన్మథుఁడు జన్మాంతరమున శ్రీకృష్ణునకు రుక్మిణీదేవియందు ప్రద్యుమ్నుఁడై జన్మించుటయు నాతనివలనఁ దనకు మరణమని యెఱింగిన శంబరాసురుఁడు మాయోపాయంబున రుక్మిణి ప్రక్కలోనున్న శిశువు నెత్తికొనిపోయి సముద్రమునవైవ దానినొక చేప మ్రింగుటయు, నాచేపను జాలరులు పట్టుకొని శంబరాసురుని మహానసమునకుం దీసికొనిరాగా నంతకు మున్నె యీవృత్తాంతమునువిని శంబరాసురునికడ మహానసమందు సేవకురాలుగా కుదిరియున్న మన్మథునిభార్యయగు రతీదేవి యాశిశువును గోప్యముగా రక్షించి, పెద్దవానినిగాఁ జేసి శంబరాసురుని మాయలనన్నిఁటి నాతనికి నేర్పి యాతనిచే శంబరుని వధింపఁజేసి తీసికొనివచ్చి శ్రీకృష్ణునింటఁ జేర్చుటయుఁ బ్రద్యుమ్నుఁడు తన మేనమామ రుక్మి తనయ రుక్మవతిని స్వయంవరమునఁ బరిగ్రహించుటయు మొదలుగాగల కథ యిందు వర్ణితమైనది. ఈకథ భాగవత దశమ స్కంధమందున్నది. దానినే యీకవి వర్ణనాంశములతోఁ బెంచి ప్రబంధమును నిర్మించినాఁడు. ఈకవి వ్రాసికొనిన యీక్రిందిగద్యమునుబట్టి యీతఁడు లక్కవరమందుండెడి శ్రీరామచంద్రుని భక్తుఁడైనట్లు కన్పట్టుచున్నది. విశాఖపట్టణమండల మందలి లక్కవరమయి యుండును. కవి యీ లక్కవర గ్రామవాసియేమో!

గద్య:- ఇది శ్రీ లకవర సుమనోగిరిధామ రామచంద్ర చరణారవింద మకరందాస్వాదన సమాసాదిత నిరవద్య సాహితీ రస విభావితసుకవితాతిశేక రేకపల్లి సూర్యనారాయణ తనూభవ సకల విద్వత్కవి జనానుగ్రహ సనాథ సోమనాథ ప్రణీతంబైన......"

రుక్మవతీ పరిణయమునుండి కవితాధోరణి తెలియుటకై కొన్ని పద్యములిట నుదాహరింపఁబడుచున్నవి.

ఉ. అప్పురిలీల సౌధములయందు నృపాత్మజులొక్క రొక్కరిం
దప్పుమటంచు నొడ్డుచును దాఁటఁగ నొక్కనిచే కటారి యా
యుప్పరవీధినున్న శశినుక్కఁ దాఁకెనొ కాక యున్నఁ జె
న్నొప్పెడి మేనమచ్చ యొకటూనఁగ నేటికిఁ గల్వఱేనికిన్.

మ. తనయుం బాసిన నాఁటనుండి యొక వార్తాలేశమింతైన లే
దనయంబు న్మదిగుందఁ జేసె విధి యాహా! వానిలావణ్య రే
ఖ నిరూపింపఁగ నెందుఁగాననయితిం గన్పట్టు నీధన్యునం
దునితం డెవ్వఁడొ కోయటంచు మదిఁ జెందున్సంశయం బెంతయున్

ఉ. ఓమహనీయ దివ్యమహిమోజ్జ్వల! రాజవరేణ్యుఁడైన మా
మామకు రుక్మిభూపతికి మాన్యతరాకృతి ధన్యయైన క
న్యామణి గల్గె రుక్మవతి నాననురూపలసత్సహాఖ్యయై
యేమని చెప్పవచ్చుఁ దరళేక్షణ రూపవిలాస సంపదల్. ౩౧

చ. సరసిజనీరధరాత్మభవ చంద్రదశాననుచెంత నుత్పలా ౨౧
దరణసగంధవృత్తిఁ గని తాపముఁ జెంది కృశించుచున్న య
త్తతి సమయాంజనాసుతుఁడు దారత రేన కరాంగుళీమణి
స్ఫురదురుముద్రఁ దెచ్చెననఁ బొల్చెను వేకువ చుక్క తూర్పునన్

ఉ. కాకమతేమి సిగ్గొయది కాంతుని పజ్జకుఁ జేరు దాఁక నే
చేకొని సిగ్గుగిగ్గు విడఁ జేసి మనోభవుఁ డివ్వేలందికిన్
దీకొని యాత్మతంత్రములఁ దీరికదీర్చి యొసంగుఁగాదె బి
బ్బోకవతీమతల్లులకు బుద్దులు దిద్దగఁజాలు ప్రోఢిమల్. ౪౧

"సోమప్పశాస్త్రిని గురించి కొన్ని చిత్రమైన కథలు చెప్పుదురు. వానిలోఁ గొన్నింటిని నిచట వ్రాయుచున్నాఁడను.

సోమప్పకవి తొంబది సంవత్సరములకుఁబైగా జీవించెనని వాడుక. ఆయనకు మూఁడు వివాహములైనవి. అందులోఁ గడపటి పెండ్లి యఱువదియేండ్ల వయసున జరిగెను వివాహము చేసికొని పెండ్లికుమార్తెను వెంటఁబెట్టుకొని రాజదర్శనార్థము కోటలోనికి వెళ్లగా రాణీగారు "తాతగారూ! పెండ్లికూఁతురు పేరేమిటి" అని అడుగఁగాఁ బెండ్లికూఁతుం పేరు పాపమ్మయగుటచే యుక్తిపరుఁడగు సోమప్పశాస్త్రి "చెప్పితే పాపమా?" అని శ్రీ రాణీగారి ప్రశ్నను గడుసుఁదనముగాఁ దప్పించుకొనెను. పిదప వళాగ్రపు చెక్కలు పెట్టి తాంబూలమిప్పించి పెండ్లికుమార్తె చేతఁ దమలపాకులు చుట్టించి యా ముసలిపెండ్లికొడుకును దాంబూలము వేసికొనమని కోరఁగఁ బండ్లన్నియుఁ బోయి బోసివాఁడైయున్న యా వృద్ధవరుఁడు వళాగ్రపుచెక్క నమలలేక దిక్కులుచూడ మొదలుపెట్టెను. అప్పుడు రాణీగారు "తాతగారూ! నూరిప్పింతుమా" అని నవ్వుచు నడుగఁగా "అమ్మా! తమరు నూఱిప్పించితే మిగతా పదహారెవరిప్పిస్తారు" అని చమత్కారముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను. యుక్తి యుక్తమగు నతని వాక్యములు రాణిగారు మొదలగు నచ్చటి స్త్రీజనము నెంతయు నలరించెనని వేఱుఁగ జెప్పవలెనా?

ఒకప్పుడేదో కారణము చేత సోమప్పకవిమీఁద జమీందారు వారికి నను గ్రహము దప్పినది. అంత నాతఁడు శ్రీవిజయనగరము వెళ్లి మహారాజావారి యగ్రజుఁడును దివానునగు శ్రీ సీతారామరాజుగారిని, తనకు వారితోఁగల పూర్వపరిచయ బలమున నాశ్రయించి మహారాజావారి దర్శనలాభము గాంచెను. ఆ దినము శ్రావణ శుద్ధ పౌర్ణమి. రాజసభ పండితులతోను, కవులతోను నిండియుండెను. వేదశాస్త్రవేత్తలగు పండితులు మహారాజునకు కుడివైపునను, కవులెడమవైపునను గూర్చుండి యుండిరి. సోమ

ప్పకవి సత్యవరములో నాస్థానకవిగానుండి వచ్చిన వాఁడగుటచేఁ గవులతోఁ గలసియుండెను. ఆశీర్వాచన సమయమందుఁ బండితు లందఱు వేదమంత్రములచేతను కవులు పద్యములచేతను మహారాజు నాశీర్వదించిరి. సోమప్పశాస్త్రి తాను గవులతోఁ గలిసి కూర్చుండియున్నను వేదమంత్రమూలముగా నాశీర్వదించెను. మహారాజు గారెంతయు నాశ్చర్యమును సంతోషమునుబొంది సోమప్పకవినిఁ గుడిప్రక్కను గూర్చుండఁజేసి యాతనికి శాలుజోడాల నొసఁగి సత్కరించిరఁట! నాఁటిసభ ముగిసినపిదప మన శాస్త్రిగారింటికి వెళ్లిపోవుచుండగాఁ గోటగుమ్మమునొద్ద నొక భట్రాజాతనిఁజూచి

క. అప్పా! రేకపలీ సో
మప్పా! విబుధాళిపాళి యమృతపులప్పా!
ఒప్పాలు నీకవితలు వె
న్నప్పాలకు సాటివచ్చునాభళిరుచులకున్.

అని చదువఁగా సోమప్పకవి తానప్పుడే బహుమానముగఁ బొందిన శాలుజోడు నాభట్రాజున కిచ్చివేసెను. ఆ సమాచార మెట్లో మహారాజావారికి విశదము కాఁగా మరునాటి రాజసభలో వారు "సోమప్పశాస్త్రీ! మేముచేసిన బహుమానము కోటదేవిడీ దాఁటలేదఁట!" అన "మహాప్రభూ! యేలినవారి యీవి యీ దేవిడీయే కాదు సప్తసముద్రములు దాఁటినది", అని శాస్త్రి ప్రత్యుత్తరమీయ సరసుఁడగు నావిజయరామ గజపతి మహారాజా వాక్యచమత్కృతికెంతయు సంతసించి వేఱొక శాలుజోడాను సోమప్పశాస్త్రికిప్పించి యనేకరీతుల నాతని గౌరవించెను ఇట్లాతఁ డాఱు నెలల కాలము విజయనగరాస్థానమున నుండి మగుడఁదన యేలికలకు ననుగ్రహము రాఁగా సత్యవరమునకు వెళ్ళిపోయి తన జీవిత శేషము నచ్చటనే గడపెను...

# 337. నెల్లూరి వీరరాఘవకవి

ఈకవి పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాస్యపగోత్రుఁడు; వెంకటపతి మంగమలకుఁ బుత్రుఁడు; రంగనార్యుని పౌత్త్రుఁడు. ఇతఁడు యాదవరాఘవ పాండవీయమను నాల్గాశ్వాసముల త్ర్యర్థిప్రబంధమును రచించి, శ్రీకృష్ణున కంకితము చేసెను.

కవి తననుగూర్చి యిట్లు చెప్పుకొని యున్నాఁడు.

సీ. గురుతర కాస్యపగోత్ర సంభవుఁడను
సురుచిరాపస్తంబసూత్ర యుతుఁడ
మహితనెల్లురిరంగన మంత్రికిఁ బౌత్రుఁడ
కృతియైన వెంకటపతి నియోగి
కిని, మంగమాంబకు తనయుఁడ వీరరా
ఘవనామ విఖ్యాతిగలుగువాఁడ
సర్వజ్ఞమూర్తియౌ సర్వేశు భజయించి
తత్ప్రసాదాసాదిత ప్రసిద్ధ
కవితఁగలవాఁడ ఘనకావ్యకరణ వివిధ
బహుళపరికర లక్షణ పారదర్శి
నుభయభాషల బహుకృతుల్ సభలుమెచ్చ
ఘటనఁజేసినవాఁడ సత్కవులదయను.

చ. అలర వసుంధరా పరిణయంబు తదుత్తరభాగ కావ్యమున్
వెలయఁగఁ జెప్పినాఁడ ననవేఱ మదీయవిధంబు దెల్పఁగా
వలయునె శ్లేషచిత్రముఖ వైఖరులన్ రచనాప్రపంచమం
దుల నెవరెట్లుసెప్పినను దోడనె సెప్పఁగనేర్తునట్టులన్.

యాదవ రాఘవ పాండవీయముదప్ప యీతని రచనము లేవియు నిప్పుడగపడుటలేదు. కవి, తన తాతకుఁదాతయైన కొండ యామాత్యుని వర్ణించిన యీక్రింది సీసపద్యమువలన నీతని పూర్వు లొకప్పుడు, దేశరాజువారను గృహనామము గలవారనియు, నీకొండయామాత్యుఁడు వీణెవాయించుటలోఁ గడునేర్పరియై బిరుదు లంది యుండుటచేఁ గొంతకాలము 'వీణె' యను నింటిపేరుగలవారై రనియుఁ దరువాత పాకనాటనున్న నెల్లూరు నివాసముగుటచే నెల్లూ రను గృహనామము వచ్చినదనియుఁ నీకొండయామాత్యుని తన యుఁడు, పెద్దవెంకటపతిరాయలవద్ద దండనాయకుఁడుగా నుండె ననియుఁ దెలియుచున్నది.

సీ. ఎవ్వనితండ్రి పేరిల దేశరాజు వా
రన నింటిపేరు మున్నునరఁదెచ్చె
నెవ్వని సద్విద్య హెచ్చుగా వీణవా
రన నింటిపేరు మున్నమరఁగూర్చె
నెవ్వని కొమరుఁడీయిల పెద్దవేంకట
పతిరాయలకు దళవాయియయ్యె
నెవ్వఁడు గీతసాహిత్య విద్యలనేర్చి
దిగ్విజయంబునఁ దేజరిల్లె
నెవఁడు భవిణమలహరియు ధవళశంఖు
లాదిగా బిరుదులనెల్ల నందిమించెఁ
బ్రౌఢరాజులచే నిమ్మపండనంగ
నతఁడు నుతికెక్కె గొండలాహ్వాయుఁడు జగతి.

ఈ పెద్దవెంకటపతిరాయలు, వసుచరిత్ర కృతినందిన తిరుమల రాయల పుత్త్రిలలో నగ్రజుఁడు. ఇతడు క్రీ.శ. ౧౫౮౫ మొదలు

౧౬౧౫వ సంవత్సరమువఱకును రాజ్యము చేసి యున్నవాఁడు. ఈతనియొద్ద దండనాయకుఁడుగా నున్నదీకవికిఁ బ్రపితామహుఁడు కావున నీతఁడు ౧౨౧౫ సంవత్సర ప్రాంతముననుండి యుండునని కవిచరిత్రకారులు వ్రాసియున్నారు. ఈగ్రంథముయొక్క ముద్రిత ప్రతిచివర యిట్లు వ్రాయఁబడియున్నది.

"కలియుగాబ్దంబులు ౪౩౧౪ శాలివాహనశకంబులు ౧౬౩౪ యగు హేవళంబి సంవత్సర ఆషాఢ బ॥ ౧౧ వఱకు యాదవరాఘవ పాండవీయరచన నెఱవేఱినట్టును, శార్వరి వైశాఖ బ॥ ౨ బుధవారమువరకు అమృతకవి రాఘవయ్యచేత వ్రాయఁబడినట్లు మాయొద్ద తాళీదళసంపుటములో వ్రాయఁబడియున్నయది" దీనినిబట్టి కవిచరిత్రకారుల యూహతో నీకాలము సరిపోయినట్లు స్పష్టమయినది. కావున గ్రంథరచనాకాలము క్రీ. శ. ౧౨౧౨ అగుట నిశ్చయము.

ఈ వీరరాఘవకవి, విశేష పాండిత్యముగల మహాకవియైన ట్లాతఁడు తన సామర్థ్యమునుగూర్చి చెప్పుకొనిన యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది. ఇతఁడు పదియర్థములు వచ్చునట్లుగా గావ్యమును రచియింపఁగల వాఁడఁట :

సీ. సకలమంత్ర రహస్యశాస్త్ర సర్వంకష
 ప్రజ్ఞాధికస్ఫూర్తిఁ బరిఢవిల్లి
నిఖలయోగ రహస్య నిరుపమత్రివిధోరు
 రాజయోగాభ్యాస రక్తిమీఱ
యాగమాంతరహస్య భాగోపనిషదర్థ
 సర్వస్వవిజ్ఞాన సరసమెఱిఁగి
నాటకాలంకార నానావిధ విశేష
 రసభావభేదముల్ పొసఁగఁ దెలిసి

శబ్దముఖ్యశాస్త్ర సదసద్వివేకత
స్మృతిపురాణ వాస్తు రతిరహస్య
గణిత తురగరత్న గజపరిజ్ఞానత
నమరు వీరరాఘవాఖ్యకవిని.

క. నానావిధావధానము
లాన్నృపనీతియును భరతమాహాత్మ్యదుల్
మానుగ నిచ్ఛాలిపియును
మానితముగఁ గల్గుగోపనంబును మఱియున్.

క. ప్రాకృతముఖ షడ్భాషల
వ్యాకరణంబులును దెలుఁగు వ్యాకరణంబుల్
ప్రాకట సాముద్రికమును
వీకన జ్యోతిషముఁ జాపవిద్యావిధమున్.

క. సాంగముగఁ దెలిసి మునుయో
గాంగీకార మతినిశ్చలానుభవాప్తిన్
బొంగియు నియోగవృత్తిఁ బొ
సంగి తెలంగితిని సరస సాహిత్యనిధిన్.

సీ. శతలేఖనీపద్య సంధానచాతురీ
ఘటికాశతగ్రంథ కరణపటిమ
ఆశుప్రబంధాది క్రియారూఢి
సంకరోష్ఠ్య నిరోష్ఠ్య చాటుకలన
విస్తరమాధుర్య వివిధచిత్రస్ఫూర్తి
పాదమాత్రాన్య త్రిపాదఘటన
వ్యస్తాక్షర విమిశ్ర బహుపద్యగుంభన
మచలజిహ్వాదిక ప్రచురరచన

బహుజన మనోంతరస్థిత బహువిధార్థ
బహుసమస్యా ప్రపూర్తియు బహువిభేద
సకల విషమసమస్యాది సంవిధాన
మమరఁగూర్తును నెఱిరాఘవాఖ్యకవిని.

క. పంచాశచ్చాటుకథా
చంచత్కృతులను రచించి సత్కవిపూజా
సంచితకీర్తిని దగు సా
ధ్వంచితుఁడను వీరరాఘవాఖ్య నియోగిన్.

చ. అవునన కావ్యపఙ్క్తి పదియర్థములన్రచియింపనేర్తు స
త్కవులదయన్ శిరీషకవితామృదు తామహితార్యవైఖరిన్
భువినటులైన సత్కథల మూఁటి నొనర్తును బాలబోధకై
తివిరిబహుత్వమందు నలత్రిత్వము పర్యవసానమాటచేన్.

సీ. ఒకచోట శబ్దార్థయుగళ చమత్కార
సందర్భ గర్భిత చతురవృత్తి
యొకవంక నకలంకితోదయధ్వని ముఖ్య
మొకవంక వాచ్యార్థయోగ విభవ
మొకచక్కిఁ జక్కని ప్రకటితశ్లేషోక్తి
యొకచక్కినిన భంగయుతపదాప్తి
యొకదారి పదవాక్యనికర గవ్యంగంబు
నొకదారి బహుళార్థయోగ గమ్య
మొకటపూర్వాపరాన్వయ యోగగతుల
నొకట నేకార్థ వైభవప్రకటయుక్తి
సరసగుణములు విలసిల్ల సరసరీతి
వృత్తుల రసప్రబంధంబు నిస్తరింతు.

చ. వివిధబహుప్రయోగములు విశ్రుతమై విలసిల్లు లెస్సగాఁ
కవులు పరీక్ష సేయుఁడిది కాదనఁబోకుఁడ దెట్టులన్న నే
నవిరళసాహితీ పరికరాంబుధిపారగుఁ డన్బుధాళియు
న్నవిలి విచారసాధుగతి తథ్యము జేసినదందు మీఁదటన్.

ఈ పద్యములనుబట్టి కవి యొక్కింత యాత్మశ్లాఘనాప్రియుఁ డువలెఁ గన్పట్టుచున్నాఁడు. త్ర్యర్థికావ్యమునుండి కవిత్వగుణము నిర్ణయించుట భావ్యముకాదు అయినను, ఈతని యాదవరాఘవ పాండవీయమునుండి నాల్గుపద్యముల నుదాహరించు చున్నాఁడను.

చ. ప్రమద మెలర్పఁగాంచె నలరాజు ద్వితీయుల తాఁగి దేవకీ
రమణి మనోజ్ఞవాణి పతిరంజనశీల యశోభిరామ స
త్క్రమ పృథగీరిత స్తుతవిరాజిత సద్గుణపాళికై కయు
త్తమనరునిన్సదా శుభరతన్నిధితాహ్వయుఁ గృష్ణుదవ్యునిన్.

శా. అంతస్స్నితి నిరస్తభార్గవ కుమారాద్యంత వృత్తాంతము
ద్భ్రాంతిన్దాహితకోటిచే వినియము ప్రాప్తిన్దగన్వారలన్
జెంతన్దేరుచుఁబిల్చి కౌఁగటను జేర్చెన్ దద్గుణశ్లాఘతో
నెంతేనిన్సమయోచితంబు క్రియతో నింద్రుండు వచ్చెన్దయన్.

ఉ. భూవరకన్యకన్ విమలబుద్ధియెసంగ నరుండుగాఁడు స
త్సేవధియాదివిష్ణువె యుదీర్ణత నీపయివచ్చినాఁడు సు
మ్మీవిను నాదుబుద్ధిచెడు మేలగు నే కులనాశ మొప్పునే
నీవిలసత్తనూజయ రుచినేలనణంగఁగఁ జూడనేర్తునే. 3ఆ

మ. గురుశల్యుండును బాణుఁడుగ్రదశ వర్తిండయ్యె డన్వాచ్చిత
న్హరియైనన్నరుఁడైన భీముఁడైనన్ధర్మరాజైన సం
గరమందు న్దొరయంగ నేరరనుచు న్గర్వోక్తులంజేరి భా
సురసైన్యమ్ములతోఁ బయింబడియెదోస్ఫూర్జద్బలావార్యుఁడై.

ఈకవితనయుఁడైన శివరామకవి, కామకళానిధియను శృంగార గ్రంథమును రచియించి, తంజావూరు మహారాష్ట్ర రాజగు జయసింహుని కంకితముచేసి యున్నవాఁడు.

ఈ వీరరాఘవకవి విశేషణరామాయణమను కావ్య మేడు కాండలుగ సంస్కృతమున రచియించెను. ఇంతేకాకుండ వల్లీ పరిణయము, భవభూతి ఉత్తర రామచరిత్రకు వ్యాఖ్య రచియించెను.

పాఠకుల కుపయుక్తమగునని శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయములో వ్రాసిన విషయమిట వ్రాయుచున్నారము.

"ఇతఁడు కామకళానిధిని రచించిన నెల్లూరి శివరామకవి యొక్క తండ్రి. ఈతని తెనుఁగు కృతులు రెండు లభ్యమైనవి. ఒకటి యాదవ రాఘవ పాండవీయము త్ర్యర్థి కావ్యము. రెండు వసుంధరా పరిణయము ఈ రెండవ గ్రంథమున కవి తనవంశమును వర్ణించి యున్నాఁడు. అందు తాను రచించిన కృతులనుగూడ పేర్కొని యున్నాఁడు.

సీ. సప్తకాండమ్ములు సప్త విభక్తులు
హారికర్థము విశేషణాప్తిఁదనర
రఘణ విశేషణ రామాయణంబు నాఁ
గృతి రచించితి చతుష్కృతి రహింపఁ
గృష్ణభుజంగంబు కృష్ణలీలామృతము
త్రిపురారి దండకకృతి రచించి
అలగస్థంబోధ్వ వంబాదిగాఁ దత్కథ
గద్యకావ్యంబుగా ఘటనఁజేసి

యొంచ రసమంజరిని తెనిగించి నీతి
సర్వలోకేశ శతకంబు సంఘటించి
మంత్రపాదస్తవంబును మఱియుఁ గృతులు
ఘటనఁ జేసితి వీరరాఘవ కవీంద్ర

పై వానిలో విశేషణ రామాయణము తంజావూరి పుస్తకశాలలో నున్నది. ఇది సంస్కృతమున నున్నది.

3787 విశేషణ రామాయణము. నెల్లూరి వీరరాఘవకవి :-

శ్రీమత్కాశ్యపగోత్రసూత్ర మహితాపస్తంబసూత్రస్య చ
శ్రీమన్నెల్లురి రంగమంత్ర సుధియః పౌత్రస్య విద్యానిధేః
శ్రీమత్పూజిత వీరవెంకటపతేః పుత్రస్య రామాయణం
కావ్యం స్వీకురు వీరరాఘవకవేః శ్రీరామ మేవాఙ్మయమ్
శ్రీరామాంఘ్రి సరోరుహాంకిత మిదం శ్రీరాఘవాఖ్యావతా
ప్రోక్తం చారుతలం విశేషణ మహారామాయణం వానవీమ్
శ్రీమచ్చాటికథా శుకావ్యరచనా చాతుర్య వాగ్వైఖరీ
శ్రీవైచిత్ర్య ధురంధరేణకవి నాచంద్రార్క తారం వసేత్.

శ్రీ విశేషణ రామాయణే వీరరాఘవీయే ఉత్తరకాండే
సమాప్తం.

సంస్కృత విశేషణ రామాయణముతప్ప తక్కిన రెండు తెలుగు ప్రబంధములును నెల్లూరియందు అముద్రిత గ్రంథ చింతామణి పత్రికలో ప్రకటితములైనవి. వానినుండి యీతని కవితా వైదుష్యము ప్రతిభాదికము గ్రహింపనగును."

⸺

# 338. మంగళగిరి ఆనందకవి

—:—

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; ఆత్రేయగోత్రుఁడు; తిమ్మయామాత్యుని పుత్త్రుఁడు; నరసయామాత్య పౌత్త్రుఁడు.

ఈకవి విజయనందన విలాసమను మూఁడాశ్వాసముల ప్రబంధమును, రచించి, దాట్ల వేంకటకృష్ణ నరపాలునకును, వేదాంతరసాయమను నాల్గాశ్వాసముల పద్యకావ్యమును రచియించి ధణిదాస మంత్రికిని గృతియొసంగెను. విజయనందన విలాసమునకు శశిరేఖా పరిణయమని నామాంతరము. శశిరేఖాపరిణయమందలి కథ సుప్రసిద్ధమైనదికావున నిటవ్రాయ లేదు. ఆకథయందలి ప్రధాన విషయము కాకరపర్తి కృష్ణకవి చారిత్రమున వ్రాసియుంటిని. వేదాంతర సాయనమున, యేసుక్రీస్తు చారిత్రము వర్ణింపఁ బడినది. ఈరెండు గ్రంథములలో నేది ముందురచియింపఁబడినదో తెలియదు. ఈపుస్తకములయందలి గద్యలించుక భేదముగానున్నవి. ఆగద్యలు రెండిఁటి నీక్రింద వ్రాయుచున్నాఁడను.

"ఇది శ్రీభ్రమరీ మల్లికార్జున కటాక్ష వీక్షాలబ్ధ సరససాహితీ ధౌరేయ యాత్రేయగోత్ర పవిత్ర మంగళగిరి నరసయామాత్య పౌత్ర తిమ్మయామాత్య పుత్ర సుజనవిధేయ, ఆనంద నామధేయ ప్రణీతంబైన విజయనందన విలాసంబను మహాప్రబంధంబు".

"ఇది శ్రీమత్సర్వేశ్వర కరుణాకటాక్ష వీక్షాలబ్ధ సరససాహితీ ధౌరేయ యాత్రేయగోత్ర పవిత్ర మంగళగిరి తిమ్మయామాత్య పుత్ర సుజనవిధేయ యానందాభిదేయ ప్రణీతంబైన వేదాంత రసాయనంబను మహాప్రబంధంబు"

మొదటి గద్యయందలి "భ్రమరీ మల్లికార్జునుఁడు" రెండవ గద్యలో "సర్వేశ్వరుఁ"డైనాఁడు. ఈరెండు గద్యలకనుగల భేద మింతయే.

బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులుగారీ "కవి క్రైస్తవ మత మవలంబించిన నియోగి బ్రాహ్మణుఁడు" అని వ్రాసియున్నారు. విజయనందన విలాసపీఠికాకారులు, ఈకవి క్రైస్తవమతము నవలంబించెనని చెప్పుట కాధారములు లేవని వ్రాసియున్నారు. ఈవిషయము విచారణీయము. పంతులుగారు విజయనందన విలాసము నెఱుంగరు. నిర్దిష్టముగాఁ జెప్పలేకపోయినను, వాదము కొఱకు, విజయనందన విలాసము మొదటను దరువాత వేదాంత రసాయమును వ్రాసినట్లంగీకరింతము. భ్రమరీ మల్లికార్జునుఁడు ప్రత్యేక దైవము. సర్వేశ్వర శబ్దమునకు క్రైస్తవ దైవమని యర్థము లేదు కాని క్రైస్తవులు నమ్మెడి జగదేక దేవుఁడను నర్థమున్నది. ఆయర్థము హిందువుల మతమునకును విరుద్ధము కాదు. భ్రమరీ మల్లికార్జున భక్తుఁడు సర్వేశ్వర భక్తుఁడు కావచ్చును కాని సర్వేశ్వర భక్తుఁడైనవాఁడ తరువాత భ్రమరీ మల్లికార్జున భక్తుఁ డగుట సామాన్యముగాఁ దటస్థింపదు కావున విజయనందన విలాసము ప్రథమముననను, వేదాంత రసాయనము పిమ్మటను రచించి నట్లూహింపఁ దగయున్నది

విజయనందన విలాసమున గోపాలకృష్ణుని, లక్ష్మిని, శంభుని, పార్వతిని, బ్రహ్మను, సరస్వతిని, గరుత్మంతుని, హనుమంతుని, నాదిశేషువును, విఘ్నేశ్వరుని, ఒక్కొక పద్యములోఁ గవి వర్ణించి ఆదేవతలు కృతిపతి కాయురారోగ్యము లొసంగు నట్లాశీర్వదించి యున్నాఁడు.

వేదాంత రసాయనములోని గ్రంథారంభ పద్యమిది:-

శా. శ్రీమంతుండు సమస్తలోకజన నష్టేమోపసంహార లీ
లామాన్యుండు శ్రితావనాదరగుణాలంకారుఁడామ్నాయచూ
డాముఖ్యాశయవేద్యుఁ డవ్యయుఁ డఖండశ్రాంతి సర్వేశ్వరుం
దామోదంబునఁ బ్రోచు నెల్లపుడు దాసామాత్యచూడామణిన్

ఈపద్యమున నుపనిషత్ప్రతిపాదకుఁడగు పరబ్రహ్మస్వరూపుఁడే వర్ణితమైనట్లు స్పష్టమగుచున్నది. ఇది మొదటిపద్యము. 6వ పద్యములో, కవి తన యిష్టదైవము నీక్రింది పద్యములో ప్రార్థించియున్నాఁడు.

ఉ. మౌని మనస్సరోరుహ సమాహిత మద్వయ మవ్యయంబ వా
జ్మానసగోచరం బనుపమానమనంత మభేద్యమొద్ది య
ద్దాని విశుద్ధతేజము హతాశ్రిత దుర్భర పాపపుంజ మెం
తేని రతిన్ భజించెద మదీయ మనోభిమతార్థ సిద్ధికిన్.

ఈ రెండు పద్యములలో నిమిడియున్న యర్థమొక్కటియే. ఈరెండు పద్యములకు నడుమనున్న 2, 3, 4, 5 పద్యములలో యేసుక్రీస్తు, అతనితల్లి మరియమ్మ మొదలగువారిని స్తుతించియున్నాఁడు. వాని నీక్రింద వ్రాయుచున్నాఁడను.

చ. అనుపమితార్చ్యవైశిష్ట్య మరియాంబకు నందనుఁడై త్రిలోక పా
వనులు మహానుభావు లనవద్య చరిత్రులు సన్మనస్కులున్
దనుఁగొలువన్నిజాశ్రిత వితానముఁ బ్రోచిన యేసునాథుఁ డిం
పున నొసఁగున్నిరంతర విభూతి ధనేశుల దాసమంత్రికిన్.

తే. శశ్వదఖిల ప్రపంచ రక్షాచణుండు
తండ్రి సర్వేశ్వరుండు నందనుండు వార

లిరువురికిఁగల శెయ్యమన్ స్ఫురితుసాం క్తు
విత్తురాదాసమంత్రి కభీప్సితములు.

మ. అనఘస్వాంతములన్నదా యెలిసె బేతాంబాది సాధ్వీమణుల్
దనుఁబూజింపఁ జరాచరాన్విత జగద్రక్షాచణుం జేసునా
ఘనకుండల్లి దనూవిభావిజిత విద్యుద్వల్లినాఁ గీర్తిగాఁ
చిన మర్త్యాంబికప్రోచుఁగాత శుభదృష్టిన్దాసయామాత్యునిన్

క. వాసి వినుతింపఁదగు జ్వా
న్నేసుప్రముఖార్చ్యశిష్ట ఋషిబృంద ము
ల్లాసమతి దాసఘనునకు
శ్రీసుజ్ఞానము లొసంగి కృపఁబ్రోతురిలన్.

కవినిగూర్చి విజయనందన విలాస వేదాంత రసాయన కృతి పతులు పలికినట్లు చెప్పిన పద్యములను, వేఱువేఱుగా నీక్రింద నుదాహరించు చున్నాఁడను.

మ. ననుభక్తావన కృత్కళా నిరుపమాన శ్రీనగాధీశ శో
భన కారుణ్య కటాక్షలబ్ధ కవితాప్రావీణ్య సంశోభితా
నను నానందకవిన్ సుధీజన మహానందాను సంధాన వ
ర్తను రావించి సమంచితామృత రసప్రౌఢోక్తిఁబల్కెన్నృపన్

చ. సురుచిర నాయకోత్తమ విశుద్ధ యశోమహిమాభి వర్ణనా
స్ఫురణ జగత్ప్రసిద్ధి బొలుపుంగను సత్కవిభవ్య కావ్య మి
ద్ధర నవయౌవనాంగ బలితంపు చొకాటపుగుబ్బదోయితో
నరుదుగఁ గ్రీడసల్పు నవహార లతావిభవంబు చొప్పునన్.

మ హారసత్తేహావ సీతటాక ముఖసమ్యక్సంతతుల్ గొన్ని వా
సరముల్ నిల్పినచోటఁ బొల్పమరు విశ్వఖ్యాతి గావ్యంబుచేఁ

సరగున్నానికి విస్ఫుటప్రసవ శుంభద్వాసనా సంపదల్
మరుదంకూరముచే దిగంతరములన్ భాసిల్లుచందంబునన్.

చ. అనుపమ బుద్ధిశాలురు మహాత్ముల శేషకళావిదుల్ బురా
తన కవులగ్రసూను లజుతన్వికి నాథునికల్ కనిష్టులా
టనెవరు పెద్దవారలయెడన్ మదినాయమకట్టి వారిలో
నినుఁ గడుఁగారవించు రమణీయ కటాక్ష నిరీక్షణంబులన్.

క. కావున మృదుమధురోక్తి
శ్రీ విఖ్యాతము భవప్రచితమగు శశిరే
ఖావామాపరిణయ కథ
నీవంకితముగ నొనర్పు నేర్పునమాకున్.

విజయనందన విలాసము.

సీ. ఒకవంక నిగమాగమోజ్జ్వలాతిశయార్థ
విధివాదకౌశల ద్విజనికాయ
మొకచాయ న్యాయశాస్త్రోదాత్త వాక్య
ప్రసంగ కృద్విద్వత్ప్రజా వితాన
మొకక్రేవ సంస్కృత ప్రకటాంధ్రభాషా
కవిత్వ ప్రవీణ కవిప్రకాండ
మొకచెంత సప్తస్వరోద్గీత గీతికా
వైచిత్రి విస్ఫురద్వైణికౌఘ

తే. ముల్లసిల వజ్రకౌక్షేయకోపమాన
వైభవస్ఫూర్తి నొకశుభవాసరమున
మహితగుణపాళి దాసయామాత్యమౌళి
ప్రమదముప్పొంగఁ బేరోలగముననుండి.

మ. నను సర్వేశపదాంబుజద్వయనితాన్తధ్యానపారీణు భూ
రినయోపేత చరిత్రు మంగళగిరి శ్రీవంశవారాశి పూ
ర్ణనిశానాథు సుధీజనాభిహితు నానందాఖ్యు సద్గ్రంథక
ల్పను సాహిత్య కళావిశారదుని బిల్వంబంచి పల్కెంగృపన్.

చ. తరుముఖ సప్తసంతతు లుదారత నెచ్చటనిల్వ నచ్చటన్
బరగు సమస్త దిక్కులకుఁ బ్రాఁకవు భావరసానుకూల వా
గ్గరిమఁ దనర్చు సత్కృతి ముఖంబున వానికిఁదార కేంద్రు భా
స్కరులు గలంతకాల మనిశంబు గరంబు ప్రసిద్ధి చెల్వగున్.

తననుగూర్చి యీకవి వ్రాసికొనిన యీ రెండు గ్రంథముల లోని పద్యములనుబట్టి చూడగా, విజయనందన విలాసము రచించు నాటికితఁడు హిందువుగా నుండెననియుఁ బిమ్మట క్రైస్తవమతమును స్వీకరించి, వేదాంత రసాయనకమును రచించెననియు, నూహింపఁ దగియున్నది. ఇతఁడు క్రైస్తవమతమును స్వీకరింపనివాఁడైనచో, అద్దంకి గంగాధరాదులవలె, తన హిందూదైవతములను స్మరించియే యుండునుకాని సర్వేశ పదాంబుజద్వయ నితాన్తధ్యానపారీణు" అని వ్రాసికొని యుండడు.

సర్వేశశబ్దము భయమతములకును వర్తించునదిగా నే యున్నను, కవి యట్టి సందిగ్ధపదము నుపయోగింపక, తన మతమునుబట్టి స్పష్టీకరించునట్టి శబ్దమునే యుపయోగించి యుండును. కృతిపతులను సంతోషపరచుటకై కవి యట్టిపదము నుపయోగించి యాత్మవంచన మొనరించుకొనెనని తలంచుటకుఁ దగిన యాధారము లేదు. బ్రౌను పండితుఁ డీతనిని రోమన్ కాథలిక్కు క్రైస్తవుఁడని వ్రాసి యున్నాఁడు. కావున నీకవి క్రీస్తుమతమును గైకొని, వేదాంత రసాయనమును రచించెనని చెప్పఁదగియున్నది.

కృతిపతికూడ క్రైస్తవ మతమును స్వీకరించిన నియోగి బ్రాహ్మణుఁడని వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు. అది సత్యమనియే తోఁచుచున్నది. కృతిపతిని వర్ణించిన పద్యమిది -

సీ. శ్రీమహాసర్వేశ చింతాసదాచార
గరిమన భార్గముని సరికివచ్చుఁ
బరిపంథి హృద్భయంకర భుజాదండ వి
క్రమలీల దావీదు ఘనునిఁబోలు
భువనైకకీర్తి ప్రభుత్వ ప్రసిద్ధిచే
నలసలోమునిపాటి పలుకఁజెల్లు
సుజనానురూప భాసురధర్మకార్య సు
స్థిరబుద్ధిఁదోభ్యుతో నొరయఁజూచు

తే. నితఁడని కవీంద్రులు నుతింపనింపెసంగె
విశ్రుతవితీర్ణి శాలి సద్విభవశాలి
పాలిత బుధాళిబాంధవ పద్మహేళి
మహిత గుణపాళి దాసయామాత్యమాళి.

ఈపద్యమందలి వర్ణనమునుబట్టి కృతిపతి, క్రైస్తవుఁడని చెప్పుటకు సంశయము లేదు. కృతిపతి క్రొత్తగా క్రైస్తవమతమును స్వీకరించినవాఁడుగాక ఇతని పితృ పితామహులుకూడ క్రీస్తుమత మును స్వీకరించినవారువలె కన్పట్టుచున్నారు. గ్రంథవిస్తరభయ మున్నను, కృతిపతి మతసంబంధమైన దగుటచే నా వివరమిట వ్రాయవలసి వచ్చినది. అందుకొఱకు వారి వంశవృక్ష మిట వ్రాయుచున్నాఁడను.




క్రైస్తవమత చరిత్రమును ప్రారంభించుటకు ముందు కవి, పురాణములలో సూతుఁడు శౌనకాది మహర్షులకుఁ జెప్పినట్లు వ్రాసినరీతిగానే, క్రీస్తుకథను జెప్పువారిని వినువారినికూడ ప్రవేశ పెట్టినాఁడు. ఆకథ నీక్రింద వ్రాయుచున్నాఁడను.

చినబల్లాపురమను పేరుగల యొకానొక పట్టణమును హావతి పైచరాజను ప్రభువు పరిపాలించుచుండెను. ఒకనాఁడాతని యాస్థానమునకొక బ్రాహ్మణుఁడువచ్చి రేపు చంద్రగ్రహణమని చెప్పెను. ఆస్థాన పండితులు కొందఱు గ్రహణము లేదనిరి. ఆయాస్థానపండితులలో మల్లరసు అను గొప్పపండితుఁడైన బ్రాహ్మణుఁడు కలఁడు. అతఁడు గ్రహణము లేదని మిక్కిలి పట్టుదలతో వాదించెను.

ఆచినబల్లాపురమున నదిపఱకు చాలదినములనుండి జ్ఞానబోధ యతి యొకఁడు నివసించి యుండెను ఆతఁడీ విషయమును నిర్ధారణచేసి చెప్పఁగలడని తలంచి బైచరాజు నాస్థాన పండితులందఱు నాయన దగ్గరకుబోయి యడిగిరి. ఆయన తేపు గ్రహణము లేదని చెప్పెను. అంతట ఎవరిండ్లకు వారుపోయిరి మఱునాఁడు గ్రహణము పట్ట లేదు. మల్లరసు అను నీబ్రాహ్మణున కాయనయెడల గౌరవమధికమై యనుదిన మాయనియొద్దకుఁ బోవుచుండెను వారిరువురకును మత విషయిక చర్చలు జరుగుచు వచ్చెను. మనలోనున్న యనేక దైవతారాధన మసమంజసమనియుఁ బరమేశ్వరుఁ డొక్కఁడే యనియు, క్రీస్తు పరమేశ్వరుని యవతారమనియు, మల్లరసునకు బోధించి, యాతనిని జ్ఞానస్నానము చేయించెను. ఇది పూర్వకథ. ఈపూర్వకథను పర్వతయ్యయను నాతఁడు జ్ఞానప్పయను నతనికిఁ జెప్పెను. మిగత కథయంతయు, బైబిలు (క్రిష్టియనుల వేదము) నందుఁ జెప్పఁబడిన కథల సారాంశముగా నున్నది. కృతిపతికిఁ బ్రపితామహుఁడైన మల్లరసామాత్యుఁడే యీకథయందలి మల్లరసు అనియు, నాతని కుమారుఁడైన పర్వతమంత్రియే కథయందలి పర్వతయ్య యనియు, స్పష్టముగాఁ గన్పించుచున్నది. జ్ఞానబోధ యతి, క్రైస్తవ మతబోధకై పాశ్చాత్యదేశములనుండి యీదేశమునకు వచ్చిన మతగురువు (Bishop) అయి యుండును. మల్లరసు జ్ఞానస్నానమును బొందినట్లు గ్రంథాంతమందున్న యీక్రింది గద్యపద్యములవలనఁ దెలియుచున్నది.

"ఉ నీవురు భక్తినేసు నతినిర్మలమూర్తి మహాత్ము నీదుపా
పావళికై నిరంతరముఁ బ్రార్థనసేయుచుఁ దత్పదాంబుజా
ర్చావిధిఁగాల మున్నడిపి శాశ్వత మోక్ష సుఖంబు నొందు భూ
దేవకుమారయంచు ముదిదీవనలిచ్చె మనోహరోక్తులన్.

వ. అని యానతిచ్చిన జ్ఞానబోధ మునీంద్రునకు మల్లరసాఖ్యుండు సాష్టాంగ దండప్రణామం బాచరించి తదీయానుగ్రహంబున జ్ఞానస్నానంబుఁ బొంది సర్వేశ్వర మంత్రానుష్ఠాన తత్పరుఁడై సుఖంబుండెనని పర్వతాఖ్యుండు జ్ఞానభూసురున కెఱింగించి యతండతనివీడ్కొనిసగౌరవంబుగానిజనివాసంబునకరుగుటయు॰

దీనినిబట్టి కృతిపతి ప్రపితామహుఁడైన మల్లరసామాత్యుఁడే క్రైస్తవ మతస్వీకారమును జేసెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇఁక బైచరాజెవరో తెలిసికొనవలసి యున్నది. పంచతంత్రమును రచించిన బైచరాజు వెంకటనాథకవి వంశమునకు మూలపురుషుఁడైన బైచరాజొకఁడున్నాఁడు. ఆ బైచరాజునుబట్టి పిమ్మట వారి గృహనామము బైచరాజువారైనారు కావున బైచరాజు గృహనామము వేఱొకటియై యుండును. అతని యింటిపేరుపైన చెప్పిన 'హరివతి'యేమో! ఆబైచరాజు వేంకటనాథకవి కాలము క్రీ. శ. 1550-70 ప్రాంతమని వెంకటనాథకవి చారిత్రమున వ్రాసి యున్నాఁడను. దాసయ్యామాత్యుని కాలము క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమని యీక్రింద వ్రాయఁబోవు సంగతులనుబట్టి నిర్ధారణ మైనది. కావున ఇంచుమించుగ బైచరాజు కాలమునకు సరిపోవు చున్నది. బైచరాజుకు రాజధానియైన చినబల్లాపుర మెచ్చటిదో, అది యిప్పుడేపేరనున్నదో తెలియలేదు. ఆవివరము తెలిసిన యెడల బైచరాజెవ్వరో తెలిసికొనుట కనుకూలముగా నుండి యుండును.

కృతిపతి వంశమువారు క్రైస్తవమతమును గైకొనినను పేరులుమాత్రము హిందువుల నామములరీతిగనే యుండెనుకాని క్రైస్తవనామములుగా నుండలేదు. కృతిపతియైన దాసమంత్రి కృష్ణామండలములోని బందరు అయినట్లీక్రిందిపద్యములో నున్నది.

మ. ప్రకటారాతి చమూభయానక ఘనప్రాకార భేయంబులన్
సుకర శ్రీఁదగు బందరాఖ్య నగరిన్ సొంపొందు దీనార్థి క
ల్పకభూజంబన దాసమంత్రి రుచిరుంభద్రత్న జాంబూనదా
దికవస్తు ప్రకరాన్వితాయతనుఁడై ధీరుల్ ప్రశంసింపఁగన్.

దీనినిబట్టి కవికూడ కృష్ణామండలములోని వాఁడని యెంచఁ దగియున్నది. కృతిపతి కగ్రజుఁడైన రాజపామాత్యుఁడు కొండ వీడును పాలించినట్లును, పుల్చేరు పట్టణమందుండి మహమ్మదల్లీ ఖానుచే గౌరవమందినట్లును నీక్రింది పద్యములలో చెప్పఁబడి యున్నది.

మ. అమృతాంశు ప్రతిమానరూపనిధి రాజామాత్య శార్దూలుఁడు
త్తమ విద్వన్నిక రేప్సితార్థదుఁడు దోర్దర్పాహితోర్వీశజా
లమనస్సాధ్వస కృత్పరాక్రముఁడు శైలాలిప్రభు శ్రీకటా
క్షమునన్సుస్థిర కొండవీటి నగరీసామ్రాజ్య మేలెంగడున్.

వ. మఱియును

మ. మదిరాక్షీమదనుండు రాజపమహామంత్రీంద్రుఁ డుద్యన్మహ
మ్మదలీఖాను కృపానులబ్ధ మదవన్మాతంగ మాణిక్య హా
రదుకూలాదిక సత్కృతింద్రి దళవర్యస్ఫార సామ్రాజ్య ల
క్ష్మిఁదనర్చెన్బుధకోటి పేర్కొనఁగఁ బుల్చేర్పట్టణాధ్యాసియై.

శా. ఆయకాంచిక సంతతంబు నిజసేవాసక్తి వర్తింపఁగా
శ్రీయుక్జేణ శౌరికింబలెఁ బ్రకాశించెన్ఘనంబెన్న దీ
ర్ఘాయుర్భాగ్య సుపుత్ర పౌత్ర ధనధాన్యాందోళికేభాళిసు
శ్రీయుక్తిస్థిర రాజమంత్రిమణి పుల్చేర్నాథ సన్మానియై.

ఈపుల్చే రిప్పుడు పుదుచ్చేరియను నామమున ఫ్రెంచివారి యాధీనము నందున్నదియే.

విజయనందన విలాసము, దాట్ల వెంకట కృష్ణభూపతి కంకిత మీయఁబడినది. ఈవంశమునకు కోటకేతరాజు మూలపురుషుఁడనియు, నీతని వంశీయులు దాట్లయను గ్రామమునం దుండుటచే దాట్లవారను గృహనామ మేర్పడినదనియు, నీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

మ. సిరిచేతన్ ధరణాలకోట పురిలోఁ జెల్వొంది యాశౌర్యనా
చిరభక్తిన్ దగి ధ్యానవృత్తి గురిపించెన్ గాంచనామూల్యర
త్నరుచిస్ఫార విభూషణాధిక పదార్థశ్రేణి నుర్వీసురో
త్కరముం బెంచెను కోటకేత నధరాధ్యక్షుండసామాన్యుఁడై.

క. లోకమున దాట్లనగర
శ్రీకలితుండగుచు వినుతిఁజెందునది మొదల్
నాకపసమ విభవుఁడు లల
నాకంతుఁడు దాట్ల కసవనప్రభుఁడయ్యెన్.

కృతిపతి నివాసము ధర్మవర మయినట్లీక్రింద పద్యములో నున్నది.

మ. తనకాధర్మవరాఖ్య పట్టణ రమాతన్వంగి సాక్షాత్కరిం
చి నిజార్చాపరతంత్రయై మెలఁగ నాఁజెన్నొంది శ్రీసుందరాం
బనవీనానుపమాన భోగముల దేర్పందానజస్రంబు నిం
పెనయన్ శాశ్వతభూతి వేంకటమహాకృష్ణప్రభుం డచ్చటన్.

ఈ ధర్మవరము గోదావరిమండలములోని దనియు నచ్చట వారివంశీయు లున్నారనియుఁ దెల్పుచు విజయనందనవిలాస ముద్రిత ప్రతి పీఠికాకారులు "ప్రస్తుత గ్రంథమగు నీ విజయనందన విలాస కృతిపతియగు శ్రీ దాట్ల వేంకటకృష్ణ నృపాలుఁడు గోదావరిమండలమునందలి ధర్మవరమునందు రమారమి 80 సం॥రములక్రిందట

జీవించి యున్నట్లుఁ దద్వంశీయులవలనఁ దెలియుచున్నందువలనను, మాకుఁ దొరకిన తాళపత్రగ్రంథము వ్రాసిన గుంటముక్కల జగ్గన్న గారు పై కృతిపతిపేరుగల వారికొఱకు వ్రాసియిచ్చినట్లుంటుటచేతను, ఈ లేఖకుని కాలముకూడ 80 సంవత్సరములకు సరిపోవుటచేతను నీకవి ౧౬౯ వ శతాబ్దము నందున్నవాఁడని తోఁచుచున్నది. కృతిభర్త యీ పైదాట్ల వేంకటకృష్ణ నృపాలుని ముత్తాతయయినచో 17 వ శతాబ్దమునకు సరిపోవుచున్నది.'' అని వ్రాసియున్నారు. తాళపత్రప్రతి వ్రాయించుకొనిన వెంకట కృష్ణనృపాలుఁడు కృతిపతి కాఁడు. ఆతని ముత్తాతయే కృతిపతియై యుండును. పైన వ్రాసిన పీఠిక క్రీ. శ. ౧౯౧౯ సంవత్సరములో వ్రాయఁబడినది. అప్పటి కెనుబదియేండ్లు క్రిందట ననగా ౧౮౪౦ ప్రాంతమయి యుండును. ౧౮౩౦ సంవత్సర ప్రాంతమునఁ గృష్ణామండలమున న్యాయాధికారిగానుండి యాంధ్రభాషాభివృద్ధికై పాటుపడిన బ్రౌను పండితుఁ డీకవిరచించిన వేదాంత రసాయనమునుగూర్చి వ్రాయుచు, నీతఁడు నూఱేండ్లక్రిందట నున్నవాఁడని వ్రాసియున్నందున పీఠికా కారులనుకొనినట్లీ వెంకటకృష్ణ భూపతిగారి యాతని ముత్తాతయైన వేంకటకృష్ణ నృపాలుఁడే కృతిపతియనుట నిశ్చయము. కర్ణాట రాజ్యమునకుఁ బ్రభువుగా మహామ్మదల్లీఖాను ౧౭౪౯ వ సంవత్సరమున వచ్చియుండుటచేతను, ఆతనికడ కృతిపతి నగ్రజుఁడైన రాజ పామాత్యుఁ డుద్యోగిగా నున్నట్లు వ్రాయఁబడి యుండుటవలనను నీకావ్యము ౧౭౫౦ వ సంవత్సరమునకుఁ బిమ్మట రచింపఁబడి యుండవచ్చునని వీరేశలింగము పంతులుగారు వ్రాసినమాటయే సత్యమునకు సమీపముగా నుండెననుట నిశ్చయము. విజయ నందన విలాసము ౧౭౫౦ సంవత్సర ప్రాంతముసను, వేదాంత రసాయనము ౧౭౬౦ సంవత్సర ప్రాంతమునను రచింపబడియుండును.

విజయనందన విలాస పీఠికాకారులు కవి కృష్ణామండలము లోనివాఁడని యంగీకరించుచు, గోదావరిమండల నివాసునకెట్లు కృతి యొసంగెనో తెలిసికొనవలసి యున్నదని పీఠికలో వ్రాసి యున్నారు. ఆకారణమును స్పష్టముగాఁ జెప్పుటకుఁదగిన యాధారములు దొరకలేదు. భంభర సదృశులగు కవులు, మకరందాస్వాదమునకై పుష్పోద్యానములుండు తావులను వెదకుకొనుచుఁ బోవుటలో దూరమును లెక్కింపరనుటయే యీప్రశ్న కుత్తరము.

ఈతనికవిత్వము నిర్దుష్టమై, మధురమైయనర్గళధారగలిగి మనోజ్ఞముగా నున్నది. ఇతని వర్ణనలు చాల రమణీయముగా నుండును. శైలి తెలియుటకై యితని గ్రంథములనుండి కొన్నిపద్యములను వ్రాయుచున్నాఁడను,

విజయనందన విలాసము:—

మ. బలభిత్సూనుని సవ్యసాచిని నిజప్రాణేశుఁగాఁగొన్న గా
దిలితోఁబుట్టువ వీవుమూకగుటఁ బ్రీతిన్ మత్కుమారిన్ భవ
త్కుల చూడామణి నీతనూభవునకిత్తుం దేవతల్ మెచ్చ రం
జిలు ముక్తామయహారవల్లిఁ దరళశ్రీఁగూర్చు చందంబునన్.

ఉ. ఆయమృతాంశుబింబ ముఖులందఱు నీరముజల్లులాడినన్
చాయలఁ దత్కచాగ్ర ఘనసార మృగీమద కుంకుమద్రవ
శ్రీయుతమై సరంబు విలసిల్లెఁ బరస్పరమైత్రిగూడ గం
గాయమునా సరస్వతులకై వడి లోచన కౌతుకంబుగన్. ౨ఆ

ఉ. నృపసుతుఁడిట్లుపల్కఁ దెరయెత్తినమాత్రన మున్నుపిల్లిరూ
పపుడు గనంగనయ్యె నిపుడారయ వ్యాఘ్రమృగేంద్రభల్లుకా
ద్యపరిమతోగ్రజంతువికృతాకృతులొక్కటదోఁచుచుంటలో
జపలతఁ జెందినాఁడ నిదిచానయె భూతమునాకనాపుడున్ ౩ఆ

శా. కేళీమందిరభిత్తికా విరచితాక్షీణాబ్జ రాగస్వర లీ
లాలావణ్య విభూతిగాంచి యలబాలారత్న మాత్మాళికా
పాళీశంకఁ బ్రపానతాస్య యయికస్పృష్టిస్మనః పంకజా
తాళీధాం గజశాతసాయక నికాయ ప్రేరణన్ సైపుచున్.

వేదాంత రసాయనము:—

చ. అతిశయచౌర్య మోహదురితాన్వితులై కనుపట్టు నిట్టిదే
వతల సమర్చనల్గలుమ వర్తనలందగు వారికట్టి దు
ర్గతుల నెచూపుఁగా కెపుడఘుంబొనరింపఁగ నీకసత్క్రియా
రతులుగఁ జేయఁజాలవు పరాత్పరు నాలయమట్టులన్గడున్. ౧౮

మ. ప్రకటజ్ఞాన దయాక్షమం వినయసంపత్తిం బ్రకాశించు వా
నికిజ్వాన్నైసను పేరువెట్టుమన నెంతే సంతసంబొంది యా
త్మికులస్త్రీ నరయంగ యౌవనపటుత్వం బింతయున్లేదు మే
నికిగొ్రాలదిగాక నే ముదుకఁడన్నీ వాడి తీకై వడిన్. ౨౮

ఉ. కొంచక కీడుచేయ మదిఁగోరు దురాత్ముని యేసు శిక్షగా
వించక మిన్నకుండుటిది వింతగదయ్య తదీయశాంత మే
మంచునుతింతు నేవతిశయంబుగ నవ్విదమిావు నాకెఱిం
గించు వినంగ వేడ్కమదికిం బొడమెంగరుణాపయోనిధీ!

ఉ. అంత దురంతశోక తిమిరార్తికృశీకృత హృత్సరోరుహా
భ్యంతరమైన తల్లిదరియంజన నాయమచూడ్కికిన్ ప్రియా
మాంతదినేంద్రమండల మహోద్యుతి మచ్ఛభలక్షణాంగుఁడై
యెంతయుఁ గానుపించె జగదేకచరిత్రుఁ డతండు భూసురా!



## 339. సముఖ వెంకట కృష్ణప్ప నాయకుఁడు

ఇతఁడు, అహల్యాసంక్రందనమను మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమును, రాధికాసాంత్వనమను నేకాశ్వాస ప్రబంధమును జైమినిభారతము, సారంగధర చరిత్రము నను రెండువచన కావ్యములను రచియించెను. ఇతఁడు మీనాక్షీనాయఁడు అలమేలమ్మలకుఁబుత్రుఁడు; వెంకటనాయఁడు వెంకటాంబలకుఁ బౌత్రుఁడు; ఎల్లి శెట్టి నాయనికిఁ బ్రపౌత్త్రుఁడు; ఈ యెల్లి శెట్టి నాయనితండ్రి పెదగురవప్పనాయఁడు. అతనితండ్రి వేంకటనాయఁడు; అతనితండ్రి కేశవప్పనాయఁడు.

ఈతఁడు రచించిన యైదాశ్వాసములుగల జైమినీ భారత వచనకావ్యమును పాండ్యదేశమని పిలువఁబడు మధురాపుర రాజ్యమును బరిపాలించిన విజయరంగ చొక్కనాథున కంకితముచేసి నట్లాశ్వాసాంత పద్యముల వలనఁ దెలియుచున్నది ఇది వచన కావ్యమైనను ఆశ్వాసాద్యంతములయందు పద్యములను వ్రాసి యున్నాఁడు. కృత్యాదియు పద్యములలోనేయుండునని యూహింపఁదగియున్నది. కృత్యాది లభించలేదు. ఈతని గ్రంథములన్నిఁటియందును గద్య యీక్రింది విధమున నున్నది. "ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథమహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికాప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధమాన సముఖమీనాక్షీనాయక తనూభవ మీనాక్షీదేవీ కటాక్షలబ్ధ కవితాసాంప్రదాయక వేంకటకృష్ణప్పనాయక ప్రణీతంబైన"

దీనినిబట్టి కవి, విజయరంగ చొక్కనాథభూపాలునిచేత గొప్ప బహుమానము లందినవాఁడనియు, మధురమీనాక్షీదేవీభక్తుడనియు దెలియుచున్నది. ఈవెంకటకృష్ణప్పనాయకుఁడు కేవలకవిమాత్రమే కాఁడు. వీరాగ్రేసరుఁడనియు, విజయరంగచొక్కనాథుని యాంతరంగికసామాజకులలో నొకఁడనియు, నీతఁడు రచించిన యహల్యాసంక్రందనములోని యీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది. ఉభయభాషాకవితా విశేషులయిన శేషము వెంకటపతియును, జుణిగె కృష్ణకవీంద్రుఁడు నీతనికి మిత్రులు. అహల్యా సంక్రందనమును దనకంకితము సేయుమని శ్రీరంగనాథుఁడు కలలోవచ్చి

తే గీ సముఖ మీనాక్షీనృపగర్భ విమలజలధి
చంద్ర వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర
మునుపు జైమిని భారతమనఁగ వచన
కావ్యమొనరించినట్టి సత్కవివిగావె!

శా. వాసిన్ రంగవిభుండనేను ధరణిన్ వాక్ప్రౌఢిమన్ నీవహ
ల్యాసంక్రందనమన్ ప్రబంధము రసోల్లాసంబుగాఁ జేయఁబే
రాసంగోరి వినంగవచ్చితిఁ బ్రియంబౌనట్లు నాపేరిటన్
భాసిల్లం దగ నంకితంబునొనఁగూర్పన్ నీకు మేతానికన్.

అని యానతిచ్చుటయు, నావృత్తాంతమును గవితనమిత్రులకుఁ దెల్పఁగా వారు సంతసించి, గవివంశమును వారువర్ణించి గ్రంథరచనకుఁ బ్రోత్సహించినట్లును జెప్పుకొని యున్నాఁడు. కవి తనవంశమును దానువర్ణించుకొనుట యాత్మస్తోత్రమగునని భావించి యావర్ణనమును దనమిత్రులు గావించినట్లును నందుదాహరించి యుండెను.

సీ. వింటివా నీవంటివింటివాని ధరిత్రిఁ
గంటి నేనల్ల ముక్కంటినొకని
సారిగా నీవొక్కసారిగా గాటపువీధి
దూరుచోఁ బొదలలో దూరురిపుఁడు
వింతమీఱంగ నీవింతమీఱినఁ దేజి
మంతు కృద్వైరిసామంతు నణఁచు
వేదండమెక్కి నీవేదండ వచ్చినా
వే దిక్కుసొచ్చు దా వేదిపరుఁడు

తే.గీ. ఉన్నతోన్నతి నెన్నుచో మిన్నవీవె
నిన్ను సన్నుతిసేయును బన్నగపతి
విమలచారిత్ర! మీనభూవిభునిపుత్ర!
సముఖ వేంకటకృష్ణేంద్రఁ శౌర్యసాంద్ర!

సీ. ధైర్యమా శౌర్యమా దాక్షిణ్యమా పుణ్య
మా నయమా జయమా ప్రతాప
మా శుభరూపమా మహితవిజ్ఞానమా
దానమా భోగమా శ్రీనిరూఢ
యోగమా యాశ్రితవ్యూహసంరక్షణ
రాజద్విలాసమా రమ్యమంద
హాసమా మహితసౌహార్దస్వభావమా
భావమా భూరిప్రభావమాన్య

తే. నీకె తగునంచుఁ బాండ్యభూనేత విజయ
రంగచొక్కేంద్రుఁ డత్యంత రంగసబహు
మానసామాజికత్వమిఁపూన నొసఁగె
సముఖ వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర!

సీ. చదువఁగానేర్తువు శారదాశారదా
జ్ఞానతా నూపురార్భటులధాటిఁ
బాడఁగానేర్తువు పండితాపండితా
కర్ణానానంద సంఘటనపటిమఁ
బలుకఁగానేర్తువు భావజాభావజా
టాపగాటోప నిరర్గళోక్తిఁ
దగవ్రాయనేర్తువు తాంకాతారకా
నీకరేఖాసమానేకవిపుల

తే. మెచ్చనేర్తువు కవితల మేల్మిఁదెలిసి
యిత్తువేనుఁగుపాడిఁగా నెలమిఁ గవుల
కన్నిగుణములు నీయందె నమరె నౌర
రిపుజయాధార వేంకటకృష్ణధీర !

ఈకవినివర్ణించు పద్యములింకను గలవు. కాని గ్రంథవిస్తరభీతిచే విరమించితిని. పైపద్యములనుబట్టి యీవెంకటకృష్ణప్పనాయకుఁడు కవియుఁబండితుఁడునై కాకుండ కవిపండితులను బోషించు శక్తికలవాఁడనియు, విజయరంగ చొక్కనాథుని యాంతరంగిక భృత్యుఁడనియు, నాతనిచే ననేకవిధముల మన్ననలందినవాఁడనియు స్పష్టమగుచున్నది. విజయరంగ చొక్కభూపాలుఁడు క్రీ శ ౧౭౦౬ మొదలు ౧౭౩౨ వరకు మధురరాజ్యమును బరిపాలించిన వాఁడగుటచేఁ గవియీ కాలమువాఁటనుట నిశ్చయము.

ఈతని తండ్రియైన మీనాక్షినాయఁడు, విజయరంగచొక్కనాథుని ముత్తాతయగు తిరుమలనాయకునియొద్ద మంత్రిగనో దండనాయకుఁడుగనో, ఉండెనని కొందఱందురు. కాని యది సత్యమయినట్లు కాన్పింపదు. ఆ తిరుమలభూపతి క్రీ. శ. ౧౬౨౩ మొదలు

౧౬౫౯ వఱకును మధురరాజ్యమును పాలించినవాఁడు. ఆతని యొద్ద కవితండ్రియైన మీనాక్షీనాయకుఁ డుండుట, అసంభవము మీనాక్షీనాయకుఁడు తిరుమలనాయకుని మంత్రియనుట సత్యమయ్యె నేని యాతఁడు మఱొక మీనాక్షీనాయకుఁడై యుండును. వెంకట కృష్ణప్పనాయకుఁడు తనతండ్రియైన మీనాక్షీనాయకుని వర్ణించిన యీక్రింది మూఁడుపద్యములలోను నాతని యీశ్వరసాన్నిధ్యమును దాతృత్వమును వర్ణించెనేకాని పైనచెప్పిన మంత్రిత్వము మాటతల పెట్టలేదు. గ్రంథవిస్తరభీతియున్నను సంశయనివారణముకొఱకా మూఁడుపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

సీ. మక్కువమీఱంగఁ జొక్కనాథస్వామి
తనమహాలింగ మధ్యంబు వెడలి
చంద్రరేఖాజటాశార్దూల చర్మాహి
డమరుత్రిశూలముల్ కొమరుమిగులఁ
గలలోనఁ గనుపట్టి కరుణాకటాక్షముల్
చెలఁగఁ గటాక్షించి చేరఁబిల్చి
కేలిశూలమ్ముదా కేలఁ గైకొని హస్త
మస్తకసంయోగ మాచరించి

తే.గీ. ఆయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి
ధనకనక వస్తువాహనతతుల విమల
తత్త్వవిజ్ఞాన మొసఁగె నేధార్మికునకు
నతఁడు కేవలనృపుఁడె మీనాక్షివిభుఁడు

సీ. కప్పమీఱిన కందిపప్పులకుప్పలు
రాజ్యంబు వెలసేయు నాజ్యములును
బహుపుణ్యఫల పరిపాకముల్ శాకముల్
నిచ్చ మెచ్చులనిచ్చు పచ్చడులును

విప్పడంబులనొప్పు నప్పడంబుల రాసు
　　　　లతిరసంబులు వడలతిరసములు
చంద్రమండల సుప్రసన్నములన్నముల్
　　　　ప్రతిసుధారసములు పాయసములు
తే గీ　వెలయ మృష్టాన్నసత్రముల్ వెట్టిసేతు
బాట నల్లూరులోపలఁ దేటతీయ
నీటి మేటి తటాకంబు నిధియొనర్చె
మేదినీశ్వరమాత్రుఁడే మీానవిభుఁడు.

సీ　ఈలంపుసీలంపు చే లికంబంబులు
　　　　కులశైలజాలంబు కొమరుఁదాల్ప
రంగారు బంగారు ప్రాఁతచిత్రంబులు
　　　　కిన్నరనరసురాకృతులు గాఁగ
సేతులజోతుల నెఱదీపమాలికల్
　　　　తారకాగ్రహముల దారిమీఱ
నెఱమట్టు కటిపట్టు నిగ్గుచందువపొందు
　　　　ఘనఘనాఘనముల గరిమఁబూన
తే.గీ.　నిండుమెండున బ్రహ్మాండమండలంబు
రహిమహామంటపంబు సద్భక్తియుక్తి
సుందరేశ్వరుసన్నిధిఁ జందమొంద
నమరఁగట్టించె సముఖమీానాక్షివిభుఁడు.

పై పద్యములనుబట్టియు, నీతని పూర్వులనుగూడఁ మేదినీశ్వరులనియు భూపతులనియు వర్ణించుటమూలముననను, యీకుటుంబము వారు మధురనాయక ప్రభువులకు సామంతులై యేచిన్నసంస్థానము నకో పాళ్యగాణ్రై ధనాధికులై యుందురని చూపట్టుచున్నది.

ఈకవి రచించిన యహల్యాసంక్రిందనమున గౌతమమహర్షి భార్యయగు నహల్యకును, దేవేంద్రునకును జరిగిన ప్రణయగాథ వర్ణింపఁ బడినది. దశావతారచరిత్రను రచించిన ధరణీదేవుల రామమంత్రిని యనుకరించుచు యీ వెంకటకృష్ణప్ప నాయకుడు యహల్యా సంక్రందనము నందలి గొన్ని పద్యములను రచించి యున్నాఁడు. ములుఁగుపాపయారాధ్యుఁ డొక యహల్యాసంక్రందనవిలాసమును వ్రాసియున్నాఁడు. వెంకట కృష్ణప్పనాయకుఁడు రచించిన యహల్యా సంక్రందనములో, తారాశశాంక విజయము వలెనే నీతికిదూరమయినట్టి

ఉ. పారక యత్రగారికనుబ్రాామి, నిజేశ్వరు మోసపుచ్చి, యాఁ
యారునుదూరునై నఁబడి యందజికన్నుఘటించి యాత్మఁ దా
గోరిననాథునింగలసి కొల్లలుగా సుఖమందకున్న నా
సారసపత్రనేత్రి యెలజవ్వనమేటికిన్ జన్మమేటికిన్.

యిట్టిపద్యములును పచ్చి శృంగారరసమును గ్రుమ్మరించు పద్యములును గలవు. ఇందులకాకాలమును ఆకాలమునాటి ప్రభువుల నడవలయునుగాని కవులననఁబనిలేదు. ఈ కవి కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

ఉ. శ్రీలుదయింప దిక్పతులు చేతులుమోడ్చి భజింపఁ దమ్ముఁడై
శ్రీలలనామనోహరుఁ డశేషభరంబును నిర్వహింపఁ బా
తాళమువట్టి శాత్రవులు తద్దఁగృశింప నిలింపపట్టణం
బేలునుభోగసాంద్రుఁడుసు శేంద్రుడుభూరిమహోదినేంద్రుఁడై

సీ. తనుసృజించిన బ్రహ్మతనయందమీాక్షించి
తన్మయత్వము నొందిత త్తరింప

నైష్ఠికులైన సనత్సుజాతాదులు
మదిజల్లుమన హరిస్మరణ సేయ
నధ్యాత్మవిజ్ఞానులైన సన్యాసులు
పరవశులై గగుర్పాటుఁ జెంద
వాణియు నప్సరోవనితాజనంబులు
మగవారు కామైతిమనితలంప

తే.గీ. ముద్దుముంగుర్లు కొనగోట దిద్దుకొనుచుఁ
దెలివిచూపుల కాలచంద్రికలనీన
నడలుగని ధాత తేజీలు జడనుపడఁగ
బాల్య యౌవనకల్య యహల్యయొప్పె. ౨౩

మ. మృదువై మెల్లన కొంతసేపటికి సద్వృత్తంబుగా నొచుఁ జెం
పొదవఁగొంతకరంగిపోఁగయగుచుఁబొల్పొందియారాయిచ
క్కదనంబేర్పడి మోహనాకృతిచెలంగన్ యౌవనశ్రీ తగన్
సుదతీరత్నముగాఁ గనిల్చెను మదిన్ జోద్యంబు వాటిల్లగన్.

ఈకవి రాధికాసాంత్వనమను నేకాశ్వాసప్రబంధమును రచి యించెనని యొకప్రతీతికలదు. జైమినిభారతపీఠికలో బ్ర. శ్రీ. జయంతిరామయ్యపంతులు గారట్లేవ్రాసియున్నారు. కాని విమ ర్శించిచూడఁగా నీకవి యీగ్రంథమును రచించియుండనట్లు తోఁచు చున్నది. ఈ రాధికాసాంత్వనము ముద్రితమైనది. మదరాసు నందలి ప్రాచ్యలిఖితపుస్తక భాండారము నందొకప్రతియున్నది. ఇది ౧౧౫ పద్యములుగల యొకచిన్నపుస్తకము. ఇందు కడపటి మూఁడు పద్యములును, ఒకపెద్దవచనమును, ఈకవిరచించిన యహ ల్యాసంక్రందనములోనివే. తక్కిన పద్యములలో చాలభాగము, ఇంచించుకమార్పులతో, ముద్దుపళనిరచించిన రాధికాసాంత్వనము

లోనివి. ఇందు కృత్యాదిలేదు. ఈక్రిందిపద్యము మాత్రమిది యీకవి రచనమనుటకు సాక్ష్యముగా నున్నది.

ఉ. వెలయ నభీష్టమిమ్మనుచు వేంకటకృష్ణ నృపాలశేఖరుం
డిల రసికావతంసులకు హృద్యముగా మృదుమాధురీ రసా
కవితచమత్కృతియాకలనఁ గల్పనగా రచియింపనొప్పు ని
శ్చలమగు రాధికారమణిసాంత్వనముం గృతిసల్పుమంచ నన్

వెంకట కృష్ణప్పనాయకునికంటె ముద్దుపళని యర్వాచీనురాలు. కావున నాతని పద్యములను దనవిగా రాధికాసాంత్వనమునఁ జేర్చుకొనియెనని ముద్దుపళనిపై గ్రంథచౌర్యమారోపింపవలసి వచ్చుచున్నది ఆమెరచించిన రాధికాసాంత్వన మించు మించుగ నాలువందల పద్యములుకలది. ఆమెపై గ్రంథచౌర్యమారోపించుటకంటె, నామెకపకీర్తి కల్గించుటకై యెవ్వరో, యసూయాగ్రస్తుడు కొంచెము కొంచెము మార్పులనుచేసి వెంకటకృష్ణప్ప నాయకుని పేరుపెట్టి యాపద్యముల నొక్కచోఁగూర్చి, యది యాతనిదేయని నమ్మించుటకై యహల్యా సంక్రందనమునందలి పద్యగద్యములను దుదినిజేర్చి గ్రంథాంతపద్యములను గద్యను రచియించి యాపేరుపెట్టి యుందురనియూహించుటయే యుక్తమనితోఁచుచున్నది. నిజముగా ముద్దుపళని గ్రంథచౌర్యమే చేసియుండినయెడల తనగ్రంథమున కానామమేయుంచక మరియొకపేరుపెట్టి యుండును. అయినను నందుండి మచ్చునకై మూఁడు పద్యముల నిట వ్రాసియున్నాఁడను.

ఉ. శౌరినిబిల్వఁగా జనిన చక్కని కేలరాదు యే
దారినిజన్నదో నడుమఁదారెనొ చేరెనొ లేదొ గోపికా
జారునిఁ గానదో కనెనొ చక్కఁగ నావెత విన్నవించెనో
సారెకు; లేక శౌరినుడిచక్కెర యుక్కెర మెక్కి సొక్కెనో!

ఉ　పాలతిఁరో! యేమి? త్రోవవిడుపోవలె! నెచ్చటికి? కింతిచెంతకే
తొలిరుచివీడవో? విడను, తోతుము! ద్రొబ్బుదుపొమ్ముపోనుమా
టలకెడవాను కానివికటాసికిఁ జొచ్చితివౌను యెవ్వరో
బలిమి మిటారి రమ్మిదిగోవచ్చితి రాకలమానవోహరీ!

ఉ.　ఎవ్వరు పిల్చిరిచ్చటకు నెందుకు వచ్చితివేమికార్య మే
నెవ్వతె నీవుదానెవడ వెవ్వరికెవ్వరుకంటి కంటిమీ
జవ్వని విన్నరవ్వవిడుజాల్ తడవాయెను వచ్చివేచిపో
నవ్వెదరెల్లవారు గనినన్నును నిన్నునుగోపశేఖరా!

జైమినీభారతము:—

పిల్లలమఱ్ఱి పినవీరన రచియించిన జైమినీభారతమునుసరించి యీకవి యీవచనకావ్యమును రచియించెను. ఇతఁడు కొన్ని తావులఁ గొంతకొంత పెంచి వ్రాసినను మొత్తముమీఁద పినవీరన కావ్యమునకు వచనమే యని చెప్పనొప్పును. ఈతఁడు సంస్కృత జైమినిభారతమును గూడఁ జూచియుండును. ఈ గ్రంథమందలి వచనశైలినిగూర్చి జైమినీభారత పీఠికాకారులు వ్రాసిన వాక్యముల క్రింద నుదాహరించుచున్నాఁడను.

"వీరభద్రకవి 19 పద్యములలో వర్ణించిన స్త్రీమండల వృత్తాంత మిందు ౧౮ పుటలకు సరిపడునంతగా వివరింపఁబడినది. ఇందుఁ బ్రమీల యర్జునుని రాకవిని యాతని మదిలోఁగామించుటయు యుద్ధముఁ జేసి యతనిని వశపఱచుకొని యింటికిఁ దీసికొనివచ్చి యాతనితోఁ గ్రీడించుటయు మిక్కిలి పెంచి వ్రాయఁబడినది. దాదాపు రెండువందల సంవత్సరములక్రిందట మనభాషలో వచన కావ్యములు మిక్కిలి యరుదుగా నున్నట్లు కనఁబడుచున్నది. అక్కాలమునందుఁ బండితులను గవులను బోషించి యాంధ్రగ్రంథ

ములు వ్రాయించుటయేకాక తానుగూడ శ్రీరంగమాహాత్మ్య మాఘమాహాత్మ్యములనెడి పెద్ద వచనగ్రంథములను రచియించిన కవిరాజై భాషకుఁ జేయూతయొసంగిన మహాత్ముఁడు విజయరంగ చొక్కనాథుఁడు. ఈతఁడు వచనకావ్యములను రచియించుటఁ గనియే "యథారాజా తథాప్రజా" యనినట్లాతని యాశ్రితులును వచనరచనకుఁ గడంగి యుందురని తోఁచుచున్నది. అట్టివారిలో నక్కాలమున విజయరంగ చొక్కనాథునివలె నీవచనరచనఁ గావించినవారి గ్రంథములలో నీకవి వచనకావ్యములే ప్రధానములై కనఁబడుచున్నవి. కొంచెమెచ్చుతక్కువగా వచనకవిత్వ మంకురించిన యక్కాలమునకు నిక్కాలమునకు వచన రచనయందును దాని శైలియందును నేదోకొంచెము భేదముగన్పట్టుట యాశ్చర్యకరము గాదు. చక్కఁగ బరిశీలించినచోఁ జిన్నయసూరి నీతిచంద్రిక శైలి వంటి ప్రౌఢశైలి యప్పుడు నిప్పుడు గూడ నెందును గానరాదు. గాని సామాన్యదృష్టితోఁ బరికించినచో నిప్పటి వచన శైలి కీగ్రంథ శైలి తీసిపోదని నాయభిప్రాయము. కాని కథాసందర్భమునుబట్టి కథాపాత్రముల నామములకు సర్వనామవాచకపదము లుపయోగించుటచే సరిపోవుచుండగా మరల మరల నాయాపాత్రముల నామములనే తఱుచుగా నుపయోగించుటయు, యమకవృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములకై కథాప్రశక్తి కభ్యంతరముగా విశేషణబాహుళ్యమును గల్పించుటయు, గ్రంథమామూలాగ్రముగా నెఱసున్నలే కాని యరసున్న లుపయోగింపకుండుటయు మొదలుగా నీతని వచన రచన శైలియందుఁ గొన్నివిశేషాంశములు గన్పట్టును".

ఈకవి వచనశైలి తెలియుటకై కొన్నిపంక్తులనిట నుదాహరించెదను.

"రాజేంద్రా! నీలధ్వజుని పట్టంపురాణి జ్వాలయనువధూటి గలదు. అప్పురంధ్రీమణికి నీరేడులోకంబుల నీడుజోడులేని చక్కఁదనంబున నుతికెక్కిన స్వాహానామధేయయగు కన్యకారత్నంబు గలిగిన నాతరుణి జవ్వనంబును సౌందర్యంబు గుణంబులు లీలావిలాసంబులును త్రిభువనమోహనంబులుగావున దానికిం బెండ్లిసేయం దలంచి నీలధ్వజుండు రూపలావణ్యవంతులు కీర్తిమంతులు నైనరాజకుమారులంబెక్కండ్ర వ్రాసితెచ్చిన చిత్రపటంబులు సూపి యందొక్కని వరియింపుమనిన నగ్గజగమన సిగ్గునంతలవాంచి మదాంధులు గర్వగ్రంథులు వసుంధరాధిపతులు. తక్కినమానవులెల్లదీనులు వారల శరీరంబులు నిత్యంబులుగావు గావున మర్త్యుల వరియించుట నాకు సమ్మతంబుగాదు. అమర్త్యులందు నొక్కరుని వెదకుమనిన నీలకేతుండు కూఁతుఁజూచి మంచిది వాసవునిరప్పించెద వరియింపుమనిన నమ్మదిరాక్షి మదిలోన విచారించి "సురపతినాకుం దగినపతి యగుంగాని యతండు జారుండు తపోవిఘ్నకరుండు కులగోత్రవిదారుండు నవికారుం డటియుంగాక దేవాదిదేవుండైన శ్రీవిష్ణుదేవునిం దనకుఁ దమ్మునిగానెంచి భక్తిగావింపఁడు గావున దేవేంద్రుండు సమ్మతుండుగాఁ"డన నతండు మఱి యెవ్వరింగోరుదువనిన "యగ్నిదేవుండు జగత్పూజ్యుండు దేవతలకెల్ల నగ్నిముఖంబని వేదవచనము కలదు. వైశ్వానరునియందు నాడెందంబు లగ్నంబయ్యె ననినఁ జెలులు నవ్వుచు నప్పువ్వుఁబోడింజూచి యేమనికోరితి వమ్మా! రాజుచుండెడి మొగంబేమి! నిప్పులు కుప్పళించు నడకలేమి? సర్వభక్షకత్వంబేమి! యెచ్చటకు వచ్చినంగాల్చుట యేమి! పోయిన మార్గంబెల్ల మలినంబగుట యేమి? యిట్టివానిం బెండ్లియాడు నాడువారుంగలరె? అదియునుంగాక రెండు తలలతోడి మూఁడుకాళ్ల ముసలిని వరియింపఁ దగవగునే!"

సారంగధర చరిత్రము :—

"యమ్మాత్రినందను వాక్యంబులు నిశ్చంబులయ్యెనని విన్నం బోయి కన్నీరుగారఁ బెదవులు దడుపుచు పులుకు పులుకునంజూచి పలుకపలుకునకుం దైన్యంబుదోలుక నేఁడెల్ల ! సతీమతల్లీ! నీవు పిన తల్లివని వచ్చినందుల కెట్టిఫలంబుగలిగె నెదుటివారియుల్లంబెఱుంగక నీమాటలాడ నెట్టునోరాడె? యేలతల్లడిల్లెదవు నీవుతల్లివి నేను తనూజుండ తల్లియుం దైవసమానంబు. అదియునుంగాక యొరుల చేడియలు నాకుందోబుట్టువులు ఈ వెఱ్ఱిబుద్ధులు నీకేలవచ్చె" యిట్టిపాపంబు నాకేల గట్టెదవు? యిందున శాశ్వతంబైన యపకీర్తి వచ్చుఁ బరలోకంబున దండధరుని దండనలోర్వం దరంబుగాదు "నేను భోగస్త్రీని; వావులునాకుఁ బనిలేదంటివి." వంశంబునకెల్ల యొక్కఁడేయని యొట్టిడిన చిన్నవాఁడే వేఱుపోయితి నన్నందిరునే యీ యవివేకంబున కేమందు? ఎందేని యీవావి జగమందుఁగలదె? రత్నాంగి యొకటియు, నీవొకటియుఁ గాదు. తలంచి చూడుము. పదరకుము. కాయంబు బుద్బుదప్రాయంబు యకృత్యంబులు సేయం బూనకుము. నిన్ను విభుండఱచేతి నిమ్మపండుగతి నత్యాసక్తితో లాలింప నిలింపసంపద లనుభవింపుచు సొంపుననుండునట్టి నీవు కావరంబునంగానక నేలత్రుళ్ళెదవు. ఇందున నాపత్పరంపరలు సిద్ధంబు.



## 340. తుపాకుల అనంతభూపాలుఁడు

ఈతఁడు క్షత్రియుఁడు; చంద్రగిరి కృష్ణభూపాలక భాగమాంబలకుఁ బుత్త్రుఁడు. ఈకవి మనోహరమయినభాషలో వచన కావ్యములను రచియించినవాఁడు. భగవద్గీతను విష్ణుపురాణమును వచనమునఁజేసి శ్రీకృష్ణున కంకితము చేసెను. భారతమునుగూడ నీతఁడు వచనమున రచియించినట్లు కాన్పించుచున్నది. కళువె వీరరాజు రచియించెనని కొన్నిప్రతులలోఁ గలదు. కళువె వీర రాజును, ఇతఁడును, నారాయణయ్య యను మరియొకరును గలిసి భారతమును వచనమున వ్రాసియున్నారని యూహింపఁదగియున్నది. ఇతఁడు తనవచనకావ్యములయం దీవిధముగా గద్యలను వ్రాసికొని యున్నాఁడు,

"ఇది శ్రీమదుభయభాషాకవిత్వఫణీంద్ర చంద్రగిరి కృష్ణ నరేంద్ర తపఃఫలసంజాత కుమారచంద్ర విమలయశోవిశాల తుపా కుల యనంతభూపాల ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతావచనంబు నందు సర్వంబు నేకాశ్వాసము."

"ఇది శ్రీనందనందన చరణారవిందసేవానుభావ భావితసార సారస్వతైశ్వర్యధుర్య చతుర్విధ కవితాసామ్రాజ్యభోజ చంద్రగిరి కృష్ణభూపాలకతనూజ సాంద్రతేజోవిశాల తుపాకుల యనంతభూపా లక ప్రణీతంబైన శ్రీమహాభారత వచనకావ్యంబు".

"ఇది శ్రీనందనందన వదనారవింద మత్తమధుకరాయమాన చిత్త చతుర్విధకవితాసామ్రాజ్యభోజ చంద్రగిరి కృష్ణభూపాలక తనూజ భాగమాంబాగర్భశుక్తి ముక్తిముక్తాఫల తుపాకులయనంత భూపాలక ప్రణీతంబైన శ్రీవిష్ణుపురాణంబు".

ఈకవి మైసూరుప్రభు వగుచిక్కదేవరాయనికడ సేనానాయకుఁడుగా నున్నట్లు తెలియుచున్నది. ఈచిక్కదేవరాయలు క్రీ. శ. ౧౬౭౨ మొదలు ౧౭౦౪ వఱకు మైసూరురాష్ట్రమును పాలించిన ప్రభువు కావున నీకవియు నాకాలమునం దున్నవాఁడు. ఈతని నివాసము మైసూరుప్రాంతమని యూహింపఁదగియున్నది. ఈకవిని గూర్చి యింక నేమియుఁ దెలియనందున నీతఁడు రచించిన వచనకావ్యములనుండి శైలి తెలియుటకై కొంతకొంతభాగము నిట నుదాహరించి యాతనిచరిత్రను ముగించెదను

విష్ణుపురాణము:— ఇతఁడీవచనమును సంస్కృతము ననుసరించి వ్రాసినట్లు కన్పట్టుచున్నది. ఆధ్యాయవిభజన మున్నది. ఆంధ్ర పద్యకావ్య విష్ణుపురాణములకంటె నిది విపులముగా నున్నది. రచనము ప్రౌఢమై సంస్కృతపదభూయిష్ఠముగానున్నది. ఈవిష్ణుపురాణమునఁ బదునాల్గధ్యాయములుమాత్రమే ముద్రితమయినది. అముద్రితప్రతి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము నందున్నది.

"ఎవ్వరేని సమాహితమనస్కులై జ్ఞానమయం బైనయాత్మస్వరూపంబు దెలిసి యాయాత్మను నీకు శరీరభూతునింగా దలంపుదురో వారలు నిర్మలజ్ఞానవంతులు. పరమేశ్వరా! అనాదిధర్మవాసనాబద్ధు లగుప్రాణుల కెల్లసుఖంబు లొసంగుము. కమలాక్షా! అప్రమేయుండవై వసుంధర నుద్ధరించి యజ్ఞవరాహరూపంబు ధరియించిన నీవు మాకు శుభంబొసంగుము. గోవిందా! సత్వగుణప్రధానుండవై యవ్యాజంబుగా జగద్రక్షణంబుఁ గావింపందలంచితివి గావున భూమి నుద్ధరించి యథాస్థానంబున నిలిపి మాకు క్షేమంబు నొసంగుము. అని యివ్విధంబున సనకసనందనాది యోగీంద్రులు

జెక్కు భంగులం బ్రశంసింప మహీధరుండైన యప్పరమాత్ముండు మహార్ణవ నిర్మగ్నయగు భూమినెత్తి యెప్పటియట్ల జలంబుపైని నిలిపెను. అంత నవ్వసుంధరయు విస్తీర్ణం బైనయోడచందంబున నిజదేహంబు మిక్కుటంబుగా పరపౌటి కతంబున నమ్మహార్ణవ జలంబున దేలుచుండెఁగాని మునుంగ దయ్యెను. పురుషోత్తముండు భూమి నెప్పటియట్లనె నిలిపి మిట్టపల్లంబులు సమానంబు గావించి తొలుతటిప్రపంచంబుతోడంగూడ నిర్దగ్ధంబులైన పర్వతంబుల నెల్ల నెప్పటియట్లే నిర్మించె. అనంత సత్యసంకల్పుం డైనభగవంతుండు సమస్తద్వీపంబుల నెల్ల నేర్పరచి యథాపూర్వకంబుగా భూమిని విభాగించిపదంపడి భూర్భువస్స్వమహర్లోకంబులును మునుపటివిధంబున సృజియించి యంతట రజోగుణోద్రేకంబు నొందిన చతుర్ముఖున కంతర్యామియై జగంబులనెల్ల సృజియింపం దొడంగె. మైత్రేయ! ఇట్లు సృజియించుట వలనంజేసి యీశ్వరునకు వైషమ్యంబును నిర్దయత్వంబును లేదు. అతండు మాధ్యస్థభావంబున సాక్షియై కనుంగొనుచునుండ జీవులు అనాదికర్మవాసనావశంబునంజేసి పూర్వ కర్మానురూపంబుగా నానావిధశరీరంబులు ధరియించి నానావిధకర్మ మార్గంబులం బ్రవర్తిలుచున్నవారలు సర్వసముండును సాక్షిభూతుండునైన పరమాత్ముండు దక్కప్రపంచంబునకు వేఱొక్కకార ణంబు లేదాయెను. క్షేత్రజ్ఞులు అనాదికర్మవాసనాశక్తివలనంజేసి పుణ్యవంతు లీశుభజన్మంబులం, బాపకర్ము లీదుష్టజన్మంబులం బడయుచున్నవారలు''.

భగవద్గీత:— అర్జునా! కామ్యకర్మఫలంబులు పరిత్యజించుట సన్న్యాసమనియును సర్వకర్మములయెడ ఫలముగోరకుండుట త్యాగ మనియును, విద్వాంసులు పలుకుదురు. గొందఱు విద్వాంసులు

హింసాత్మకము లైనయజ్ఞములు చేయవలదనియును, మఱికొందఱు యజ్ఞము లవశ్యమును చేయవలయుననియు పలుకుదురు. భరత సత్తమా! త్యాగంబు గుణభేదములచే త్రివిధమైయుండు యజ్ఞ దానతపోరూపంబైనకర్మంబు విడువందగదు. యజ్ఞమును, దానమును, తపమును విద్వాంసులకు చిత్తశుద్ధికరములు. కర్మములు నేనుచేయుచున్నాననెడి కర్తృత్వమును ఆకర్మమువలనకలుగు ఫలములను అపేక్షించక సేయవలయు ననియుత్తమం బైననామతంబు. ఉత్తమం బైనకర్మంబునకు పరిత్యాగంబు కూడదు. అజ్ఞానము వలన నట్టికర్మములు పరిత్యజించుట తామసత్యాగమనం బరగు ఎవడు కాయక్లేశభరంబునం గర్మంబులు దుఃకరంబులని పరిత్యజించునో వాడు రాజసత్యాగముచేసినవాఁ డగుటంజేసి మోక్షంబు నొందడు. అర్జునా! నిత్యంబులైనకర్మము లవశ్యకర్తవ్యములని సంగంబును ఫలంబును పరిత్యజించి కర్మము లెవ్వం డాచరించునట్టి త్యాగంబు సాత్త్వికత్యాగం బనందగు. సాత్త్వికత్యాగియగువాడు సత్యసమాధనిష్ఠుండును మేధావియు, ఛిన్నసంశయుండునై క్లేశకరంబు లైనకర్మంబులును ద్వేషింపఁడు. సుకరంబులైన కర్మంబులందు తగులఁడు దేహంబుకలిగినపుడె కర్మంబులు సేయకుండుట అశక్యంబు. కావున కర్మంబు లాచరించి ఫలత్యాగంబు సేయునతండే త్యాగి యనంబరగు".

ఈకవి రామాయణమునుగూడ వచనకావ్యముగా రచించెనని తెలియుచున్నది. ఆపుస్తక మాంధ్రసాహిత్య పుస్తకభాండాగారమున నున్నదఁట.

ఇతఁడు మధురరాజునొద్ద దళవాయిగానుండెనని కొందఱు వ్రాసియున్నారు. అది వాస్తవమనితోచదు. మధురానాథు

వకును మైసూరురాజునకును శత్రుత్వములుండినట్లు కళువె వీరరాజు భారతగద్యయం దున్నది. ఆసందర్భములో వీరరాజును ఇతఁడును గలిసి వచనభారత మెట్లు వ్రాయగలిగిరా యని సందియముకలుగును. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్నయొకప్రతిలోఁ (ఆదిపర్వ ద్వితీయాశ్వాసము) ఇరువురి గద్యలుకూడ నున్నవి. తంజావూరు లిఖితపుస్తకభాండాగారమున సీకవి రచించిన భారతానుశాసనీకపర్వవచన మున్నది. దానియందు ప్రత్యేక మీయనంత భూపాలప్రణీతమనియే యున్నది. వచనభారతము సంపూర్ణగ్రంథము లభించినట్లు కనఁబడదు.

డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్య పంతులుగారు, భారతిపత్రిక (పార్థివ సం॥ మాఘము 118 వ) లో, "తుపాకుల కృష్ణప్ప గోల్కొండసుల్తానగు అబ్దుల్లాకుతుబుశాహా మంత్రియు సైన్యాధ్యక్షుఁడునగు మీర్‌జుమ్లాక్రింద దళవాయియై యతనికి క్రీ. శ ౧౬౫౦ ప్రాంతమునఁ గర్ణాటకసామ్రాజ్యమును స్వాధీన పరచుకొనుటయందు సహాయపడెను. కావున అనంతభూపాలుఁడు ౧౭వ శతాబ్దపుటుత్తరార్థమున నభ్యుదయమందె ననుటకు సందియము లేదు. మహాభారత వచనరచనయందు కళువె వీరరాజునకుఁ దోడ్పడుటయే కాక యనంతభూపాలుఁడు విష్ణుపురాణమును వచనమున వ్రాసెను...." అని వ్రాసియున్నారు.

[శాలివాహనశకవత్సరము 1564 లో తుపాకుల కృష్ణప్ప నాయకుని శాసనమొకటిగలదు. (AR 512 of 1926) ఈకృష్ణప్ప నాయకుడు కవితండ్రియేమో! అయినచో కవికాలము స్పష్టమగును. ఎట్లైనను సీకవి క్రీ. శ. 1700 కు పూర్వుడని తోచుచున్నది.]

---

# 34. కళువె వీరరాజు

—:—

ఇతఁడు క్షత్రియుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఋక్శాఖీయుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు. ఇతఁడు శ్రీమహాభారతము నాంధ్రమున వచనకావ్యమును శ్రీకృష్ణాంకితముగా రచియించెను. అందీతఁడు వేసికొనిన యీ క్రిందిగద్యవలనఁ గవివృత్తాంతము కొంత తెలియుచున్నది. ఈతఁడు దొడ్డరాజు గారమలబుత్రుఁడు.

"ఇది శ్రీరామచంద్ర చరణారవింద సేవాభినందన పవననందన వరప్రసాదాసాదిత గీర్వాణాంధ్రకర్ణాటకాది నానాభాషాకావ్య రచనాచతుర శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర రాజమార్తాండ ప్రౌఢప్రతాపాప్రతిమ వీరనరపతిబిరుద ఎంతెంబరగండ బిరుదాంకిత శంఖచక్రమకరమత్స్య హనూమద్గరుడ గండభేరుండ సింహశరభసాళ్వాది నానావిధదేవార్హ ధ్వజాంకిత యాదవ వంశాబ్ధితిలకాంగ వంగ కళింగ కాశ్మీరలాటమరాట ద్రవిడద్రావిడాది నానాదేశాధీశ్వర కిరీటకోటి సంఘట్టనత్రస్తనిస్తుల నవరత్నపరాగపరాగిత నిజభవనద్వారాసక్తానేక భూపాలఫాలతల సంఘటితాంజలి పుంజరంజితారవింద కరాయమాణసభాస్థానస్థ సింహాసనాధిరూఢ నానావిద్వద్భీష్టవరప్రసాద చిక్కదేవరాజ కరుణాప్రాప్త కర్ణాటరాజ్యలక్ష్మీ నృత్తరంగాయమాన శ్రీరంగపట్టణ పరిపాలనార్థాదృత సైన్యాధిపత్యనిర్వాహక మహారాష్ట్రమదేభపంచానన కేళాదివంశాటవీదావానల మధురానాథ విమర్దనజయఘాట శిరఃకందుకక్రీడనయసవంతరాయ నాసికాకృంతన నిమోజీసమూలోన్మూలన దాదోజీ ప్రాణహరణ దండధర ప్రతాపశీల విఠలపాలేరాయఫాలాక్షురవిదళన

నానావిధానేకాంత ర్వాహ్యాదికాత్ర వమేఘౌఘజంఝామారుత పర రాజగర్వాంధకార విదళనదినరాజ దళవాయి దొడ్డరాజతనూజయా చక సురభూజ భుజబలాటోప పరాజితారిరాజన్య సమర్పితానేక రత్నరాసియుత ధనకనక వస్తువాహనాది సువస్తువిస్తారిత సంతోషి తాఖిలభూసు రాశీర్వాదానువర్ధిత పుత్రపౌత్రాది వంశాభివృద్ధి విరాజమాన కళువెకుల వంశాంబుధిరాకానిశాకర ఆశ్వలాయన సూత్ర పరమపవిత్ర భారద్వాజగోత్ర ప్రదీపకాసేతు శీతాచల మధ్యవర్తి కాశీప్రభృతి పుణ్యక్షేత్ర నిత్యాన్నదానవినోద్యనేకధర్మ శాస్త్రోక్తదానదీక్షావిచక్షణ క్షాత్రాధీశ్వర కార్యఖడ్గ ప్రవీణానవ ధికాగ్రహారా రామక్షేత్రాది సంతోషితాఖిల కవిరాజ వీరరాజ ప్రణీతంబైన మహాభారతవచనకావ్యంబు.

ఈగద్యమునుబట్టి యీతఁడు పరాక్రమవంతుఁడైన సేనాని యనియు, దానకర్ణుఁడనియు, పండితకవియనియు, గవిపండితపోషకుఁ డనియుఁ దెలియుచున్నది. మైసూరురాష్ట్రమును క్రీ. శ. ౧౬౭౨ మొదలు ౧౭౦౪ వఱకును బరిపాలించిన చిక్కదేవరాయల కాలములో నీతని తండ్రియైన దొడ్డరాజు సేనాధికారిగా నున్నవాఁడని పైని గద్యలో వ్రాసుకొనియున్నాఁడు. కావున నీతఁడాకాలము లోను తరువాతను నున్నాడని తలంపవచ్చును.

ఈతని కుమారుఁడైన నంజరాజు హాలాస్యమహాత్మ్యమను నొక వచనకావ్యమును వ్రాసియున్నాఁడు. అతని చరిత్రమునిందు వేఱుగ వ్రాసియున్నాఁడను.

నన్నయభట్టారకుఁడు రచించినాఁడని చెప్పఁబడియెడి యాంధ్రశబ్దచింతామణికి, అప్పకవీయమువలెనే యొక వివరణగ్రంథము నీతనిపేరుతో వీరభూపాలీయమను నదికలదు. అసంపూర్తిగనున్న

దీనిప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్నది. దీనికిఁగర్త యెవ్వరో తెలియదు. ఇందలి మొదటి రెండుపద్యములివి.

క. శ్రీరామచరణ సేవక
కారుణ్యాపయోధి యాదిగర్భేశ్వర దు
ర్వార విరోధివిభేదన
ధీరాగ్రణి వీరరాజ! దినకరతేజా!

గీ. అవధరింపుము దేవమహానుభావుఁ
డైన శబ్దానుశాసనుండవని గలియు
గాది రాజరాజనరేంద్రు ననుమతినుడి
వినతదాంధ్రోక్తి కౌముదిఁ దెనుఁగొనర్తు.

ఈవీరరాజకవి రచించిన యాంధ్రవచనభారతములో స్వల్పభాగము మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునఁ గలదు. తక్కిన దిప్పుడు లభించుట లేదు. ఈభారతవచనములోఁ గొంత తుపాకుల యనంతభూపాలుఁడు రచియించినట్లు కన్పట్టుచున్నది. వీరరాజు రచియించిన భారతవచనము ప్రౌఢమై సులభపదములతో మనోహరముగా నున్నది. నన్నయాదులు రచించిన యాంధ్రపద్య భారతముకంటె నిది విపులమైన గ్రంథము. నన్నయాదులవలెనే మూలమునుండి కథనుగైకొని వీరరాజుకవి తనయిష్టానుసారముగఁ బెంచియుఁ గుదించియు రచనమును సాగించినాఁడు.

ఈతనితండ్రి, శ్రీరంగపట్టణ దుర్గాధ్యక్షుఁడుగానుండి యా ప్రాంతములను బరిపాలించుచున్నట్లు పైనను దహరించిన గద్యవలనఁ దెలియుచున్నది. కావున నీతఁడును, ఆప్రాంతములయందే పాలకుఁ

డుగా నుండెనని తలంపవచ్చును గద్యలో, యాదవ వంశాబ్ధితిలక యని యుండుటచే నీతఁడు యాదవరాజుల సంతతివాఁడని చెప్పవలసి యున్నది. ఈకవి యాంధ్రగీర్వాణ కన్నడభాషలయందు కవి నని చెప్పుకొని యున్నాఁడు. ఆభాషలయందు రచించిన గ్రంథ ములేవియో తెలియలేదు.



## 342. ఋగ్వేది వేంకటాచలకవి

— : —

కవిరాజకంఠీరవ బిరుదాంకితుఁడగు నీకవి వైదిక బ్రాహ్మ ణుఁడు; వసిష్ఠగోత్రుఁడు; తిరువేంగళార్య పుత్త్రుఁడు.

ఇతఁడు భోజమహారాజుచేతను లక్ష్మణసూరిచేతను, సం స్కృతమున రచియింపఁబడిన చంపూరామాయణము నాంధ్రీకరించి యిప్పటి కార్వేటినగరసంస్థాన ప్రభువులపూర్వుఁడగు వెల్లంటి కసవ రాజున కంకితము చేసెను. ఇది యెనిమిదాశ్వాసములు కలది. గద్యయందు కవి తనను గూర్చి యిట్లు వ్రాసికొని యున్నాఁడు. "ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాద సమాసాదిత సరసకవితా విలాస వాసిష్ఠవంశకీర్తి ప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్య కలశరత్నాకరసుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవ బిరుదాంక వేంకటాచలపతి ప్రణీతం బైనచంపూరామాయణం బనుమహాప్రబం ధంబు".

గ్రంథవిస్తరభయము మనమున నున్నను, కృతిపతి తనను గూర్చి పలికినట్లు రచించినపద్యములు కవికాలనిర్ణయమునకుఁ దోడు పడునవి యగుటచే నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

చ. సను హరిణాంకమౌళి కరుణాసముపాత్తరస ప్రసాదవ
ద్ఘనతర సంస్కృతాంధ్రకవితాధను నాదిమవేదివంశవ
ర్ధను దిరువేంగళార్య కవిరాజమాశ్రయధన్యచిత్తవ
ర్తను దయఁ బిల్వఁబంపి సముదంచితచాతురిఁ బల్కె నీగతిన్.

సీ. చక్రవాళాంకపత్రస్థి విస్ఫురణంబు
సాళ్వతిమ్మన్నపాలు సమ్ముఖమునఁ
గొలఁకులాయపుఁ దేజిఁ బలుకా తననకీర్తి
వీర వేంకటరాయశౌరి సభను
జంఘాలవాతూల చతురలాంఛనరూఢి
వెలుగోటి వేంకటపభుని చెంతఁ
బాకశాసనచిహ్నభాసురప్రభ చెంది
వరదేంద్రు నాస్థానవసుధ యందు

గీ. మంతు కెక్కంగ నేమతిమంతుఁ డమరు
నతఁడు సామాన్యుఁడే సమస్తావనీను
స్తిషిగణనీయ మధురవాణీవిలాస
హాసితభారవి తిరువేంగళార్యసుకవి.

ఉ. అత్తిరువేంగళార్యుని యుదారదయావిలసత్కటాక్ష సం
పత్తి తిదీర్ణమైన సుకుమారవచః ప్రతిభానిరూఢిను
ద్వృత్తర గద్యపద్యచయ మాశుగతి న్రచియింప నేర్చి నీ
విత్తరి ఘంతు కెక్కితి మహీశులచెంగట వేంకటాచలా!

సీ. సందర్భములు లేవె జనసన్నుతానన్య
పదసహిష్ణుతఁ జొప్పడవు గాక
కావ్యరీతులు లేవె కమనీయజాతివా
ర్తావిశేషస్ఫూర్తిదగవు గాక
యుత్తరోక్తులు లేవె యుచితాదిమప్రౌఢ
కవిసుప్రయోగముల్ గావు గాక
సౌజన్యములు లేవె సకలార్థనికరోప
కారసామర్థ్యంబుగనవు గాక

గీ. సముధికాచారభూసురోత్తములు లేరె
జగతి నీరీతి గౌరీశచరణ భజన
ధీరనిష్ఠాగరిష్ఠులు గారు గాక
సకలగుణసాంద్ర వేంకటాచలకవీంద్ర!

చ. తరణిసమప్రతాపనిధి డామర యక్క-నృపాలు సన్నిధిన్
వరకవి గంధసింధురము వచ్చె నటంచు వచించువాని క్రొ
వ్వరఁ గవిరాజకేసరి నటంచుఁ బఠించితి వాకు వైఖరిన్
సరసులు మెచ్చ వాఙ్ముఖవిశంకట వేంకటశైలసత్క-వీ!

ఉ. అంబుజసంభవోపమ సమగ్రమనీష! నిరస్తదోష మై
యం బడరంగ నీవు రచియింపఁ దొడంగినభవ్య కావ్య ర
త్నంబు షుదంకితంబుగ నొనర్పు మనల్పయశోవిభానుభా
వం బిల నానిశాకర దివాకర తారకమై విరాజిలన్.

పై పద్యములలో ప్రథమ తృతీయ పద్యములయందు, తాను "దిరువెంగళార్య కవిరాజ సమాశ్రయ ధన్యచిత్తుఁడ" ననియు, ఆతని యుదారదయాకటాక్షసంపత్తిచే గవిత్వముఁ జెప్పనేర్చనాఁడ

ననియుఁ జెప్పియున్నాఁడు. దీనినిబట్టి యీ తిరువెంగళార్యుఁడు కవికి గురువనియు, గద్యయందు, చెప్పఁబడిన తిరువెంగళార్యుఁడు కవికిఁదండ్రి యనియు, వీరిరువురును భిన్నవ్యక్తు లనియు బ్ర. శ్రీ. జయంతి రామయ్యపంతులుగా రీగ్రంథపీఠికలో వ్రాసియున్నారు. ఈయిరువురు భిన్నవ్యక్తులు కా రనియుఁ దండ్రియైనతిరువెంగళార్యుఁడే పై మూఁడు పద్యములలోను వర్ణింపఁబడియె ననియు, నాతని యొద్దనే తాను కవిత్వవిద్య నభ్యసించె నని చెప్పుటయే కవియుద్దేశమనియు నే నభిప్రాయపడుచున్నాఁడను. ఈమూఁడుపద్యములలోను గీర్తింపఁబడిన తిరువెంగళార్యుని తనతండ్రి యని చెప్పుకొనలేదు. కావున నితఁడు భిన్నవ్యక్తియైనగురువై యుండునని శ్రీపంతులుగారూహించి యున్నారు. ఈకవి తనవంశమునుగూర్చి విశేషముగాఁ జెప్పుకొనదలచినవాఁడు కాఁడు. మొదటిపద్యములోను, మూఁడవ పద్యములోను జెప్పఁబడిన తిరువెంగళార్యుఁడును రెండవపద్యములోఁ జెప్పఁబడిన తిరువెంగళార్యుఁడును, ఒక్కవ్యక్తియేకాని యిరువురు కారు. ఇందు మొదటిపద్యమున "నాదిమవేదవంశవర్ధను" నని చెప్పియుండుటచే నీతిరువెంగళార్యుని గృహనామము "ఋగ్వేది" వారనియు, నిందుదాహరింపఁబడిన తిరువెంగళార్యుఁడు కవిజనకుఁడే యనియు నిశ్చయింపఁ దగియున్నది. తనతండ్రి యని చెప్పలేదను కారణమున నీతనిని భిన్నపురుషునిగాఁ దలంపరాదు

ఈకవి గృహనామము "ఋగ్వేదికవి" అని యనుచున్నారు. గద్యలోనున్న 'కవి' శబ్దమును తిరువెంగళార్యునకు విశేషణముగాఁ జేసి యీతని యింటిపేరును "ఋగ్వేది" యని వ్యవహరింపవలసి యుండు నని తోఁచుచున్నది. కవి తననుగూర్చి వ్రాసికొనిన "ననుహరిణాంకమౌళి" యను పద్యములోను "నాదిమవేది వంశ

వర్ధను" అనువాక్యమువలన నీయంశము ధృవపడుచున్నది. తృతీయాశ్వాసాంతమునఁ జెప్పిన—

మ. కుటిలారిద్విరదావళీ విదళనక్రూరాసిపారీంద్ర! కై
యటకౌమారిలకాపిలాది బహుశాస్త్రాభిజ్ఞ ఋగ్వేది వెం
కటనారాయణ సత్కవిప్రముఖ సంఖ్యావన్మరాళచ్ఛటా
పటువాగారభటీవిభాసుర సభాపద్మాకరా భాస్కరా!

యనుపద్యములో "ఋగ్వేది వెంకటనారాయణకవి" యని స్పష్టముగా వ్రాసి యున్నాఁడు. కావున నీకవి యింటిపేరు "ఋగ్వేది" వారని నిశ్చయింతము. ఈపద్యములలో నుదాహరింపఁబడిన "వెంకటనారాయణకవి", యీచంపూరామాయణకర్తయైన వెంకటాచలకవికంటె భిన్నుఁ డనియు నాతఁడు బహుశాస్త్రాభిజ్ఞుఁ డనియుఁ దోఁచుచున్నది. ఆతఁడు రచించిన గ్రంథము లేవియో తెలియలేదు.

కృతిపతియైన కసవరాజు కార్వేటినగరసంస్థానాధిపతియైనట్లు కన్పట్టదు. కార్వేటినగరరాజులనుగూర్చి చెదలవాడ మల్లయకవి చారిత్రమున వ్రాసియున్నాఁడను. క్రీ. శ. ౧౬౧౫ వఱకును గార్వేటినగర రాజ్యమును మాకరాజువంశీయులు పరిపాలించుచున్నట్లు కన్పట్టుచున్నది ఆతరువాతఁగూడ జాలకాలము వారివంశీయులే పరిపాలించినట్లు తలంపవలసియున్నది. ప్రస్తుతమునఁ గార్వేటినగరసంస్థానాధిపతులు వెల్లంటివారై యున్నారు వీరు చంపూరామాయణకృతిపతి యైనవెల్లంటి కసవరాజు వంశములోనివారని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు. ఈ వెల్లంటివారు, మాకరాజువారి దౌహిత్రులనియుఁ దన్మూలమున వీరి కీరాజ్యము

సంక్రమించె ననియుఁ జెప్పుచున్నారు. ఎప్పుడు సంక్రమించె ననువిషయము తెలియుట లేదు.

చంపూరామాయణ కృతిపతి యైనకసవరాజు బొమ్మరాజు కుమార్తె యైనచినకృష్ణాజమ్మను బరిణయ మాడె నని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. ధృతిఁ గసవశౌరి విభవో
న్నతసాళువబొమ్మరాజనందినిఁ గమలా
సతి కెనయనఁ దగుసద్గుణ
వతిఁ జినకృష్ణాజమ న్వివాహం బయ్యెన్.

ఈవెంకటాచలకవి తండ్రి యైనతిరువెంగళార్యుఁడు "సాళ్వ తిమ్మనృపాలుసమ్ముఖమున మంతుకెక్కినట్లు పైనను దాహరింపఁబడిన సీసపద్యములో నున్నది. విప్రనారాయణచరిత్రకృతిపతి యైనతిరుమల రాజును సాళువతిమ్మాధిపుఁ డని చెదలవాడ మల్లయకవి తనగ్రంథమున నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు. తిరుమల, తిమ్మశబ్దము లేకార్థద్యోతకములు.

మ. నిను మాయాతరుణి న్వరించు నెడ నానెయ్యంపుఁదోఁబుట్టువిం
దునవోత్తంసుఁడు గట్టఁబోలు గళమందుం దాలిబొట్టంచు నా
త్మనవీనద్యుఁ జొల్పుకౌస్తుభము నుద్యద్భానువుం జూపి వి
ష్ణుని నర్మోక్తులఁ దేల్చు పెద్దదయఁ బ్రోచున్ సాళ్వతిమ్మాధిపున్

ఈతిమ్మాధిపుఁడును మాకరాజవంశీయుఁడే. వీరివంశవృక్షమును చెదలవాడ మల్లయకవి చారిత్రమున నిచ్చియున్నాఁడను అందు మాకరాజునకు తిమ్మరాజు బొమ్మరాజు నను నిరువురు కొడుకు

లున్నారు. ఈ తిమ్మరాజువలన నీకవితండ్రియైన తిరువెంగళా ర్యుఁడు బహుమతులందె ననియు, నాతనిసోదరుఁడైనబొమ్మరాజు కుమార్తెను, కృతిపతి యైనకసవరాజు వివాహ మాడెననియుఁ దలంపవచ్చును. కాని యట్లు నిశ్చయించుటకుఁ గొన్ని ప్రతిబంధక ములు గన్పించుచున్నవి. విప్రనారాయణచరిత్ర కృతిపతికాలము క్రీ. శ. ౧౫౮౦ ప్రాంత మని యాతనిచరిత్రమునఁ జెప్పియున్నాఁ డను. ఆతని తమ్ముఁడైన బొమ్మరాజుగూడ నాకాలములోనివాఁడే యగును కదా! వెంకటాచలకవి చంపూరామాయణము లోనిషష్ఠా శ్వాసాంతమందలి యీక్రిందిపద్యములో హూణశబ్ద ముపయోగిం చుటవలనను, దక్షిణహిందూదేశమునకు హూణసంపర్కము పదునే డవ శతాబ్దిమధ్యమునఁగాని గలుగకపోవుటవలనను గసవరాజుభార్య పైనిఁజెప్పిన బొమ్మరాజుకుమార్తె కాదనిస్పష్ట మగుచున్నది.

చ. సలలితరత్నకందుకలసత్కుచభారధురీణ హూణకుం
తలరమణీసకంకణ ఝుణత్కరణాంచిత పాణిపల్లవాం
చల పరిధూయమానసిత చామరమారుతలోల మానవం
జుల చికురచ్ఛలభ్రమరచుంబిత చారుతరాననాంబుజా!

ఇందలి హూణశబ్దమునకు మరియొకయర్థ మున్న దని చెప్పి నను, గసవరాజు పై బొమ్మరాజున కల్లుఁడు గాఁడనుట కింకనొక యాధార మున్నది. కసవరాజు ప్రశస్తిని వర్ణించు సందర్భమున "కళ్యాణపురవరాధీశ్వర కటారిసాళ్వ మాకరాజ వీరరాఘవరాజ తిర్వేంగళనాథ కులపాలికాతిలక దేవళాంబాగర్భ శుక్తిముక్తాఫల బొమ్మభూపాల సాధ్వీలలామ రాగమాంబా చిరంతనసుకృతపరిపాక శ్రీస్వరూప చిన్నకృష్ణాజమామనోహర!" అని చెప్పియున్నాఁడు. దీనినిబట్టి కసవరాజునకు మామగారైనబొమ్మరాజుయొక్క తండ్రి

తిరువెంగళనాథుఁడని స్పష్టమగుచున్నది. పైనచెప్పిన బొమ్మరాజు తండ్రి మాకరాజు గారితిరువేంగళరాజు కాఁడు. కావున వీరిరువుర నొక్కరుకారనుట స్పష్టము.

— * —

## 343. శాహా మహారాజు

ఇతఁడు తంజావూరు రాజ్యమును బరిపాలించిన మహారాష్ట్ర క్షత్రియరాజులలో రెండవవాఁడు. ఇతఁడు క్రీ.శ 1684 వ సంవత్సరము మొదలు 1710 వ సంవత్సరమువఱకును తంజావూరురాజ్యమును బరిపాలించెను. ఇతఁడు సుప్రసిద్ధ ఛత్రపతిశివాజీ మహారాజునకుఁ దమ్ముని కుమారుఁడు. ఈ శాహామహారాజుతండ్రి ఏకోజీ, తల్లి దీపాంబిక. ఏకోజీని వెంకాజీయనికూడ పిలచెదరు. ఈ యేకోజీ, శివాజీలిరువురును మాలోజీ కుమారుఁడు శాహామహారాజు కుమారులు.

ఏకోజీ బీజపూరుసుల్తానుపక్షమున దండనాయకుఁడుగా నుండెడివాఁడు. అతనిని బీజపూరునందుంచినచో నన్నగారగు శివాజీతోఁ కలసిపోవునేమో యనుభయమున సుల్తానాతనిని దక్షిణమున కంపివైచెను మహమ్మదీయరాజ్య నిర్మూలనమొనర్చి మహారాష్ట్రరాజ్యస్థాపనము చేయుటకై శివాజీచేఁ బునాదివేయఁబడుచున్న యాదినములలోఁ దనతమ్ముఁడైన యేకోజీ మహమ్మదీయులకడ సేవకుఁడుగానుండుట శివాజీకిష్టము లేదు. సోదరునితో యుద్ధము సేయకుండగను మహమ్మదీయసేనను విడిచిపెట్టకుండగను కాలము గడపవలయుననునూహతో యేకోజీఁసుల్తానాజ్ఞననుసరించి దక్షిణమునకు క్రీ. శ. 1675 వ సంవత్సరమునవచ్చి కుంభకోణమునందుండెను.

తంజావూరు రాజ్యము క్రీ. శ. 1535వ సంవత్సరము మొదలు 1673వ సంవత్సరము వఱకు నాయక ప్రభువుల పరిపాలనములో నుండెనని రఘునాథభూపాలుని యొక్కయు విజయరాఘవ నృపాలుని యొక్కయు చరిత్రములలో వ్రాసియున్నాఁడను. అటు పిమ్మట రెండు మూఁడు సంవత్సరములు అళఘురి చంగమలదాసు మొదలుగాఁ గొందఱి పరిపాలనములోఁ దంజావూరు రాజ్యముండఁగా, నా రాజ్యమునకు మన్నారుదేవుని కాలమునుండియు. మంత్రిగానున్న రాయసము వెంకన్న సాహాయ్యమున క్రీ శ. 1676వ సంవత్సరమున నీ యేకోజీ మహారాజు తంజావూరును స్వాధీనము చేసికొని, యది మొదలు 1683వ సంవత్సరము వఱకును రాజ్యమును చేసెను. అప్పటినుండియు నింగ్లీషువారు వచ్చువఱకును దంజావూరు రాజ్యము మహారాష్ట్ర రాజుల పరిపాలనములో నుండెను.

తండ్రివలెనే శాహామహారాజు ప్రజాను రంజకముగ రాజ్యమేలినవాఁడు. ఇతఁడు మహారాష్ట్ర రాజయ్యును నాంధ్రము నభ్యసించి యాంధ్రమున గ్రంథములను దాను స్వయముగ రచియించి, యనేకాంధ్ర కవులను బోషించి వారిచేఁ బుస్తకములను రచియింపఁ జేసెను.

రఘునాథ భూపాలుని కాలమునకుఁ బూర్వము చెంచులు, కోయలు మొదలగు ననాగరిక జాతులు నాటకముల నాడుచుండెడి వారు. రఘునాథుని కాలమున నీ నాటకకళ యభివృద్ధి చెందెను. అనాగరికులే గాక నాగరికులు సహితము నాటకకళ నభ్యసించి ప్రదర్శనములందుఁ బాల్గొనుచుండిరి.

శాహా మహారాజు కాలమున నీనాటక ప్రదర్శనాభిలాష చాల యధికముగ నుండెను. ఈతఁడు రచించిన నాటకములలో

నీక్రిందఁ జేర్చఁబడినవి. తంజావూరు సరస్వతీమహాలు నందు ముద్రిత స్థితిలోనున్నవి.

1. కిరాత విలాసము
2. కృష్ణలీలా విలాసము
3. గంగా పార్వతీ సంవాదము
4. జల క్రీడలు
5. త్యాగరాజ వినోద చిత్రప్రబంధ నాటకము
6. ద్రౌపదీ కల్యాణము
7. పంచరత్న ప్రబంధము
8. పార్వతీ పరిణయము
9. రతీ కల్యాణము
10. రామ పట్టాభిషేకము
11. రుక్మిణీ సత్యభామా సంవాదము
12. వల్లీ కల్యాణము
13. విఘ్నేశ్వర కల్యాణము
14. విష్ణుపల్లకి సేవా ప్రబంధము
15. శంకరపల్లకి సేవా ప్రబంధము
16. శచీపురందరము
17. శాంతా కల్యాణము
18. సతిదాన శూరము
19. సతీ పతిదాన విలాసము
20. సరస్వతీ కల్యాణము
21. సీతా కల్యాణము.

ఇవియన్నియు నాటకములే. వీనినే యక్షగానములందురు. ఇందుఁగొన్ని నాటకములలో సంస్కృత ద్రావిడ భాషలలో మాట లాడు పాత్రలును గలవు. ఈ నాటకములలో ద్విపదలు, దరువులు వచనములు నుండును. అందందు పద్యములుగూడఁ గలవు. ఇవిగాక బయటపడకున్న గ్రంథములెన్ని యీ మహారాజుచే రచియింపఁ బడెనో తెలియదు ఈతని యాస్థానమున గిరిరాజు కవి, బాలకవి సుబ్బన్న, శేషాచలకవి, ఆదిగా నాంధ్రకవులును, రామభద్ర దీక్షితుఁడు, శ్రీధర వేంకటేశార్యుఁడు యింకను పెక్కండ్రు సంస్కృత కవులును కలరు

తంజావూరు మహారాష్ట్ర రాజుల పరిపాలనమున నాంధ్ర భాషామతల్లికి కనకాభిషేకము జరిగినది. ఏతత్కార్యమునకు బహు గ్రంథనిర్మాతలును, కవిపండిత పోషకులునగు నీ మహారాష్ట్ర రాజులే కారకులు. మహారాష్ట్ర రాజ్య సంస్థాపనాచార్యుఁడగు ఛత్రపతి శివాజీ యీవంశములోనివాఁడే. ఈ మహారాజుల వంశ వృత్తమునకు నెల్లూరి శివరామకవి కృత కామకళానిధియును, శివాజీ మహారాజు అన్నపూర్ణా పరిణయమును, మాతృభూతకవి పారిజాతా పహరణమును, ఏకోజీ ద్విపద రామాయణమును, ఆధారములు. ఇందు కామకళానిధి యొక్కటియే ముద్రితమైనది.

కామకళానిధి నెల్లూరి వీర రాఘవకవి తనయుఁడగు శివరామ కవిచే రచియింపబడి మహారాష్ట్ర రాజవంశజుఁడును ఛత్రపతి శివాజీ సవతి సోదరుఁడైన ఏకోజీ మనమఁడగు. జయసింహున కంకి తము చేయబడినది

కృతిపతి సూర్యవంశపు క్షత్రియుఁడైనట్లును, భోసల కుల సంజాతుఁడనియు, కౌశికగోత్రుఁడనియు నీక్రింది పద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

క. అతఁడఖిలలోక ధర్మ
స్థితికై సంజ్ఞాఖ్యయైన చెలియందుఁ గనెన్
సుతునతఁడు సువర్ణ సుకీర్తితుఁడై
సూర్యాన్వయాయ దీపకుఁడయ్యెన్.

క. వానికి నిక్ష్వాకువు మొద
లైన మహామహులు గలిగిరతిధులు కళా
మానితు లనఘులు పదుగురు
సూనులు దిక్కలితకీర్తి సూనులు వరుసన్.

క. ఆ యిక్ష్వాకు కులంబున
శ్రీయుతులు దిలీప రఘు హరిశ్చంద్ర కకుత్
స్థాయు స్సగర భగీరథు
లాయ తమతులు దయమంది రతుల ప్రౌఢిన్.

గీ. వారి కులమునఁ గలిగె నవార్యబలుఁడు
భోసలాభిధ ధాత్రీ ప్రభుఁడతండు
హితమతి మహారట దేశంబు నేలుచును య
శంబు దిక్కులనించె భాస్వర విభూతి.

గీ. అతనిపేరిట నా భాస్కరాన్వయంబు
భోసల కులంబనంగను పొగడు గనియె
నతనికిఁ బురోహితుఁడు గాధి సుతుఁడుగాన
ధాత్రినతనికిఁ గౌశిక గోత్ర మమరు.

ఆ భోస లాన్వయమున హరిశ్చంద్ర నృపతుఁడును జయ సింహుఁడును ప్రఖ్యాత పురుషులని యీాదిగువ పద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

కం. ఆ రాకొమరుల యందును
దార యశోమహిమ వెలయ నాహవ విజయా
ధారుఁడగు హరిశ్చంద్ర ధ
రా రమణుఁడు సూర్యవంశ రత్నమ్మనగన్.

కం. ఆయన కనుజుఁడు సుజన వి
ధేయుఁడు జనవినుత నామధేయుఁడు శ్రీ రా
ధేయుఁడు దానకళా రా
ధేయుఁడు జయసింహ రాజధీరుఁడు వెలయున్.

కృతిపతికి వృద్ధ ప్రపితామహుఁడైన మాలోజీని, ప్రపితామహుఁడైన శాహాజీని శివరామకవి యిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. సకల లోకవ్యాప్త సంపూర్ణ చంద్రా
యమాన నిర్మల యశోమండలంబు
అవపణంబు మహాబాడబీకృత
ప్రబల ప్రతాప ప్రభాచయము
సతత విశ్రాణ నసంతృప్త నవనిధి
లాలిత లోకపాలక గణంబు
రణరంగ నిర్జితారాతి క్ష్మానాథ
మందీకృత దినేశ మండలంబు.

గాఁగఁ జతురబ్ధి వేష్టిత క్ష్మాతలంబుఁ
బాలనము సేసె నెవ్వాఁడు బాహుశక్తి
నతఁడు చెలువొందు సకల ధర్మానుసారి
రమ్య గుణహారి మాలోజి రాజశౌరి.

గీ. అమ్మహారాజు తనకు నర్ధాంగలక్ష్మి
యగు నుమాదేవియందు శాహ క్షితీశుఁ
గనియె వాసవుఁ డాశచీకాంతయందు.

శా. ఆ శాహం క్షితిపాలకుండు నిజబాహాజాగ్రదుగ్రాసి ధా
రాశీర్ణ ప్రతిపక్షభూమి భృదురః ప్రావిష్ట గోరోచనా
శ్రీశోణ ప్రచుర ప్రతాప రుచియై శిష్టావళీ రక్షకుం
డై శాసించె ధరాతలంబు నయవిద్యాపారగుల్ మెచ్చఁగన్.

గీ. తనదు భుజశక్తియును శౌర్య ధైర్య మహిమ
గాంచి ఢిల్లీశ్వరుఁడు సంతసించి చెల్మి
నాప్తుఁడై మహారాజ విఖ్యాతి మెసఁగ
స్థిరతర విభూతిచేతఁ బ్రసిద్ధిగనియె.

మాలోజీ శహాజీలను చక్రవర్తులని కవి వర్ణించియున్నను వీరు గొప్ప భూపతులు గారనియు, శాహాజీ అయిదువేల మనసబు దారు అనియు చరిత్రకారులు వ్రాసియున్నారు. శాహాజీకి మహారాజ విఖ్యాతి నొసంగిన ఢిల్లీశ్వరుఁడు ఔరంగజేబు పాదుషాయై యుండును

ఈ శాహాజీకి జిజాబాయి, తులజాబాయి యను నిరువురు భార్యలు. వారిలో జిజాబాయియందు శివాజీ, శరభోజీ యను నిరువురు కుమారులును, తులజాంబికయందు ఏకోజీ యను కుమారుఁడును గలిగిరి. ఈ శివాజియే మహమ్మదీయ ప్రభువులను జయించి ఢిల్లీశ్వరుని ప్రక్కలోని బల్లెమై మహారాష్ట్ర రాజ్యమును స్థాపించి ఛత్రపతియైన ప్రతిభాశాలి. శివరామకవి శివాజీనిట్లు వర్ణించియున్నాడు.

మ. అతడు ద్వేల భుజాబలాఢ్యుఁడు తురుష్కాధీశుఁడౌ పాదుపా
నతి శౌర్యాప్తిఁ దృణీకరించి బహుదేశాధ్యక్షులం గూర్చి సం
తత ధాటీగతి హస్తి పట్టణముపై దండెత్తి పోరాడి ని
ర్జిత ఢిల్లీశ సమాఖ్యఁ జెందె నృపతిశ్రేణుల్ ప్రశంసింపగన్.

సీ. ఏ వీరు తేజో దినేశున కౌరంగ
జేబు పాచ్ఛాహ ఘూక శిశుకమయ్యె
నే ధీరు సాయకాహికిఁ గ్రూర పారసీక
కులంబు మూషిక ప్రకరమయ్యె
నే రాజు హాయకోటి ఘోరాడ గోల
కొండ బిజాపురంబులు తావులయ్యె
నే శూరు కీర్తిమ............
యంబు కరతలామలకమయ్యె.

నెవ్వఁడేకాత పత్రమై యెసఁగ ధరణి
నేలుచును ఛత్రపతియన మెప్పుగాంచె
నతఁడు విలసిల్లు సకల విద్యా వివేక
భాస్కరుండు శివాజి భూపాలకుండు.

శివాజీకి సవతి తమ్ముఁడైన ఏకోజీ కృతిపతియగు జయసింహు వకు బితామహుఁడు. ఈ ఏకోజీ మిగుల పరాక్రమ వంతుఁడై దక్షిణ దేశమును జయించి మహారాష్ట్ర రాజ్యమును స్థాపించిన పీరాగ్రేసరుఁడని యీక్రింది పద్యములవలన దెలియుచున్నది. ఈ ఏకోజీని వెంకాజీయనికూడ యనియెదరు.

సీ. ఏ మహామహుని తేజో మండలము
ధ్వాంతకవిరతోదిత కమలాప్తుఁ డగును
ఏ రాజు కీర్తి ప్రభా రాశి శంభు మూర్ధ
స్థితేందునకుఁ బూర్ణత ఘటించు
ఏ విభు దానధారా వారిపూరంబు
జలధి పూరణ కాది సరసి యగును
ఏ మహోన్నత సద్గుణామేయ విస్ఫూర్తి
సజ్జన కర్ణ భూషణతఁబూను.

నతఁడు చెలువొందు నిఖిల రాజాధిరాజ
రాజ కోటీర రత్న నీరాజితాంఘ్రి
రణతల కిరీటి విముఖకారాతి కోటి
సాంబశివమూర్తి యేకరాట్చక్రవర్తి.

సీ. పారసీకారట్ట బాహ్లీకజానేయ
ఘోట్టాణ దట్టముల్ గొలిచినడువ
దండెత్తి నర్మదా దక్షిణావని
సీమఁగల భూపతుల నెల్లఁ గలచివైచి
చేరి కర్ణాటక్షితి బెంగుళూరిలో
నిలచి వింధ్యాచల తలమునందు
నతుల పంచ ద్రావిడాధీశ జయ
కృతాక్షర పంక్తితో స్తంభమునిచి
మరియు మైసూరి బలముచే మగ్నుఁడైన
పాండ్యరాజును రక్షించి ప్రబలుఁ డగుచు
చోళ రాజ్యంబుఁ గైకొని యేలుచుండె
రమ్య గుణశాలి యేక భూపాలమాళి.

ఈ ఏకోజీకి ముగ్గురు భార్యలు. అందు దీపాంబవలన శాహాజీ, శరభోజీ, తులజరాజు అను ముగ్గురు తనయులు జన్మించిరి. ఏకోజీ జీవించి యుండగనే శాహాజీ రాజ్యభారమును వహించినట్లీ క్రింది పద్యమువలనఁ గన్పట్టు చున్నది.

క. ఆతని యనుమతిచే ధర
ణీతరభరమున్ భజించి నృపనయ విద్యా
చాతురి రామ విభుండన
ఖ్యాతింగనె శాహనృపతి ఘనతర మతియై.

శాహజీకి తరువాత క్రమముగా శరభోజియు, తులజాజీయు రాజ్యాధికారమును వహించిరి. యీ ముగ్గురులో మన కవి వతంసుడు శాహజీ కవిపండిత పోషకుడై పెక్కు గ్రంథములను రచియించెను. అతని సోదరుడైన శరభోజి కవిపండిత పోషకుడు. సంస్కృతమున రాఘవ చరిత్రమును రచియించెనని చెప్పుదురు. గిరిరాజకవి లీలావతీ కల్యాణమను యక్షగానమును యీ శరభోజీకి అంకితము చేసెను.

ఇతని సోదరుడయిన తులజాజీకి తుక్కోజియను నామాంతరము కలదు. తులజాజీ శివకామ సుందరీ పరిణయమును రచించెను. ఇతని చారిత్రము మఱియొకచోట చూడనగును.

ఈ తులజాజీకి (తుక్కోజీకి) హరిశ్చంద్ర విభుడు, జయసింహ విభుడు, ఏకోజీ. ప్రతాపసింహుడు అను నలుగురు కుమారులు కలిగిరి. హరిశ్చంద్ర విభుని జయసింహుని, ఏకోజీలనుగూర్చి కామ కళానిధియందు కవి యీక్రింది విధముగా నుతించి యున్నాడు.

సీ. పాండ్య కేరళ రాజభామినీ కచ
హార కల్హారముల కాంతిఁగొకుపరచి
కరహాట కురులాట కర్ణాట కామినీ
కుంకుమ రేకల సుంకమడిగి
ద్రవిడ కరూశ విదర్భ మదాంగనా
వీటికారుచులకు వెరపు జూపి
కుంతల నిమథాంధ్ర కాంతా కుచద్వయీ
గోరోచనాచ్ఛవి మారుపరచి.

తనదు తీవ్ర ప్రతాపముద్యద్విభూతి
సకల జగముల నెరసి నిశ్చలముగాఁగ

సత్య భాషావిజిత హరిశ్చంద్రుఁ డగుచు
జగతి వర్ధిల్లు శ్రీహరిశ్చంద్ర నృపతి.

సీ. సరిపోల్పఁగా రాదె సురరాజ రత్నంబు
హృదయ కాఠిన్యంబు వదలెనేని
తులగాదె గోరంత కలశపాథోరాశి
గలఁగక యుండుట కలిగెనేని
సాటిగాదా కొంత చామీకరనగంబు
శివునిచేఁ జిక్కక చెలఁగెనేని
పోలదా యినుమంత పుణ్యజనాధీశు
...............మనిచెనేని.
దాన గాంభీర్య ధీరత్వ ధనసమృద్ధి
ననుచు జనములు వేనోళ్ల నభినుతింప
నవని వర్ధిల్లు నెపుడు బ్రహ్మయువగుచు
రతి వరాకృతి జయసింగ రాడ్నృపతి.

సీ. ఆ విక్రమార్కాదులైన నీతని సరి
గా నేర్తురా పరాక్రమము బల్మి
నా ధనాధీశాదులైన నీతనితోడ
జోడౌదురా ధనస్ఫురణ కలిమి
నా యంగ రాజాదులైన నీతనిసాటి
పూనెదరా దానపూర్తి నెలమి
నా కాళి దాసాదులైన నీతని కిన
యాదురా కవనమహత్వ మెలమి.
ననుచు విబుధులు గొనియాడ నలరునౌర
భోస లామ్నాయ వారిధి పూర్ణచంద్రుఁ

డైన రాజ కుమారాంబికాగ్ర సుతుఁడు
యేకరాజన్య ఘనుడు వివేకధనుఁడు.

ఈ ఏకోజీకి బావాసాహేబు అను నామాంతరము కలదు. ఇతఁడు కవిపండిత పోషకుఁడేగాక కవియై యుండెను. ఈతని చారిత్రము వేఱొకచోట వ్రాసియున్నాఁడను. ఈ ఏకోజీ సోదరుండైన ప్రతాపసింహ రాజేంద్రుని ముద్దుపళని తన రాధికా సాంత్వనమున నీక్రింది విధమున గీర్తించినది.

సీ. ఏ రాజుకు వలయంబెల్ల రంజిలఁజేసి
జైవాతృకాణ్యా నిచ్చలుఁ దలిర్చు
నే లోకబాంధవుండిలఁ బ్రతాపంబు లడంచి
చక్రిప్రమోదంబు సంఘటించు
నే ఘనుండు శరంబు లేవేళఁ గురియించి
పరవాహినుల నెల్ల భంగపఱచు
నే యీశుఁ డార్యావనాయత్తమతిఁ గాంచి
కీర్తింప సర్వజ్ఞమూర్తి యౌను.

తే గీ. వాఁడు నృపమాత్రుఁడే రఘూద్వహాదయ ప్ర
వాహావర్ణిత భోసలాన్వయ పయోధి
సోమ తోలజేంద్ర వర తనూజుండు శ్రీప్ర
తాపసింహ క్షమాపాల తల్లజుండు.

ఈ ప్రతాప సింహునకు తులజరాజు అమర సింహులను నిరువురు కుమారులు గలరు. వీరలలో అమరసింహునకు మాతృభూత లింగకవి పారిజాతాపహరణమును గృతియొసంగెనని యిందలి గద్య వలనఁ దెలియనగును.

"ఇది చోళ సింహాసనా ధ్యక్షు, భోసల ప్రతాపసింహ రాజ పూర్వపుణ్య పరిపాకస్వరూప యమునాంబికా గర్భశుక్తి మౌక్తికాయమాన అమరసింహ మండలాధీశ్వర నామాంకితంబైన......

తంజావూరు మహారాష్ట్ర రాజులలో కడపటివాఁడును అన్నపూర్ణా పరిణయ కర్తయునగు శివాజీ తనవంశమునుగూర్చి వ్రాసిన నీక్రింది ద్విపదలనుబట్టి ప్రతాపసింహ తనూజుఁడైన తులజ మహారాజునకు శరభేంద్రుఁడు పుత్రుఁడైనట్లును ఆ శరభేంద్రునకు అన్నపూర్ణా పరిణయకర్తయగు శివాజీ కుమారుఁడైనట్లును దెలియవచ్చుచున్నది.

శ్రీ శాహజేంద్రుండు — చిరసద్గుణుండు
వాసిగాను వెలిఁగె — వైపు మీఱఁగను
యేకోజియను పుత్రు యెలమి గానపుడు
జోకతోఁ గాంచెను — సొంపు మీఱఁగను
శ్రీమించి యేకోజి — చెలువు చెందగను
ప్రేమగా యీచోళ — భూమి పాలించి
తుక్కోజియను పుత్రు — తుల్యుని గనియె
చక్కనౌ సౌందర్య — శాలి తుక్కోజి
చెలువుఁడైన ప్రతాప — సింహేంద్రు గాంచె
యిలలోన జనులెల్ల — హెచ్చుగాఁ బొగడ.

వ॥ ఇవ్విధంబున ప్రతాప సింహేంద్రుండు పూర్వ రాజర్షులం బోలి రాజ్యంబు చేయుచునుండి తులజేంద్రుండను కుమారునిం గాంచె.

ఆ తులజేంద్రుండు — అద్భుత గుణుఁడు
ఖ్యాతుడై విలసిల్లు — ఘనుల పోషించి
బహు యోగశాలియై — భాగ్య సంపదలు

సహజముగా గాంచి – సౌందర్య ఘనుని
శరభేంద్రుఁడను పుత్రు – చెలువుగా గాంచి

పరిపూర్ణ సామ్రాజ్య – పదమున నుంచె
ఆ శరభేంద్రుండు – అతి సుందరుండు
శ్రీ శివభక్తుండు – స్థిర యశోధనుఁడు
మహాదేవు సత్కృపా – మహిమంబు వలన
వహిమించిన శివాజి – వర్యుని గాంచె
భోసలకుల రాజ – పుంగవులెల్ల
వీసము బోలరీ – విభు గుణంబులకు
రహిమించు శ్రీ – అహల్యాంబికా గర్భ
మహిత శుక్త్యుద్భవ – మహాకీర్తి మనుచు
ప్రఖ్యాతుఁడై భువి – భాసిల్లు వాఁడు
సౌఖ్యాభి వృద్ధిచే – సదయుఁడై వాఁడు

పైన పేర్కొనబడిన గద్య పద్యముల ననుసరించి తంజావూరు రాజ్యమును పాలించిన మహారాష్ట్ర రాజుల వంశవృక్షము నీక్రింద నొసంగు చున్నాడను.






[ఈ విద్వత్ప్రభువు నాస్థానమునగల సంస్కృత పండితులను గూర్చి తెలియగోరువారు నిడదవోలు వేంకటరావుగారు రచించిన దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము చూడనగును.]

# 344. తెనాలి రామలింగకవి

ఇతఁడు విశ్వకర్మ కులజుఁడు; కశ్యప గోత్రుఁడు; మల్లికార్జున పుత్రుఁడు; మృత్యుంజయ పౌత్రుఁడు.

ఈకవి ధీరజన మనోవిరాజితమను ౧౨౦ పద్యములుగల యొక చిన్న పద్యకావ్యమును రచించెను. చోళరాజొకనికి పుట్టిన సంతానమంతయు చనిపోవుచుండగా నాతని మంత్రి యాతని భార్యతో, ప్రసవసమయమున నేత్రములను చర్మముతోఁ గప్పివేసికొని కొంతసేపు శిశువును జూడకుండ నున్నచో నాశిశువు జీవించునని యొక వృద్ధతాపసి చెప్పెనని చెప్పి యామెచే నట్లు చేయించి యామె మృతపిండమును గనఁగా దాని నావల పారవేయించి, యాసమయముననే జన్మించిన యొక యుప్పరవాని పురుష శిశువును దెప్పించి యామె ప్రక్కయందుంపి చెను. పిదప నామె యాశిశువే తన శిశువని భావించి పెద్దవానింజేసెను చోళరాజొకనాఁడు తన పట్టణమందున్న విశ్వబ్రాహ్మణులను బిలిపించి, మేరు పర్వతమును జూపింపుఁడని యడుగగా నందు పదునాల్గురట్లే చూపించెదమని రాజును దీసికొని యడవిమార్గమునఁ బోవుచుండిరి. ఇట కర్పుకుఁడు మిఁగిలిన స్వర్ణకారకులఁ బిలిచి యొక కిరీటంబు చేసి తెమ్మని యాజ్ఞాపింప వారట్లు చేసిరి. కర్పుకుని మంత్రియగు నమరయ్య యాతని జన్మరహస్య మాతనికిం జెప్పి యాతనితో ఈ విశ్వబ్రాహ్మణులీ కిరీటమునందా జన్మరహస్యము బయటపడునట్లు 'చుట్టకుదురు'ను నిర్మించినారు చూచితివా? ఈ రహస్యము వెల్లడియయ్యెనేని నీ గౌరవముండదు. కావున నీ స్వర్ణకారకుల నందఱఁ జంపివేసితివేని నీ రహస్యము నెవ్వరెఱుఁగఁజాలరని చెప్పెను. కర్పుకుఁడాయూరి విశ్వబ్రాహ్మణుల నాబాల గోపాలమును వధించి యడవియందున్న

వారినికూడ వధింపవలయునను నూహతో నరణ్యమునకుఁ బోయెను. రాజును నాతనితోనున్న పదునల్వురును సూదికొండ నాశ్రయించి యుండిరి. పూర్వమొకప్పుడు సూదికొండ ప్రాంతముల యందెవ్వఁడేని యాయుధములతో వచ్చినను నాతని యాయుధములు మొక్క-వోవునుగాని హింస సేయఁజాలవని శాపమిచ్చి యుండుటచే వారినేమియుఁ జేయఁజాలక కర్పకుఁడింటికిఁ బోయెను. తరువాత నీ రథకారకులు పదునలువురును కఱ్ఱలతో విగ్రహములను చేసి, వారా విగ్రహములలో నుండి రామాయణమును ప్రదర్శింపుచు నూరూరఁ దిరుగుచు, క్రమక్రమముగ కర్పకుఁడున్న గ్రామమున కేఁగి యాతని యనుమతింగొని రామాయణమును బ్రదర్శింపుచుండిరి రామవిగ్రహము నందున్న చోళరాజు, సింహాసనముపైనున్న కర్పకని శిరః ఖండనమొనర్చి తానా సింహాసనమునఁ గూర్చుండెను. రథకారకు లమరయ్యను బట్టుకొని స్తంభమునకుఁగట్టి యాతని శరీరమును ఖండ ఖండములుగా నరికి కాకులకును గ్రద్దలకు నాహారముగా వైచిరి. ఈకథయే యిందు వర్ణితమైనది.

సూదికొండ గోదావరి మండలమున రాజమహేంద్రవరము తాలూకాలో నున్నది. ఈకథ, గోలకొండ తానీషా ప్రభువునొద్ద మంత్రులుగానున్న అక్కన మాదనలలో మాదన యక్కనతోఁ జెప్పినట్లిందు వ్రాయఁబడినది. దీనినిబట్టి చూడఁగా కవి గోదావరి మండలములోని వాఁడని యనిపించును గాని, యీతని గృహనామమునుబట్టి గుంటూరు మండలము వాడని నిశ్చయింపవలసి యున్నది. ఈతని వంశీయులిప్పుడు గుడివాడ, దర్శి మొదలగు గ్రామములో నున్నారఁట.

పాండురంగ మాహాత్మ్యాది కృతులను రచియించి సిప్రద్ధిఁ గాంచిన తెనాలి రామకృష్ణకవిని తెనాలి రామలింగమని కొందఱు వాడుట కలదు. నామ సామ్యమునుబట్టి యాతఁడే వంశీయుఁడని కొందఱును, ఇరువురు నొక్కరేయని కొందఱును దలంచుచున్నారు కాని యది కేవల మసత్యము. అతఁడు నియోగి బ్రాహ్మణుఁడు కౌండిన్యగోత్రుఁడు. అతనికిని, ఈవంశమువారికి నేమియు సంబంధము లేదు. అతఁడీతఁడేయని తలంచుటకూడ పొరపాటు. అతఁడు క్రీ.శ. పదునైదువందల యేఁబది సంవత్సర ప్రాంతమువాఁడు. ఈ రామలింగకవి యక్కన మాదనలను బేర్కొని యుండుటచే క్రీ. శ. ౧౬౮౦ సంవత్సర ప్రాంతమునకుఁ దరువాతివాఁడై పదునేనిమిది శతాబ్దిలోనివాఁడై యుండును. కావున వీరిరువురకు నెట్టిసంబంధమును లేదు.

రామలింగకవి కవిత్వము ప్రౌఢమయినది కాదు. అచ్చటచ్చట వ్యాకరణ దోషములును గలవు. అయినను ధారాశుద్ధి కలిగి మృదుపద సంయుతమై యున్నది. ఇందలి శైలి తెలియుటకై రెండు పద్యముల నుదాహరించుచున్నాఁడను.

మ. తొలి నీవుప్పరవాని బిడ్డఁడవు నిన్ దోరంబుగాఁ దెచ్చి తో
యులికే నిచ్చితి గోప్యమిద్ది మఱి నాయాజ్ఞన్మఱుంగాయె భూ
వలయాధీశ్వరు పుత్రుఁ డంచు మనుజుల్వాక్రాతురీ యుక్తి పెం
పలరం బల్కుదురయ్య! నీ జనన మెవ్వారు న్వినంజాలమిన్.

ఉ. మిమ్ములఁ నందఱిం గలిసి మేరుధరాధర రాజ సద్విలా
సమ్ములు సూడనే నకట సమ్మతిఁ దోడ్కొని వచ్చినంగ దా

ముమ్మారమాని కర్బురుఁడు భూరి మదోద్ధతి మీకులంబు రో
సమ్మునఁ ద్రుంచెఁ గాన రథసమ్మున వాని వధించు టెట్లొకో!

ఈ కవి నివాసము గోలకొండ ప్రాంతమనియు ౨౫౦ సంవత్సరముల క్రిందటి వాఁడనియు, గోలకొండ కవుల సంచిక వాకొనుచున్నది. గ్రంథమునం దక్కన మాదనల నామము లుదాహరింపబడి యుండుటయే యిందులకుఁ గారణమయి యుండును. అక్కన మాదనలిందు కథకుఁడుగను శ్రోతగను చెప్పబడి యున్నంత మాత్రమున నీతఁడక్కన మాదనల కాలము వాఁడనియు గోలకొండ ప్రాంతము వాఁడనియు నిశ్చయింపరాదు.

—*ॐ*—

## 345. శేషాచలపతి

ఇతఁడు శాహరాజ విలాసమను నొకయక్షగానమును రచించి యాతని కేయంకిత మొనర్చెను. ఈకవి తంజావూరు రాజగు శాహమహారాజు నాస్థానమున కవియై యుండి, యామహారాజును వలచిన యొకకన్యక నామె చెలికత్తె లాతనికి సమకూర్చిన కథను యక్షగానముగా రచియించినట్లు క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది. ఈ పుస్తకము యొక్క తాళపత్రప్రతి తంజావూరు పుస్తకభాండాగారమున నున్నది. ఈకవి యష్టభాషలయందుఁ గవిత్వము చెప్పఁగల వాఁడనని చెప్పుకొని యున్నాఁడు.

సీ. శ్రీకరగుణశాలి యేకేంద్రసుతమాళి
స్వారిరాగానొక్క సరసిజాక్షి
చూచి మోహించుచు శుకముఖ్యదూతిక
లంపి మన్మథ వివశాత్మ యగుచు
వనకేళి మీనకేతనుపూజ లొనరించి
శుభసూచకంబైన సూక్తి వలన
అవిలంబముగఁ జెలుల్ ప్రాణేశుఁ డౌ శాహ
విభునితోఁ గూర్చిన విభవమెల్ల

తే. లలితగతి శాహరాజ విలాస మనెడు
నాటకము రచించు బుధులు సంతసము నొంద
ధీచమత్కృతి వెలయ శేషాచలపతి
అష్టభాషా కవిత్వంబులమరు సుకృతి

ఈకవి శాహామహారాజు వంశావళినందు వర్ణించియున్నాఁడు. ఆచరిత్రము సుప్రసిద్ధమగుట గ్రంథగౌరవభీతిచే నిట నుదాహరించ లేదు. ఆమహారాజు ప్రతాప మీక్రింది ద్విపదలలో వర్ణించి యున్నాఁడు

"యవనాసురుల నెల్ల నరిమెనభల్ల
జవనత శిక్షించి జగతి రక్షించి
సంగమ్ముగాఁచె ద్రవిడోర్వి మించె
మద్రం బాక్రమించె.........
వంగభూమి భరించె వపకాళిగాంచె
జాలిగలంబేలె పాంచాలోర్వి ప్రాలె
సౌరాష్ట్ర మెట్టెను శకభూమకట్టె
నారట్టకము చేరె నాంధ్రోర్వి మీఱె".

ఈకవి సరస్వతీ కల్యాణమను మఱియొక యక్షగానమును రచియించి దాని కర్తృత్వమును శాహమహారాజునకే యర్పించిన ట్లీక్రింది ద్విపదలలోఁ గానవచ్చుచున్నది.

అగు చొక్కనాథ మహామాత్యనాథు
సుగుణసత్పుత్రుండు సుజనమిత్రుండు
చిరపుణ్యవరమతి శేషాచలపతి
వరశాహవిభుపేర వహిని దైవార
చారు శృంగారరసంబుల ధీరు లౌ
రా యనుచు మెచ్చ హర్షంబు మెచ్చ
మొల్ల పువ్వుల పొట్లములు విప్పినట్లు
చల్లగా పన్నీరు చల్లినతీరు
పరగు సరస్వతీపరిణయం బనెడు
సరసనాటకము లాస్యములరంజిల్ల
భావముల్ తగు వేషభాషాదు లమరఁ
గావించె భరతులు గాయకుల్ మెచ్చ
ఆచక్రవాళా చలాచలా చక్ర
మాచంద్రతారార్కమై యొప్పఁగాత.

ఈ ద్విపదనుబట్టి యీకవి చొక్కనాథ మహామాత్యుని పుత్రుఁడైనట్లు కన్పట్టుచున్నది.

శాహమహారాజు క్రీ.శ ౧౬౮౪–౧౭౧౦ వఱకును దంజాపూరును పాలించినవాఁడు. కావున నీకవియు నాకాలమునందు తంజాపూరు నందున్నవాఁ డని చెప్పుటకు సంశయింప నక్కఱ లేదు.

వశిష్ఠ జనక సంవాద మనుపేర రామాయణమును యామాజాల శేషాచలపతి యక్షగానముగా రచియించెనని గోలకొండకవుల

చరిత్ర చెప్పుచున్నది. ఆతఁడు నీతఁడు నొక్క వ్యక్తియే యేమో యని సంశయము కలుగుచున్నది. కాని ఆతఁడు క్రీ.శ. ౧౮౦౦ ప్రాంతమువాఁడని యనుటచే వీరిరువురు నొక్కరుకారని తేలు చున్నది.

'చొక్కనాథునిగూర్చి ఆలోచింపవలసి యున్నది' అని గ్రంథ కర్త వ్రాసి యుంచుకొనెను. ఆకారణమున నీవిషయమిట వ్రాయు చున్నారము. శేషాచలపతి తండ్రి నామము చొక్కనాథుఁడా లేక యతఁడు చొక్కనాథ ప్రభువుయొద్ద మంత్రియా? యని యాలోచింప వలసి యున్నది. చొక్కనాథ ప్రభువుయొద్ద మంత్రియని యూహించిన మధుర నాయక రాజులలో చొక్కనాథ నాయకుఁడొకడు కలఁడు అతఁడు 1659–1682 మధ్య మధుర రాజ్యమును బాలించిన ప్రభువు ఇతనియొద్ద మనకవి తండ్రి మంత్రిగనున్నచో మనకవి 1684–1710 మధ్య శాహమహారాజు యాస్థానమున నుండెనని చెప్పనగును. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమున (శ్రీ) నిడదవోలు వెంకట్రావుగారు ఎమ్.ఏ. ఆంధ్రపాణిని శేషాచలకవినిగూర్చి వ్రాసిన విషయము నిందు పొందుపఱచుచున్నాను. శహాజీ రాజాస్థానమున ప్రథమగణ్యుఁడు శేషాచలకవి. ఈతనిని నెల్లూరి శివరామకవి 'కామకళానిధి' యను గ్రంథమున తనగురువుగా నిట్లు పేర్కొనినాడు.

మ. సకలాంధ్రోక్తుల కాంధ్రపాణిని యనన్ శాస్త్రంబు గల్పించి, తత్
ప్రకృతి ప్రత్యయ నిర్ణయంబు కొరకై భాష్యంబు గావించి, దే
శికుఁడై రాజులచేతఁ బూజగొను నా శేషాచలర్షిన్ నివృ
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు భక్తిన్ మానసాబ్జంబునన్.

పై పద్యమునుబట్టి 'ఆంధ్రపాణిని' యని పేర్కొనఁబడిన యాతఁడు నివృత్తి కులజుఁడనియు, శేషాచల నామధేయుఁడనియు రాజులచేఁ బూజింపఁబడిన వాఁడనియు, సంస్కృతభాషకుఁ బాణినీయమువలె నాంధ్రభాషకు సూత్రములుగావించి దానికి భాష్యము కూడ వ్రాసినవాఁడని స్పష్టమగుచున్నది

శహాజీ మహారాజునకుఁ గృతిగా కవి రచించిన 'భోసలకోసలీయము' అను నముద్రిత సంస్కృత కావ్యమునుండి కవినిగూర్చి యీక్రిందిరీతిని గలదు.

శ్లో॥ నాయాసంకవసే తఽతోపి కఠినంకావ్యం తతోయాపకం
తస్మాద్ధ్వన్యమతః పదధ్వరసైః వాగ్వైఖరీ జీవితమ్
తద్రామాయణ భాసి మజ్జయకథం జల్పాంధ్ర వాక్పాణినే
శ్రీశేషాచలపత్యమాత్యకుశలోఽస్తి త్యావంశాహాధిపః

శ్లో॥ శాహేంద్ర దత్త శిబికా కనకాభిషేక
సంభావనారుణబిధి ప్రతీకార హేతోః
యత్నాహనం విరచయే ననుతత్రవాణీ
త్వత్తోధిఽకం ప్రతిభువం కలయేననూనమ్.

ద్వితీయ సర్గాంత గద్య...

శ్రీభోజో నిజగోత్రకారణ భరద్వాజో నివృత్యాన్వయా
ద్య శ్రీవేంకటపత్యమాత్య తిలకాజ్జాతో ఽక్కదేవవిభో
శ్రీశేషాచలపత్యభిఖ్య కృతినా స్త్వాంధ్ర వాక్పాణినే
కావ్యే భోసల కోసలేంద్రచరితే సర్గే ద్వితీయాఽభవత్.

పై యుదాహృతులనుబట్టి 'ఆంధ్రపాణిని' యనబరగిన శేషాచలకవి శహాజీ మహారాజుచే కనకాభిషేక మహాసత్కారమును నాందాళికాది విశేష బహుమానములను పొందిన వాఁడనియు

నీతని గోత్రము భారద్వాజ గోత్రమనియు, తల్లి అక్కమ, తండ్రి వెంకటపతి యనియు స్పష్టమగుచున్నది సంస్కృతాంధ్ర భాషల యందేకాక అష్టభాషల యందీతఁడు కవిత్వమల్లగలఁడని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. లలితగతి శాహరాజ విలాసమనెడు
నాటకము సేయు బుధులు సంతసమునొంద
ధీచమత్కృతి వెలయు శేషాచలపతి
అష్టభాషా విశేషంబులమరు సుకృతి

ప్రస్తుత మీతని కృతులు మూడు కాన వచ్చుచున్నవి. 1. శాహరాజ విలాసము, 2. సరస్వతీ కళ్యాణము, 3. ఆంధ్ర వ్యాకరణము. ఇందులో మొదటి రెండు తెలుగు మూడవది సంస్కృతము. సరస్వతీ కళ్యాణము తాను రచించినను గ్రంథ కర్తృత్వము శహాజీ మహారాజు పేరఁబెట్టినాఁడని ముందు తెలిపితిని. పైవిషయము నుబట్టిచూడగా మనకవియగు శేషాచలపతియు ఆంధ్రపాణిని యనబడదగిన శేషాచలకవియు నొక్కరేయైనచో శేషాచలపతి తండ్రి వెంకట పత్యామాత్యుడనియు అతఁడు చొక్కనాధునియొద్ద మంత్రిగ నుండెడివాఁడనియు నియోగి శాఖను చెందినవాడనియు గ్రహింపవలసి యున్నది.



## 346. బాలకవి సుబ్బన్న

ఇతడు తంజావూరు మహారాష్ట్ర రాజగు శాహాజీమహారాజు నాస్థానమందుండి, లీలావతీ శాహారాజీయ మను యక్షగానమును పంచకన్యాపరిణయం బను యక్షగానమును రచియించెను.

శ్రీకృష్ణుండు సుదామునితో కందుకక్రీడ నాడగా నందు సుదాముండోడిపోవుటయు నందుపై నాతండు మఱునాడు వచ్చి యాడి గెల్చెదనని యనుటయు నతనియభిలాష తీర్చుటకై శ్రీకృష్ణుండు మార్గమధ్యమున నైదుగురు బాలికామణు లెదురుగాంగా వారిని జూచి మోహించి, వారినైదుగురిని దనకు సమకూర్చుమని శ్రీకృష్ణుండు సుదాము నడుగుటయు నాతం డట్లుచేయ శ్రీకృష్ణుండు వారిని బరిణయమాడుటయుం బంచకన్యా పరిణయమందలికథ. ఈకథను నాటక మొనరింపుమని శాహామహారాజీకవిని ..

"నతిశయంబున కృష్ణుం డలరించె నసిడి
కతల మించిన పంచకన్యల పెండ్లి
బాలకవీం ద్రాంధ్రభాషచే నీవు
చెలిమిగను పట్టి మెఱయ నీ వేళ
మాకు నంకితంబుగా మంజునాటకము
వేడుకతో రచియింపు సుకవీంద్రు లెన్న"

అని ప్రోత్సహించెను.

లీలావతి యనుకన్యను శాహామహారాజు పరిణయమాడిన కథ లీలావతి శాహారాజీయమునం జెప్పంబడినది. ఆనాటకమందలి కృత్యాది పద్యమును కైవారమును, ఈక్రింద నుదాహరించుచున్నాడను.

సీ. శ్రితజన స్వాంతవారిజ మత్తరోలంబ
గురుతర స్తవనీయ గుణ కదంబ
హార హీరపటీర శారదాభ్రనిభాంగ
విమల కృపాపాంగ వృషతురంగ
త్రిపుర దానవ మదద్విరద మృగాధీశ
భాసుర హాస కైలాసవాస
కరధృతశూల మార్కండేయ నుతిజాల
వహ్నిలోచన ఫాలవ్యాఘ్రచేల

తే. భుజగకేయూర దుష్కృతాంబుద సమీర
శైలరాట్చాప నూతన శశికలాప
అఖిలలోకేశ కోటిసూర్యప్రకాశ
నీకు వందన మొనరింతు నీలకంఠ !

కైవారం. శ్రీమన్మహాదేవ సేవాధురీణ ... ... ... ...
సీమంతినీ నూతన పంచబాణ కనకనగధైర్య, నిరుపమ మహాదాన
దీక్షా ధురంధర, దీపాంబికా గర్భశుక్తి స్ఫురన్మౌక్తికాకార దివ్య
తర కేయూర, చోళభూమండలాఖండల సుకవిరాజమండల, యనేక
మహారాజ కలశపారావార పూర్ణిమా సుధాకర హితవర శ్రీకర,
సంగీత సాహిత్య విద్యావిలోల శాహాజీమహారాజ పరాకు! సరికవు
లెన్న బాలకవిసుబ్బన్న మేలిమిమీఱ హవణించిన లీలావతీశాహా
రాజీయం బను నాటకంబు నటనపటిమ గనుపింప వినుపించెదము,
దత్తావధానుండవై విన నవధరింపుము.

ఈబాలకవిసుబ్బన్న యేకులమువాఁడో, యేగోత్రమువాఁడో తెలియదు. ఈశాహామహారాజు తంజావూరు రాజ్యమును క్రీశ ౧౬౮౪ మొదలు ౧౭౧౦ వఱకును బరిపాలించినవాఁడు. కావున నీకవియు నా కాలమునందున్నవాఁడు. శాహామహారాజు కూడ కవియే. ఆతని చారిత్రము నీగ్రంథమున వేఱొకతావున వ్రాసి యున్నాఁడను.



## 347. సత్యవోలు భగవత్కవి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు; భరద్వాజగోత్రుఁడు; జనార్దనమంత్రికిని పేరమాంబకును బుత్త్రుఁడు; భగవనామాత్యునకును పేరమాంబకును బౌత్రుఁడు.

ఈకవి రుక్మిణీపరిణయమను నాల్గాశ్వాసముల ప్రబంధమును రచియించి తిరుపతి వెంకటేశ్వరస్వామి కంకితము చేసెను. ఆగ్రంథ కృత్యాదియందుఁ గవి తనవంశమును దన కవితాసామర్థ్యమును వర్ణించిన యెనిమిది పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. ఆ భరద్వాజ మహాముని గోత్రాబ్ధి
చంద్రుఁడు సద్గుణసాంద్రుఁ డఖిల
భోగ దేవేంద్రుండు పూజితోపేంద్రుండు
సంతత దాన నిస్తంద్రుఁ డనఁగ
నెంతేని వెలయు ననంతుఁ డా మంత్రికి
వేంకటాంబకు జగద్వినుతకీర్తు
లాదిత్య విస్ఫూర్తు లతిపుణ్యమూర్తులు
సుతు లుదయించిరి సూరనార్య
వరుఁడు నారాయణుఁడు భగవంతుఁ డనఁగ
ముగురు త్రేతాగ్ని కల్పులా ముగురిలోన
వంశవర్ధనుఁ డాభగవంతుఁ డలరు
భవ్యగుణ భావ్యభగవత్ప్రభావుఁడగుచు.

క. ఆ భగవన్మంత్రికి సతి
యై భాసిలుచున్న పేరమాంబకుఁ దనయుల్

వైభవ విఖ్యాతనయులు
శోభనగుణు లుదయమైరి జోగిప్రముఖుల్.

సీ. వేదశాస్త్రపురాణ విద్యానురాగియై
భోగియై విలసిల్లు జోగిమంత్రి
సంగీత సాహిత్య చాతుర్య ధుర్యతా
నంతుఁడై వెలయు ననంతరాజు
రాజవిద్వద్బంధు పూజితుం డభియాతి
మర్దనుండలరు జనార్దనుండు
సకలధర్మక్రియా సరసానుకంపాంత
రంగుఁడై యుప్పొంగు లింగసచివుఁ

డనఁగ ననఘాత్ములానల్వురజుని మొగము
లోయనఁగ విష్ణుబాహువులోయనంగఁ
గాయములుదాల్చు వేదములో యనంగ
నలరిరందు జనార్దనుం డధికుఁడయ్యె.

చ. వలనుగ సత్యవోలి కులవర్ధనుఁడైన జనార్దనుండు ని
ర్మలయశుఁడైన నట్కుదుటి రామన సూరమ పుత్రికం గృపా
కలితను రామచంద్ర వరగంగన సోదరిఁ బేరమాంబ నిం
పలర వివాహమయ్యె నమృతాబ్ధిసుతం గమలాక్షుడుంబలెన్

చ. హరిహయవైభవుండగు జనార్దనమంత్రికిఁ బేరమాంబకు
న్వరమున నుద్భవించితిమి వాసిగ రిర్వుర మగ్రజుండు సు

స్థిరవిభవుండు సూరనప్రసిద్ధుఁడు నేమ్మదు సంస్కృతాంధ్ర శా
స్త్రరకవితా చమత్కృతి విశారదుఁడన్ భగవత్కవీంద్రుఁడన్

క. శ్రీ లక్ష్మీనారాయణ
లాలిత పదరుచి పిచండిల స్వాంతుఁడెఁద
లీలాకటాక్ష వీక్షణ
మాలాలబ్ధాఖిలార్థమతి మతి మంతుండన్

క. ధీరత శత శతకంబులుఁ
దారావళులున్ దశావతారావళులుం
జాహూదా హారణంబులు
శ్రీ రాజిత దండకములుఁ జెప్పినవాఁడన్

క. అల లక్ష్మీనారాయణు
లల మేల్మంగయన వేంకటాద్రీశుఁ డన
న్వాలసిరి గావున వారల
కెలమి సమర్పణము సేతు నీకృతి భక్తిన్,

ఈకవి నివాసము గోదావరిమండలములోని రామచంద్ర
పురము తాలూకా యందలి జన్నాడ యను గ్రామమయినట్లు
తెలియుచున్నది ఆగ్రామమున సత్యవోలు వారిప్పుడున్నారు.
వారాగ్రామమునకుఁ గరణములు ఆగ్రామము మానివాసమయిన
కపిలేశ్వరపురమునకు వాయువ్యదిశయందు నాలుగుమైళ్ల దూర
ములో నున్నది. కాని భగవత్కవినిగూర్చి చెప్పఁగలిగిన వారెవరును
లేకపోయిరి.

కవితంత్రియైన జనార్దనమంత్రి నడకుదుటి ీమన్నకల్లుఁడై
నట్లు పైపద్యములోఁ జెప్పియున్నాఁడు. ఈ రామన గోదావరి మండల

మండలి కాకినాడ సమీపముననున్న శహాపురము నివాసి. ప్రభు లింగలీల మొదలగు గ్రంథములను రచించిన మఱియొక రామనకవి శహాపురము నివాసియు గరణమునై యుండెను. ఆయన క్రీ శ. ౧౮౨౧ సంవత్సరమున జన్మించినట్లాతని చరిత్రమునఁ గనుగొన నగును. ఈప్రాంతములయందు తండ్రిపేరు కుమారునకుఁ బెట్టెడి యాచారమున్నది. కావున నీరామనకవి పితామహుని పితామహుఁ డైన రామనయొకఁడుండెననియు నీ జనార్దనుఁ డాతని కల్లుఁడనియు నూహించితిమేని క్రీ. శ. 1700 ప్రాంతమున జనార్ధనమంత్రియు, 1730 సంవత్సరప్రాంతమున భగవత్కవి నుందురనియు నూహింపఁ దగియున్నది. రుక్మిణీపరిణయ కావ్యమునకుఁబీఠిక వ్రాసిన నడకుదుటి వీరరాజుపంతులుగారును కవియీ కాలమువాఁడేయని యభిప్రాయపడి నారు. కవి చరిత్రకారులగు బ్ర శ్రీ. వీరేశలింగము పంతులుగారు, క్రీ. శ. 1899 సంవత్సరములో "ఈతఁడు గోదావరిమండలములో నించుమించుగా నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండినవాఁడు ఇతఁ డేనుగు లక్ష్మణకవి మొదలగువారితో సమకాలీనుడఁని చెప్పుదురు. కవిత్వము నందల్పదోషములు కొన్నియున్నను, మొత్తముమీఁద నీతని కవిత్వము మృదుమధుర పదగుంభితమయి రసవంతమయి కావ్యముగా నున్నది". అని వ్రాసియున్నారు.

శ్రీమహాభాగవతమందలి రుక్మిణీకళ్యాణకథను గైకొని ప్రబం ధములను రచించినవారు (1) ఈ భగవత్కవి (2) కూచిమంచి తిమ్మకవి (3) లింగనమఖకామేశ్వరకవి (4) కోటీశ్వరుఁడు.

ఒకరి కవిత్వముతో నింకొకరి కవిత్వమును బోల్చి అందొక దానికంటె నొకటి మంచిదనియుఁ జెడ్డదనియుఁ జెప్పుటవలనఁ బ్రయోజనము లేదని తలంచియు, గ్రంథవిస్తరభయమునను, ఆ

గ్రంథములయందలి పద్యములనిట నుదాహరించలేను. ఈభగవత్కవి యీగ్రంథమున రచియించిన దండకమును మిగుల మనోహరముగా నున్నది.

ఈకవి దశావతారములను వర్ణించుచు పదునాలుగు సీస పద్యములను రచియించి యీగ్రంథమునఁ జేర్చి యున్నాఁడు. బ్రాహ్మణసంతర్పణములయందు భోజనకాలమున నీపద్యములను దఱచుగా జదువుచుందురు. ఈపద్యములను గ్రంథవిస్తరభీతి యున్నను, నిటనుదాహరించి యీతనిచరిత్రమును ముగించెదను. ఇతఁడు నూఱు శతకములనురచించినట్లు పైనిచెప్పియున్నాఁడు గాని యందొకటియు ముద్రితమైనట్లు కన్పట్టదు.

సీ. విరజా నదీపరివృత సప్తసాలావృత
పరమ భాగవత పదకుంఠ
వైకుంఠ భువనభవనసవనాద సం
స్తవనాద పవనాద తల్పమున జ
గత్కల్పనా కల్పకల్పుఁడవై కుడి
కాలుకుంచి యెడమ కాలు సాచి
కుడిచె య్యనంతుని యొడలిపై నెడమచే
య్యెడమ జానువునందు నిడి వెనుకటి
కరయుగంబున శంఖచక్రములు మెఱయ
సిరి భువియు నీళగొలువ భాసిల్లు నిను భ
జింతు వైకుంఠనాథ లక్ష్మీసనాథ
రక్షణ పరాయణుండ నారాయణుండ

సీ. మొగము శంఖము మీసములు గదాఖడ్గము
లొప్పులసు చక్రము వాలమును శార్ఙ

ముగఁ బూని మగ మీనమూర్తివై మెఱసి పా
తాళ మొరసి తటస్థలి దొరసి యు
రసి "స్వయంతీర్ణః పరాంస్తారయతి" యను
నోజగానీది "యత్యుచ్ఛ్రియఃప
తనహేతు" వని నిశాటునకుఁ దెల్ప ఘుభాల్లు
భాల్లుభాల్లు నగసిపడుచుఁ గదలి
గచ్చుకొని వచ్చు క్రుచ్చుమై వచ్చి శ్రుతులు
దెచ్చి విధికిచ్చినట్టి నీహెచ్చువినుతి
సేతు వైకుంఠ ... ... ...

సీ. అమృతవారాశి ఘటము మందరము కవ్వ
ము ఫణిరజ్జువు సేసి పూర్వదేవ
తలు దేవతలు వట్టితెఱవఁగా ఘుమఘుమ
ధ్వనుల బ్రహ్మాండము తల్లడపడు
నపుడు "పరోపకారార్థమిదంశరీ
ర" మని కూర్మావతారమునఁ గ్రుంగి
న గిరిక్రిందనిలిచి "నానోదకసముదాన"
మనియింద్రాదుల కమృతమిచ్చి
నిరుపమాన లక్ష్మీరమణీమణీమ
ణులుగలిగి విలసిల్లితౌ నలఘుదాన । శీల వైకుంఠ ...

సీ. హిమగిరి గేరుదేహము వజ్రములతీరు
రోమములు ప్రళయార్కులసరి కను
గవయు బ్రహ్మాండముఁ గబళించుముట్టె పా
తాళముఁ బెకలించు దంష్ట్రియొప్పఁ
గ వరాహమూర్తివై కదిసి హిరణ్యాక్షు
గర్భ నిర్భేదివై భూర్భువస్సు

వర్ణయచ్ఛేదిపై వారాశి మగ్నభగ్న
వసుంధరోద్ధరణ ప్రమోది
పై జగతి "యతోధర్మస్తతోజయ" యను
వచనము నిజముఁ జేసిన వర్ధమాన | కీర్తి వైకుంఠ

సీ. ఎంతచదివిన రవంతకులాచార
"ధర్మమెఱుఁగఁడని తనకుమార
కుఁ డయిన ప్రహ్లాదు నొడిసి పట్టి తెగ
నఱుక వచ్చినట్టి హిరణ్యకశిపు
కట్టెదుట నినుపకంబము పటపట
పగలఁ బొగ లెగయ భగభగయను
పెనుమంట చిటచిటయను మిణుగురులు బ్ర
హ్మాండమునిండ బ్రహ్మాదులు గడ
గడ వడఁక నల్గడల వెడలి కెవ్వు
నార్చి రిపు నేర్చివట్టునేలినట్టి శ్రీనృసింహా వైకుంఠ ...

సీ. అదితికశ్యపులకు "నంగుష్ఠమాత్రః పు
రుష" యనువచనము రూఢిసేయ
వామనమూర్తి నవతరించి వడుగువై
గొడుగు జందెము పచ్చగోచిపంచె
పంచశిఖలు మౌంజిపాలాశదండము
కృష్ణాజినము చెంబునిట్టి వేష

మమర "నణోరణీయాన్మ హతోమహీ
యా"న్నన్న వేదవాక్యము ప్రసిద్ధి
బడబలికడను బుడమి మూఁడడుగులడిగి
త్రిభువనం బాక్రమించు వర్ధిష్ణువని భ। జింతు వైకుంఠ

సీ. జమదగ్ని గర్భవాసమున బుట్టి వివిధ
విద్యాతపోధనుర్విద్యల కధి
పతివై ప్రబలి "యిదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర"
మన్ని మునిరాజ చిహ్నముల శాప
చాపనై పుణిఁ జూపి పాపభూపతుల శ
తాతకఠోరకుఠార ధార
నస్రధారా ప్రవాహములుగా శతధా స
హస్రధా ఖండించి యానదులను
దర్పణము భూమి దేవతార్పణమును
జేసిన పరశురామ వేషివని నిను భ। జింతు వైకుంఠ

సీ. సూర్యవంశము పరిశుద్ధమని దశర
థుఁడు కుమారమనోరథుఁ డని భరత
లక్ష్మణశత్రుఘ్నులకు నన్నవై పుట్టి
సౌందర్య చాతుర్య సౌకుమార్య
శౌర్యధైర్యౌదార్య వీర్య ధౌరంధర్య
గాంభీర్య కర్తుమకర్తు మన్య
థాకర్తుమతి సమర్థత్వ సత్యాఘట
ఘటనాపటీ యస్త్వ ఘనయశస్త్వ

సౌఖ్యసఖ్యదయా ముఖ్యశాలివైన
రామునిసరాముని గుణాభిరాము నిను భ । జింతు వైకుంఠ

సీ. బ్రహ్మానుగన్న పరబ్రహ్మమూర్తివై
యాద్యంత శూన్యుండవయ్యు "ధర్మ
సంస్థాపనార్థాయ సంభవామి యుగే యు
గే" యటంచును దేవకీతనయుండ
వై బలరామ సహాయుండవై శిష్ట
రక్షణమును దుష్టశిక్షణమును
సలుపుచు రుక్మిణీసత్యభామ సుదంత
భద్ర కాళింది జాంబవతి మిత్ర
వింద లక్షణయును బదార్వేలనూర్గు
రంగనలుగొల్వ వెలయు కృష్ణాహ్వయప్ర । సిద్ధవైకుంఠ

సీ. త్రిపుర దైత్యులను మిత్తికి బుత్తి సేయం ద
లంచి తదీయాంగనల వతిజృంభ
కుచకుంభ పరిరంభగుంభనరంభాతి
రుస్తంభకుంభదూరుభునబభున
బింబబింబాధర పీడన తాడన
దంతక్షత నఖక్షతప్రముఖ ర
తుల వతులం గతులం గలసి మెలసి విల
సిత తద్వ్రతక్షతిం జేసి జేసి
కంటి గొంటమ్మువై మింటంగంటక త్రి
పురచరులం గాల్చికూల్చిన బుద్ధగుణప । వృద్ధవైకుంఠ ...

సీ. కలియుగాంతమున దుష్కర ముష్కర తురు
ష్క చండాల పతిత పాషండ మండ
లీ ఖండితాఖండ భూమండలము జూచి
క్రమాశ్రమ వర్ణార్ణవాశ్రమపర్ణి
తటమున బ్రహ్మవిద్యాబ్రాహ్మణునకుఁ బుట్టి
వైపుట్టి యుత్తమాశ్వాధిరూఢుఁ
డవయి జోడుదొడిగి డాలుకత్తి కమాను
పూని పూనిక మీఱఁ బుడమిఁ బొడమి

నట్టిదుష్టులఁ జెండి చెండాడనున్న
కలికిమూర్తి గుణస్ఫూర్తి కలితలలిత । కీర్తి వైకుంఠ

దండకము : శ్రీరస్తు తుభ్యం నమో లక్ష్మి లక్ష్మాయితాపుయ్య
దాక్షిణ్య లీలా విశాలాక్షి నిత్యోత్స వాకుంఠ వైకుంఠ లోకాంత
రైకాంతి కాంతఃపురోదార మందార కుందార విందాభి రామా
సమారామ చంచత్సుమా మంద నిష్యంద మాకరంద ధారా సుధా
సార కాసార తీరావనీసాంద్ర చంద్రోప లోత్సేధ సౌధాంత రానంత
పర్యంక నిశ్శంక హేలాజగత్కల్పనాకల్ప సంకల్ప పారీణ నారాయ
ణోరస్థలీ మందిరే పాహి మా మిందిరే చందిరేణాభి రామాంత
సీమంత సీమాంతి కస్పంద మానేందు తారాను రూపాహి తాశేష
భూషావిశేష ప్రభాసంస దాకంప శంపాలతాలాలి తాదభ్ర
నీలాభ్ర జాలభ్రమాయత్త మత్తద్విరేఫాలకే క్షీరవారాశి రాడ్బా
లికే మాలికాకారవ త్కల్పవల్లీ మతల్లీ సుమస్వచ్ఛ గుచ్ఛాను
బద్ధాను విద్ధప్రబుద్ధో త్పటీమత్కటీరంగ రంగన్నటీభూత శాతాసి
ధారాక రాళీభవచ్చాళికే విశ్వసంజీవనీమాలికే శైలీకాలాలిత

భ్రూలతా చాపలీలాసమారోప రోపాకృతిన్యస్త నిస్తుల్యకస్తూరికా మేఘరేఖా నిరాఘాట లాలాటభూషా విశేషచ్ఛలానేక లోకైక దీపాంకురే వభ్రమపంకేజభూశంకరే కింకరీభూతభూత ప్రపంచాభిరక్షాతి దక్షావదీక్షా మహాభాగ్యసౌభాగ్యవాటీక వాటీభగవత్కక్ష లోల్లక్ష్మ పక్ష్మాంచి తారుణ్య తారుణ్య కారుణ్య లీలాసుధాలోల కల్లోల వల్లోచ నాళీక నాళీక శోభాభిరామే నమద్దివ్యరామే రమే సంజనుఃఖంజ నశ్రీతు లానంజ నస్వంజ నాపాంగ వీక్షాలినీశాలినీలీ భవత్క్రమ భ్రమాధరశ్రీధురాఘ్రాత రాగీభవత్సుంద రాస్యేందు నిష్యంద దుద్వేలహేలాసుధాబిందు మాలాసముల్లాస ముక్తా ఫలావాసభాసా విలాసే సరోజాతవాసే లసత్కర్ణసంకీర్ణ నానామణీ మంజరీ పింజరీ భూతశోభా నిరాతంక తాటంక జంభాజ జంభారి ముఖ్యామరస్తోమ రక్షానుశిక్షా ప్రతిజ్ఞా కృతిజ్ఞాప నేచ్ఛాల గత్సార సోమే కపోలస్ఫురత్పత్రరేఖాలలామే సమోభ్రాజితోమే లసద్వీటి కాపాట లోదంత దంతావళీ దాడిమీబీజ తేజ స్ఫుటస్మందహాసా మృతావాసబింబామ్రతామ్రాధర గ్రాసవాంఛా మనోహృద్య మాద్యచ్ఛుకీకోకిలా కాకలీ రావ శిక్షాపరీక్షా చమత్కారగాధా సుధామాధురీమాధురీణప్రవీణానులాపే చిదానందరూపే దురాపే లసత్కంబుకంఠా వలంబామరాహార ధారాతులాధారహీరాగ్ర ముక్తామణీగ్రామణి హారనీహార మాలాల సద్బోధు నీసాధు నీరేజ కోశప్రకాశ స్త నన్యస్త కస్తూరికాపత్రచిత్రక్రియారంభ సంరంభ శుంభత్పరీరంభ గంభీర నారాయణే వేదపారాయణే. తారహారాయ నానూననానామణీశామణీ యప్రభాచారు మేరూపమారూపమాభా

సమాన స్తనాభోగ భాగ త్రుటత్కంచుక ప్రాంచలాచంచలా రాళ కాళత్త్రళీచాతురీ ఛాతురీ యోత్తరీయాంబరాడంబరాలంకృతాంసే పదాక్రాంత దిక్కాంత కాంతావతంసే ప్రశంసోచిత ప్రాసరాహిత్య సాహిత్య సారస్వతస్తుత్య చాకచ్చకీనూత్న రత్నాంగద స్ఫారశృంగార దానిక్వణత్కంకణాభంగు రాభాంగుళీయావళీ ముఖ్య నానావిధాకల్ప కాకల్పవంతాదు మందార వల్లీలసల్లీల సద్వల్లరీతుల్యరీతి త్రిలోకీ వరాభీతిముద్రా సముద్రాజదున్నిద్ర భద్రప్రభాసద్మదోః పద్మపద్మే నమస్తేస్తు పద్మే సుపద్మాసనే పద్మసంవాసనావాస నవ్యాంగతారుణ్యపుణ్యాపగా కేవల శ్రీవలచ్ఛైవల శ్యామరోమావళీసంగరంగత్తరంగావళీ శ్రీవళీ విభ్రమే నాభితోయభ్రమే సభ్రమాలోక లోకత్రయీ శూన్యతాసంశయాశంసిలీలావలగ్నావలగ్న శ్రితానికనైకార్తిలుంటాక ఘుంటాక నస్మేఘులామేఖు లాలిత్య రేఖావరాభూవృతామందమందాకినీసైకత శ్రీకతాంచత్కటీమండలాలాఖండవన్యైనగస్నిగ్ధధాతుసంపాతశంపాతటి స్ఫీతపీతాంబరేకీర్తిసంకాశితాశాంబరే శంబరారాతిమాతస్సమస్త ప్రశస్తామర స్వస్త్యసాధారణాధారనారాయణ ప్రాజ్యసామ్రాజ్య సింహాసనాస్తారవిస్తార చేలోప మాలోప మాత్సర్యవజ్జాఘనశ్రీఘనాపార సంఛాదన ప్రాంశుదీప్రాంశుక ప్రాంశుకామర్శ రానర్శ భంగీతరంగీ భవద్భవ్యదాగద్ధగీ భూమధూమోరుధామోరుసంరంభరంభాసమానే పరంభాసమానే సమానే నవీనచ్ఛవిస్వచ్ఛసందర్శనాదర్శరారాజదవ్యాజతేజస్సమాజప్రమాజన్మజానుస్థలాదస్థలా శ్రీశుభాణప్రమాణోరుతాచారుతాశాలిశాలీన గర్భాకృతిజ్ఞప్తికృద్దీప్తి సంఘాతజంఘాతరంగోధతాగూఢతామాఢగుల్ఫప్రగల్భప్రభాపాదపాదస్థలీవాదఝుంకారకాంకారసత్కింకిణీమం

జమాంజీరశింజారవైభవసద్గారవే స్ఫురవా సారశాసారవాటీవిశాసా
రవాటీకఘాటీరిరంసాల్పహంసావృతిస్ఫీతసంజాతకంజాత మంజూపమా
శంసకాహంసకశ్రీపుర న్నూపురస్వంగుళీయాంగశాలంక్రియా సాంద్ర
మంద్రస్వనావాసకోపాసక స్వాంతచింతామయధ్వాంత నిష్కృంతఖ
ద్యోతవిద్యోతమానాంశు మానాంశుకప్రాంచ లాంఛన్మణిశ్రీపదశ్రీప
దాంభోరుహే దృక్సముద్యద్ద్యుసద్భూరుహే భీరుహేలావతిస్వర్గ
జాక్రీడితప్రేడిత క్రీడిత ప్రీడితాళీమరాళీ నిరాళీకృతాహార్ని శావాస
సేవాసమాయాసనందర్శ నానంద తిష్యందయా నోపదేశాపదేశా
భిలాషారసత్క్షేపముద్రాసముద్రాజితాంతశ్చికీర్షాబ్జవన్యా సవిన్యాసథ
న్యాసమానాంఘ్రిపాతోద్దిధృత్యాన మోహాభ హేలాకభావాకలద్దే
వతా కోటికోటీరకోటీరరత్నాచిరత్నప్రభా జిస్ర్వాజిసీరాజితేపద్మినీ
రాజితేరాజితాహార్యవర్యాంబురుట్పాణివాణీమరుత్స్త్రీరవాణీ మునిశాలి
వేణీ పురాణీకృతప్రక్రియాతార్క్ష్యపచర్యాసపర్యాసపర్యాయమార్యాత
చంచద్విపంచీప్రపంచీభవద్గీత నమ్రోత్సదసమ్మోదరస్మేరధారాసుధార
ప్రభాయోగ్యసౌభాగ్యభాగ్యప్రభాపాంగరంగత్కృపాపీటికే సప్త
లోకీశుభాసిక సంధుక్షణేదుర్మనశ్శిక్షణే జ్ఞానవైరాగ్య భక్తిప్రపత్తి
క్రియాయోగః తాన్యథ స్వాధారలింగస్థలీనాభిహృత్తాలుక భ్రూశిర
స్థానభాస్వచ్చతుష్షడ్దశ ద్వాదశద్వ్యష్టకద్వ్యర్థరాజద్వర్ణసంయుక్తహా
సారచకాంబుకుట్కర్ణికామండలాఖండ తేజోమయస్ఫారనారా
యణోరస్థలోపాస్యలా స్యాతిఫేలే పయోరాశిలీలే వయోరాసి
లీలే దయానంద హేలే నయామందశీలే పదాబ్జాతరేఖానిమజ్జన్న
మజ్జంతుసంతానికే మల్లికాకుంతసంతానికే సత్కృపారూపసంతానికే
లక్ష్మిమాం పాహిమాం పాహి తుభ్యం నమస్తే నమస్తే నమః.

## 348. రేపూరి అనంతనార్యుఁడు

ఈతఁడు వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు కౌండిన్య గోత్రుఁడు; కాళహస్తి కవికిఁ బౌత్రుఁడు లింగ కవీంద్రునకుఁ బుత్త్రుఁడు; కాళహస్తి కవి, ఏకామ్రకవి, గుర్వకవి, శివానందకవి, అనువారలీతనికిఁ సోదరులు. ఈకుటుంబకవులు రచించిన గ్రంథములేమియో తెలియలేదు. అనంతనార్యుఁడు గాధేయోపాఖ్యానమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, సేలముప్రభువగు కృష్ణభూపతి కంకితముచేసెను. ఈగ్రంథముయొక్క యసమగ్రప్రతులు రెండు శిధిలావస్థలో మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నవి. అయిదవ యాశ్వాస మొక్కటియు, మదరాసునందలి శృంగార గ్రంథమాలవారు ప్రకటించిరి.

కవి వృత్తాంతము గాధేయోపాఖ్యానము నందలి యీక్రింది సీసపద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. ఘనమాని కులమాన్య కౌండిన్యగోత్ర ప
    విత్రు నాపస్తంబసూత్ర మహిత
గతి శౌరి రేపూరి కాళహస్తి కవీంద్ర
    పౌత్రు లింగకవీంద్రపుత్రుఁ గాళ
హస్తిమహాకవి యనుజన్ము నేకామ్ర
    కవి శిఖామణి గుర్వకవితిలక శి
వానంద సుకవుల యగ్రజన్ముని ఘటి
    కా శత గ్రంథసంఘటన రేఖ.

నీ శతక లేఖ్య కవితా ప్రకాశకుని ది
    ప్రబంధనింధను నను ననంతు

దనరు రుచిరబోధ యుతమ నోవనరుహమునఁ
దనరు నెనరునఁగనుఁగొని యనియెనిట్లు.

ఈకవి అన్నయైన కాళహస్తికవిని, ఆతని శిష్యుఁడును, మిత్ర విందాపరిణయ గ్రంథకర్తయునైన కుందుర్తి వెంకటాచలకవి, మిత్ర విందాపరిణయమునం దీక్రింది సీసపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. అష్టభాషామహితాశుప్రబంధ ని
　　　　ర్మిత చాతురీధుర్య శతసహస్ర
లేఖినీలేఖ్య కవిత కవిత్వాపాఠ
　　　　నాహ్వృత వ్యస్తాక్షరాది చతుర
జలజహ్వికాచలాచల జిహ్వికాచల
　　　　జిహ్వికా రచనా విశేష నిపుణు
నోష్ఠ్యనిరోష్ఠ్యవర్ణో దీర్ణకల్పనుఁ
　　　　గఠిన త్రిపాద సంఘటన కుశలు

నఖిల లక్షణ లక్ష్యసిద్ధాంత పాణి
నీయ కాణౌదకాపిలానేక తంత్ర
కోవిదుని రేపురికులాబ్ధి కుముదబంధుఁ
జెలఁగి మదిఁ గాళహస్తి దేశికుభజింతు.

ఈ కుందుర్తి వెంకటాచలకవి విజయరంగ చొక్కనరపాలు నిచే బహుమతుల నందినవాఁడు. చొక్కనరపాలుఁడు క్రీ. శ. 1706—1732 వఱకును మధుర రాజ్యమును పరిపాలించినవాఁడు కావున ననంతనార్యుఁడును, అన్నయైన కాళహస్తికవియు నాకాలము వారని తలంపవచ్చును.

కవి తండ్రియును గృతిపతి తండ్రియును గూడ గవులైనట్లును, వీరిరువురును సేలముపట్టణ నివాసులైనట్లును కృతిపతి పల్కులుగా జెప్పిన యీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది

మ. తనరన్ మజ్జనకుండుఁ ద్వజ్జనకుఁడున్ దారావళీ దండ కా
ద్య నవోద్యద్భవదీయ చాటుకృతులం జూదావళీ దండ కాం
చన కీర్తుల్ గని కాంచనాంబర గజాశ్వగ్రామభూపాదులం
దని యన్నిన్ను బహూకరించిరి గదా తాత్పర్య ధుర్యాత్ములై

చ. సుమతులకెక్కు నీదు మృదుసూక్తులయందు మరందకందళిం
బమరుట యెంతవింత వినుమా వినుమా బిరుదంబు నెంచుమా
కమిత రసానుసార సముదార భవత్కృతి కన్యకాపతి
త్వము సమకూర్చుమా మతి పితామహ తామహనీయవర్తనా

క. ముఖ్యా ద్యర్థ రతిస్తుతి
సౌఖ్యావహ సంస్కృతాంధ్ర సందర్భోద్య
ద్వ్యాఖ్యాతిగ గాథేయో
పాఖ్యానము కృతియొనర్పుమా మాకెనయన్.

కృతిపతియైన కృష్ణభూపతి, కంబళ కులమునకుఁ జెందిన చతుర్థ కులజుఁడై నట్లీక్రింది సీసపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. ముల్లోకములయందుఁ గల్లోలవతి
తనయందు సముత్పన్నయై చెలంగ
నాదిత్యమండలం బహారహంబును దన
సన్నిధానము సారెసారె కోర

దోషాకర ప్రభాస్తోమంబు తనచేత
నపనీత మగుచుండు నధిగమింప
ఆశ్రితాళులఁ జేర నరిగెడు నెడల భ
వ్యాసక్తి తనకు నవ్యాహతముగ
గీ. చిత్ర చారిత్రమైన లక్ష్మీకళత్ర
చరణ శతపత్రమునఁ దుర్యజాతి కుశల
దుర్యరీతి జనించెనందు నుతిగాంచె
గంబళంబను సత్కర్మఫలము.

గాధేయోపాఖ్యానమునఁ గృతిపతి వంశమును వర్ణించుచు జాలపద్యములు వ్రాసియుండెను కాని యందుఁ జారిత్రమున కుప యోగించు నంశములు లేవు. కృతిపతి యాదవరాయ స్థాపనాచార్యుం డును, గంగువాడ హాదినెంటు మన్నియర గండాంకుండును, గామాం బికా, చిన్నభూపాల ప్రభుతపఃఫల ఫలాభ్యుదయుండు నయినట్లు చెప్పఁబడినది.

బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు గాధేయోపాఖ్యాన మేకాశ్వాస ప్రబంధమని వ్రాసియున్నారు కాని యది పొరపాటు. ఈతని కవిత్వము హృద్యమై యనవద్యమైయున్నది అని శ్రీ పంతులుఁగా రభిప్రాయ మొసంగి యున్నారు. పంచమాశ్వాస మందలి రెండు పద్యములనిట వ్రాయుచున్నాఁడను.

ఉ. ఏయెడఁ జింతవంత యొకయింతయు స్వాంతము
పొంతలేని మా
కీయెడఁ గాంతరో! పొడమె నెంతయుఁ జింతయు వంతయు
న్నికాం

తాయత భంగి నేమి గతమా వినుమా వినుమానికంపు జో
డై యిల గాధిసూనుఁడు తపోధిక తందన వేఁడిఁ జూపెడిఁ గ్రియ

ఉ. ఓ మునిసార్వభౌమ! యెడలోమక నీమకరాంక రూపరే
ఖా మహనీయ భావమిటు కానన చంద్రికఁ జేసి గాసితో
నేమని యీతపో నియమ మీవనమధ్య నివాస మీసము
ద్దామ విరక్తియుం బడసి తారెడు నామది కందెడుం గదే!

గాధేయోపాఖ్యానము నైదాశ్వాసముల ప్రతి సంపూర్ణమైనది ఆంధ్రసాహిత్య పరిషత్తులో నున్నది. విశ్వామిత్రుఁడు వశిష్ఠుని కామధేనువు నడుగుట — అతనిచేతి రక్కృతుఁడగుట — యీర్ష్యాళుఁడై ఘోరతపస్సు చేయుటయు, తంపోభంగమునకై మేనకా నియోగమును నిందలి యితివృత్తము.

గాధేయోపాఖ్యానమందలి మరియొకపద్యమునిట వ్రాయుచున్నాఁడను.

శా. ఏకాలంబున దీనిఁగట్టి విడ నీకెవ్వారలున్నారయో
మా కీలారమునందు దీనినిడినన్ మాకింపు సంధిల్లదో
నీకున్ వేఁడినవేళ నిచ్చి మనుడం దెప్పించుకోమో వృథా
మాకున్ గోపము రేఁచితిందుఁ దరమే మమ్మున్ని వారింపగన్

[ ఈ కవివతంసుడు వృద్ధాచల మహాత్మ్యమను మఱియొక ప్రబంధమును శేషార్యోదాహరణమును రచించినట్లు దెలియ వచ్చుచున్నది. ఇందు విషయమై నిడదవోలు వెంకట్రావుగారు దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయములో వ్రాసిన విషయమే యిట యెత్తి వ్రాయబడినది. pp. 471 ] — ప్రకాశకులు.

వృద్ధాచల మహాత్మ్యము :— ఇది కవులచరిత్రలోఁ జేర్పఁబడలేదు. ఇది లింగాజీరెడ్డి కంకిత మీయఁబడినది. ఈతని యింటి పేరు పంటవారు. వీరు శూద్రులు. ఈతని తండ్రి యల్లారెడ్డి. ఈతని రాజధాని వెంగనూరు. ఇతని భార్య యెల్లాంబికకు వృద్ధాచలేశ్వరుఁడు ప్రత్యక్షమై తనకు వెంగనూరిలో నాలయము కట్టింపుమని కోరినట్లామెవలన విని యాతనికి యాలయము కట్టించినట్లిందు వర్ణింపబడినది.

ఈ వెంగనూరు వెంగళమునకు సమీపమున "పెంబలూరు" తాలూకాలో నున్నదని తెలియుచున్నది. ఈ వెంగళము తిరుచునాపల్లి మండలములోనిది. కవి యీకృతి నాయకుని "బల్లవోల్ శాసనుఁడు, జగదగోవాళ, రాయవేశ్యాభుజంగుఁడు, పాండ్య గజకేసరి విశుద్ధ పంట వంశపావనుఁడు" మొదలుగాఁగల విశేషణములతో వర్ణించి యుండుటచే నితఁడుగూడ పాండ్యభూపాలుని సామంతులలో నొకఁడు. ఈతని గూర్చి పుట 348 లో చూడనగును. శైలిగాక పద్యము.

శా. ఆరూపంబుఁ గనుంగొన న్వలచి వేత్రి భోజముల్ మూసి యా
శౌరిన్ బ్రహ్మముఖామరుల్ ప్రణతులై స్వామీ కటాక్షింపవే
యీరూపంబు గనుంగొనంగఁ గలమే యేమెల్ల మాదృష్ట్యగ
మ్యారాధ్యంబగు రూపుఁ జూపగదవే యర్ధేందు చూడామణీ.

శేషాచార్యోదాహరణము :— నల్లందిగల్ వంశజుడగు శేషాచార్యుని ప్రశస్తిని వర్ణించు నీలఘుకృతిని బాలకవి అనంతయ రచించి నట్లుగా గ్రంథాంతమున నిట్లు గలదు.

క. చెలఁగు నుదాహరణంబిది
నలసన్నిభ బాలకవి యనంతయ నీకై
వెలయించి దీనిగైకొను
నలఘుసమున్నేమ తిరుమలాచార్యునిభా

ఈ యుదాహరణమును గూర్చి నేను రచించిన యుదాహరణ వాఙ్మయ చరిత్రపుటలు 157 నుండి 167 వఱకు చూడనగును. అందీ యుదాహరణము నాచేత పూర్తిగ ప్రకటితమైనది.

—*—

# 349. మాచవరము పాపనామాత్యుఁడు

ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు వేంకటాచల మంత్రికిని గొండమాంబకును బుత్త్రుఁడు; పాపయ యచ్చమాంబలకుఁ బౌత్త్రుఁడు; పెద్దనామాత్య జ్ఞానాంబలకుఁ బ్రపౌత్త్రుఁడు; ఇతఁడు నందవరచరిత్రమను రెండాశ్వాసముల పద్యకావ్యమును జేసెను. ఈకవి ముత్తాత వినుకొండసీమలోని యనంతవరమును, బెల్లముకొండ దేశములోని మాచవరమును ఏకభోగము మిరాశిగా ననుభవించినవాఁడని యాక్రింది మత్పద సీసమువలనఁ దెలియుచున్నది. ఈపల్లెలు రెండును ఓంకారనది కిరుప్రక్కల నున్నవఁట! ఈ యోంకారనదిచేఁ జెర్లలోక పోతేశ్వర స్థానమున జన్మించినదఁట! శిబిచక్రవర్తి కపోతమున కాశ్రియమిచ్చిన స్థానమిది యేనఁట

సీ. శ్రీమించు వినుకొండ సీమలో నల్ల య
నంతవరంబను నగర మొకటి
కొమరొప్ప బెల్లముకొండ దేశంబున
మానితంబై యొప్ప మాచవరము
గ్రామద్వయంబును గాణాచి యేక భో
గముమీఁద వెలసిన ఘనయశుండు
సుఁదరంబై యొప్పు నందవరీకుండు
శ్రీవత్సగోత్రుండు శ్రం...తి వరుండు
పెద్దనామాత్యుండు ప్రియురాలు జ్ఞానాంబ
వారికి జనియించె వరసుతుండు

పాపనామాత్యుఁ డనఁ బ్రఖ్యాతుఁడై యొప్పు
నాతనిభార్య శ్రీ యచ్చమాంబ

వారలకు ముగురు బుట్టిరి వరుస సుతులు
ముదముతోడుత వసుధఁ ద్రిమూర్తులనఁగ
నగ్రజుఁడు వేంకటాచలం బనెడు పేరఁ
బ్రణుతికెక్కెను విభవ సౌభాగ్యగరిమ.

ఈ మాచవరమునుబట్టియే, కవి గృహనామ మేర్పడి యుండును. ఈకవి కాలములో నికుటుంబమువారు మాచవరమును విడిచి క్షామ డాంబర కారణమునఁ గలువలపూఁడియను గ్రామమునకు వలసపోయిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పికొనియున్నాఁడు

శా. తద్దేశంబున క్షామడాంబరము విస్తారంబుగాఁ దోచినన్
మిద్దెల్మేడలు వస్తువుల్ దిగిచి కల్మింబోయి నానాజనుల్
పెద్దల్పిన్నలు సీమవెల్వడఁగ నేఁ క్షేమంబునం జూచి య
స్మద్దారాసుత పుత్రమిత్ర సహిత స్సంప్రీతితో వేడుకన్

క. వేంకటశైలము పొంతను
వేఁకటపతి కరుణచేత వేడుక మీఱన్
వేంకటగిరి సీమను నే
సంకటములు లేక రెండు సంవత్సరముల్.

క. కలువలపూఁ డను పురమున
నేలకొనియుండంగ నొక్క నిశిస్వప్నమునన్.

శ్రీ వెంకటేశ్వరుఁడు ప్రత్యక్షమై నందవరచరిత్ర రచియించి తనకంకితము చేయుమని యాజ్ఞాపింపఁగవి యట్లుచేసెనఁట. నందవరచరిత్రమునందు నందవరీకుల వృత్తాంతము చెప్పఁబడినది. నందుఁడను రాజొక యోగీశ్వరు నాశ్రయించి యోగపాగములను సంపాదించెను. అవి పాదుకలవంటివి. వానిపై నధిరోహించి తానెక్కడకుఁ బోవలయునని తలంచిన నచ్చటకతి శీఘ్రకాలములోఁ బోగలుగుదురు. ఆరాజు వానిసాహాయ్యమునఁ బ్రతిదినమును గాశికేఁగి గంగాస్నానముచేసి వచ్చుచుండెడివాఁడఁట! ఆవృత్తాంతము నెట్లో యాతనిభార్య యెఱింగి యొకనాఁడు తనను గూడఁ దీసికొనివెళ్ళుమని పట్టుపట్టెనఁట! ఎట్టకేలకు రాజందుల కంగీకరించి యామెను దీసికొని కాశికేఁగి గంగాస్నాన మొనర్చికొని తిరిగిరాఁ బ్రయత్నించునంతలో నామె బహిష్ఠ యయ్యెను. ఆదోషముచే యోగపాగములు పనిచేయవయ్యెను. రాజు విచారించుచుండ నచ్చటనున్న కొందఱు బ్రాహ్మణులాయుదంతమునువిని తమమంత్రప్రభావముచే నామెను బవిత్రగా నొనర్చిరి. రాజందులకు సంతోషించి పారితోషికమును గోరుఁడని యడుగఁ దమకప్పుడేమియు నీయనక్కరలేదనియు, నవసరము వచ్చినప్పుడు వచ్చియడిగెదమనియుఁ బ్రత్యుత్తరమిచ్చిరి. కొంతకాలమునకుఁ గాశియందు దుర్భిక్షము రాఁగా నాబ్రాహ్మణులు కొన్ని కుటుంబములవారు నందునికడకువచ్చి తామరుదెంచిన వృత్తాంతమును దెల్పి తమకొనర్చిన వాగ్దానమును జెల్లింపుమని కోరిరి. రాజు తాను వాగ్దానమొసంగిన మాట సత్యమేయనియుఁ దనకు సాహాయ్య మొనర్చినవారు మీరేయనుట కాధారము గన్పరుపుఁడనియు, నన, నాబ్రాహ్మణులు కాశియందు

తమకు వాగ్దాన మొసర్చినప్పుడున్న చౌడేశ్వరీ దేవిని, అచ్చట నున్న రెయికవృత్తమును దమ మంత్రప్రభావముచే రాజునకుఁ గన్పడునట్లు చేసి సాక్ష్యమిప్పించిరట! అందుపై రాజు సంతోషించి నందవర మను గ్రామమును వారికగ్రహారముగా నొసంగెను. వారు నందవరీకులని పిలువఁబడుచున్నారు. అందుఁ గొందఱు లౌకికవృత్తిఁ గైకొని నియోగులైరి వైదికవృత్తియందుండి వైదికులైరి. అల్లసాని పెద్దన, రాయని భాస్కరుఁడు, గుంటుపల్లి భాస్కరుఁడు మొదలగువారు నందవరీక నియోగులు. తాళ్లపాక కవులు నందవరీక వైదికులు.

ఈచరిత్రమునే యీపాపనామాత్యకవి యించుకమార్పుతో నీనందవరచరిత్రమునఁ జెప్పియున్నాఁడు నందవరము కందనోలు (కర్నూలు). సీమలోనిదని యీక్రిందిపద్యములలోఁ గవి వర్ణించి యున్నాఁడు.

సీ. అందమై విలసిల్లుఁ గందనోల్సీమలో
నందవరంబను నగర మొకటి
తత్పట్టణంబు సౌందర్యంబుఁ గొనియాడఁ
జిత్ర మెవ్వరికి విచిత్ర మరయ
సుందరంబగుచు సంక్రందనపురిఁ బోలి
యిందిరాదేవికి మందిరముగఁ
గడురమ్యమై చాలఁగర మొప్పుచుండును
గూపతటాకములొక్కమరుమిగులఁ

బంకజాకర విలసిత పద్మనికర
మధురమకరంద రసపానమత్త మధుప

సరస ఝుంకృత సంగీత సంతులంబు
నగుచు రంజిల్లు మిక్కిలి యవనియందు.

ప్రస్తుత మీనందవరము బళ్లారిమండలము నందలి యాదోని తాలూకా యందున్నది. కర్నూలు మండలమున నందవరమను గ్రామము లేదు. నందవరీకులు క్రమక్రమముగా బళ్లారి, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు మండలములలోనికి వ్యాపించి యున్నారు.

ఈకవి కాలము తెలియుట కాధారములు గ్రంథమునం గన్పట్ట లేదు. పదునెనిమిదవ శతాబ్దివాఁడై యుండును. ఈకవి కవిత్వ మంత ప్రౌఢమయినది కాదని బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. వారొసంగిన పద్యములనే కవిత్వశైలి తెలియుటకై యిటనుదాహరించుచున్నాఁడను.

మ. దివమందెల్లను రాజ్యభారముఁ దగందీర్చున్ మఱిన్ రాత్రులం
దవలీలనిజనిజాహ్నవీసలిలమందారూఢిగా స్నానమున్
సవిశేషంబుగఁ జేయుచున్ నిరత మీచందంబునన్ రాజపుం
గవుఁడంహోరహిత ప్రభావ తనుఁడై
గాంభీర్యమింపొందఁగన్ ఆ ౧

ఉ. ఒక్క మహానుభావుఁ డిటవచ్చి దయాంబు ముప్పతిల్ల న
ల్దిక్కుల దివ్యతేజములు దీటుకొనం గడు సత్ప్రభావుఁడై
మక్కువ యోగవాగమనుమంత్రము నాకుపదేశమిచ్చి తాఁ
జక్కఁగ నిచ్చి పాదుకల సంభ్రమ మొప్పఁగ నేగె నంతటన్
ఆ ౧

ఉ. నందవరంబు మాకును ఘనంబుగ నచ్చట ధారపోసెఁ ద
త్సుందరి దానుఁ గూడుకొని శుభ్రతరంబగు జాహ్నవీ జలం
బందులఁ గానవచ్చితిమి యాతనితోడుతఁ దెల్పి వేగమా
కుందగఁ జెప్పుమన్న ననుకూలత నచ్చెరియంబు
తోఁపఁగన్ ఆ ౨

ఉ. భూసురకోటి వచ్చుటకు భూపతి యాత్మఁ గలంగి దానముం
జేసితి మున్ను వీరలకు జేయులు గావునఁ దప్పిఁకన్ విప
ర్యాసముఁ బ్రత్యవాయమును రాఁగలదిచ్చిన విత్తహీనమా
మోసమువచ్చె నెట్లనుచు మోమొక యించుకవంచె
వంతతోన్ ఆ ౨

నందవర దానకాలము తెలియరాలేదు కవికాలము తెలియ వలనఁ ప్రస్తుతము నీతఁడు క్రీ. శ. 1700–1750 నడుమవాఁడని యనుకొందము.



# 350 కూచిమంచి తిమ్మకవి

కవిసార్వభౌమ బిరుదాంకితుఁడగు నీమహాకవి నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; గంగనామాత్య లక్ష్మనాంబికలకుఁ బుత్త్రుఁడు; తిమ్మయామాత్యుని పౌత్త్రుఁడు; బయ్యనామాత్యునకుఁ బ్రపౌత్త్రుఁడు; జగ్గన్న, సింగన్న, నరసన్న అనువారలీతని పితృవ్యులు; సింగన, జగ్గన, సూరన యనువారలీతని సోదరులు; వీరమ్మ, పాపమ్మ మేనత్తలు; గొట్టిముక్కుల రామయామాత్యుని కుమార్తెయైన బుచ్చమ్మ యీతనిభార్య గోదావరి మండలమునందలి పిఠాపురము సంస్థానములోని కందరాడగ్రామమీతని యునికిపట్టు. దెందులూరి లింగనారాధ్యుఁడీతనికి గురువు.

ఈమహాకవి రచియించినన్ని గ్రంథములను రచియించిన కవులు, ఆధునికులలో ఒకరిద్దఱుకంటె నధికముగ లేరు. ఇతని రచనములలో మనమెఱిఁగియున్నంతవరకు కట్టకడపటిదైన శివలీలావిలాసమునందలి యీక్రింది పద్యమువలన నీతఁడు రచియించిన పుస్తకముల నామములు తెలియుచున్నవి.

సీ. ప్రతిభమై రుక్మిణీపరిణయంబును సింహ
శైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కతయును రాజశేఖరవిలాసంబును
నచ్చతెనుంగు రామాయణంబు
సారంగధర నృపచరితంబు సాగర
సంగమాహాత్మ్యంబు రంగుమీఱ
రసికజనమనోభిరామంబు లక్షణ
సారసంగ్రహమును సర్వపురస

మంచితక్షేత్రకథనంబు మఱియుఁ బెక్కు
శతక దండక సత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకు
భక్తినర్పణచేసిన భవ్యమతిని.

ఈపద్యమునఁ బేర్కొనఁబడిన కావ్యములు పదియును శివలీలా విలాసమును, భర్గశతకము, చిరవి వశతకము, కుక్కుటేశ్వర శతకము అను మూడుశతకములును గలిపి మొత్తము పదులాలుగు పుస్తకముల నితఁడు రచియించెను.

రుక్మిణీపరిణయమునందుఁ దనజనకుని స్మరించిన ఈక్రింది పద్యమువలన నీతని వంశావళి తెలియఁగలదు.

సీ. గురుతర కౌండిన్యగోత్ర విఖ్యాతుండు
బయ్యనామాత్యుఁ డేభవ్యతాత
నిరతాన్నదానవర్ణిత యశస్సాంద్రుండు
తిమ్మనసచివుఁ డేధీరు తండ్రి
ఘనులు జగ్గనయు సింగనమంత్రియును నర
సన్నయు నేమంత్రి యనుఁగుదమ్ము
లలరఁ దిమ్మకవి సింగన్న జగ్గనయును
సూరన యేధన్యుసుతవరేణ్యు

లొనర వీరమ్మ పాపమేఘునుని సహజ
లతిప్రతివతి లక్ష్మి యేచతురురాణి
యట్టి శ్రీకూచిమంచి వంశాబ్ధిచంద్రు
మజ్జనకునలగంగనామాత్యుఁదలఁతు...

ఈకవి నివాసము కందరాడయైనట్లు లక్షణసారసంగ్రహము లోని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. కౌండిన్యగోత్ర విఖ్యాతుఁడఁ గూచిమం
చ్యన్వయాంబోధి నీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకుఁ బరమ పా
వనియగు లచ్చమాంబకును సుతుఁడ
వెరవొప్ప రుక్మిణీపరిణయంబును సింహ
శైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసము నచ్చ
తెనుఁగు రామాయణంబును మొదలగు

కృతులు రచియించి పార్వతీపతికి భక్తి
తోడ నప్పన మొసఁగినవాఁడఁ గంద
రాడపుర సంస్థితుఁడఁ గడుఁ బ్రోడ నేను
దిమ్మకవిచంద్రుఁడను జగద్విదితయశుఁడ

ఈకవి కాలమున పిఠాపురసంస్థానమును రావుమాధవరాయ భూపాలుఁడు పరిపాలించుచున్నట్లు రుక్మిణీపరిణయములోని యీ క్రిందిపద్యమువలనఁ గన్పట్టుచున్నది.

సీ చక్రవాళాహార్య జలధి తుల్యోన్నత
ప్రాకార పరిఖా విరాజితంబు
సాంద్రముక్తా సౌధ చంద్రశాలానేక
ధర్మనిర్మిత హర్మ్య శర్మదంబు

కరి సైంధవాందోళికా ధేను ధన ధాన్య
వన దేవ గృహాసవోవర్ణితంబు
విమల చాతుర్వర్ణ్య విద్వత్కవి శ్రేష్ఠ
భటనటామాత్య విస్ఫారితంబు

రాజమాహేంద్రవరదుర్గ రాజ్యభూరి
భార సంభరణాక్రాంత భాసమాన
రావుమాధవనృప పరిరక్షితంబు
భోగనికరంబు పీఠికాపురవరంబు

ఈపిఠాపుర సమీపముననున్న కందరాడయే కవి నివాసము. ఈకవియొక్క కడపటికాలములో ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని యుద్ధములు జరిగినందున కందరాడమీఁదుగా రాకపోకలు చేయుచు వచ్చిన సేనలదాడికి వెఱచి యాగ్రామమునువిడచి దానికి సమీపముననున్న చంద్రమపాలెమున నివాసము నేర్పఱచుకొనియెను. ఈకవికి పురుషసంతతి లేదనియు, నీకవివంశము వారిప్పటికిని చంద్రమపాలెము నందున్నారనియుఁ దెలియుచున్నది

ఈతనికాలముననున్న పిఠాపుర సంస్థానప్రభువగు రావునీలాద్రి మాధవనరపతి భాషాపోషకుఁడును గవులను పండితుల నాదరించినవాఁడునై వక్కలంక వీరభద్రకవిచే వాసవదత్తాపరిణయమును గృతి నందినవాఁడు కొన్నిగ్రంథములను రచించినపిమ్మట వానియందలి మాధుర్యమును గ్రహించి యాభూపాలుఁడు తిమ్మకవికిఁ గవిసార్వభౌమ బిరుదము నొసంగి గౌరవించినట్లు రసికజనమనోభిరామము నందలి ఈక్రింది సీసపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. నిఖిల విద్యాభ్యాస నిపుణుఁడు మత్సహో
దరుఁడగు జగ్గసత్కవి తనయులు
ఘనులు తిమ్మనయు, సింగనయును లేఖక
పాఠకులై కృతుల్ ప్రబలఁజేయఁ
బేర్మిఁ గాంచినవాఁడ బీఠపుర ప్రాజ్య
రాజ్యాధిపత్య విరాజమాన
భూరివైభవుఁడు నద్భుతపరాక్రముఁడును
దానశౌండుధురంధరుఁడునైన

రావు నీలాద్రి మాధవరాయనృపతి
చేతఁ గవిసార్వభౌమ విఖ్యాతబిరుద
మందినఘనుండఁ దిమ్మయాహ్వాయుఁడ నేను
విమలతరభక్తి మదిలోన విస్తరిల్ల

ఈకవి పిఠాపుర సంస్థానములోని గ్రామమునకుఁ గరణమై యుండియు, సంస్థానాధిపతిచేతఁ గవిసార్వభౌమ బిరుదమందిన వాఁడయ్యును తనగ్రంథములను నరాంకితముసేయక భగవదర్పితము చేసిన స్వాతంత్ర్యప్రియుఁడు. ఈతఁడు నరకృతి విముఖుఁడయినట్లీ క్రిందిపద్యములవలన స్పష్టముగాఁ దెలియుచున్నది

క. నృపులకుఁ గావ్యం బొసఁగిన
నపవర్గం బిడఁగఁగలరొ యటుగాకున్నన్
ద్విప తురగ భూషణాంబర
తపనీయాదికము చేతఁ దనుపంగలరో!

సీ. ద్విజపుంగవులకుఁ బ్రవేశింపఁగా రాని
పృథుగృహాంతరములఁ బ్రేమనుండి
కృతియంత ధర్మపద్ధతులెవ్వి యెఱుఁగక
ధరణిపై నడువఁ బాదములు లేక
దుష్క్రియల్ చేయు మంత్రులు చెప్పినటులె మీఁ
ఱకనటింపుచు ద్విజిహ్వకలు గలిగి
వితతంబుగా వక్రగతులచేఁ బొదలుచుఁ
బూనియే ప్రొద్దును బుస్సురనుచు

గాఢరోషవిషానలోద్గారఘోర
వక్త్రములుగల్గి దుర్మదవర్తులగుచుఁ
జెలఁగుచుండెడు భోగిరాజుల భజింప
గుటిలతరబుద్ధి నెవ్వాఁడు కోరగలఁడు

క. పనిపూని తుచ్ఛభోగం
బునకై కొఱగాని జనులఁ బొగడుటయెల్లన్
గనుఁగొన నిహపరదూరం
బని తలఁచి వినిర్మలాంతరంగుఁడనగుచున్.

సింహాచల మహాత్మ్యము.

చ. విను మఖలేశమర్త్యులకు వేడుకఁ గావ్యమొసంగి ధాత్రిపై
నొనరఁగ సౌఖ్యసంపదల నుద్ధతులై సుకవీంద్రులుందు రా
ర్యనికరవంద్య నీవిహపరంబుల సౌఖ్యమొసంగుసామివం
చును మది నెంచి నీకు సరసుల్ విని మెచ్చఁ బ్రబంధమిచ్చెదన్.

రాజశేఖర విలాసము.

ఈతఁడు రచించిన గ్రంథములలో సారంగధర చరిత్ర ద్విపద కావ్యము. తక్కినవన్నియుఁ బద్యకావ్యములు. పద్యకావ్యములలో నీలాసుందరీ పరిణయము, అచ్చ తెలుఁగు రామాయణము అనునవి యచ్చతెనుఁగు కబ్బములు. మిగిలినవి మిశ్రకావ్యములు. ఈ మహాకవి రచనములలో సింహశైలమాహాత్మ్యము, సాగరసంగ మాహాత్మ్యము, చిరవిభవశతకము అనునవి నాకు లభింపలేదు.

ఈకవికి, దెందులూరి లింగనారాధ్యుఁడు గురువైనట్లు కొన్ని గ్రంథములలోఁ దెల్పియున్నాఁడు. అచ్చ తెలుఁగు రామాయణము నందాతనిని నుతించిన పద్యము నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. ఏమేటియడుగుఁ గెందామర బల్గాఁపు
 రఘు టేల్లి తేని కబ్బంపుఁ దెప్ప
యే బల్లిదుఁడు చెవినిడు నక్కరములు చె
 ల్వాపు ముత్తిమేడకు వరుసమెట్టు
లే ఘన్నములగని యెఱిఁగించు మేల్త్రోవ్వ
 కల్ల జగంబు చీఁకటికి దివ్వె
యేదంట యొసఁగునువ్వ్బదిదోసఁపుదుల్వ
 గాడ్పుదిండులకు వాకట్టుమందు

తే. తనరనే పెద్దపుట్టువులనుకడింది
తవులునకు వెజ్జు తేఁడట్టి దెందులూరి
కొలఁపు పాలేటి నిండుజాబిలి యనంగ
దనరు లింగనగురుని డెందమునఁ దలఁతు...

తిమ్మకవి యారాధ్యుని శిష్యుఁడే కాని లింగధారి కాఁడు. శివభక్తుఁడే కాని కేశవదూషకుఁడు కాఁడు. రాజశేఖరవిలాసాది శైవగ్రంథములను, రుక్మిణీపరిణయాది కేశవమాహాత్మ్య ప్రతిపాదక గ్రథంములను గూడ రచియించినవాఁడు. ఈతని గ్రంథములలో జాలభాగము పిఠాపురమందలి కుక్కుటేశ్వరస్వామికే యర్పణము చేసినను సర్పపురమాహాత్మ్యమును సర్పపురమందలి భావనారాయణస్వామి కంకిత మొనర్చి తనసమానభావమును వెల్లడించినాఁడు.

భావనారాయణస్వామి కవికి స్వప్నమున సాక్షాత్కరించి "చాలకృతుల్ఈశ్వరున కర్పించియున్నాఁడవు మాకొక్క చక్కని కృతి రచించి యర్పింపు" మని కోరిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహ
శైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును, రాజశేఖరవిలాసంబును
నచ్చతెనుంగు రామాయణంబు
సారంగధర నరేశ్వరచరితంబు స
ప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణ
సారసంగ్రహము నింపారఁ గూర్చి

కృతులు శంభునికి నిడిన సుకృతివి నీవు
ప్రతిభ మెఱయంగ నొక్కసత్కృతి రచించి
మాకునర్పణచేయు మమ్మాది దలిర్పఁ
దిమ్మకవిచంద్ర ముదితసుధీకులేంద్ర.

ఈకవి రచనములలోఁ గొన్నిఁటియందు గ్రంథరచనాకాలమును జెప్పియున్నాఁడు. కొన్నిఁటిలో నట్టికాలమును వేయలేదు. ఇతని ప్రథమకావ్యము రాజశేఖరవిలాసమని కొందఱును, రుక్మిణీపరిణయమని కొందఱు ననుచున్నారు. కవుల చరిత్రకారులు రుక్మిణీపరిణయమునే మొదట రచించెనని వ్రాసియున్నారు. కాని రాజశేఖరవిలాసమే ప్రథమరచన మని నాయభిప్రాయము. ఇందు రేఫద్వయమైత్రి, వ్యాకరణ మంగీకరింపని ప్రయోగములు గనఁబడుచున్నవి. అట్టివి రుక్మిణీపరిణయము నందంతగా లేవు. రాజశేఖరవిలాసమున దనకది ప్రథమప్రయత్నమని సూచించెడి యీక్రింది పద్యములను గవి వ్రాసికొనియున్నాఁడు.

క. ఛందమునుం గావ్యాదుల
చందము నింతైన నెఱుఁగ సతతము విద్వ
ద్బృందంబుల కృపఁ గవితా
సందర్భంబొగినొనర్తు సాహసవృత్తిన్

చ. ఎనయఁ బ్రసూనదామ మెవరేక్రియఁ గూర్చిన నందుఁగల్గు వా
సనలకుఁగాదె మానవులు సంతసమందుదు రవ్వినట్టి పా
వనతర శంభుభక్తియను వాసనకు న్మదిమెచ్చి మత్కృతిం
గనుగొని తప్పులెన్నక తగం గరుణింపుఁడు సత్కవీశ్వరుల్.

గీ. తప్పులున్న యెడల నొప్పులుగా నెంచి
పూని కావ్యమొనరఁ బూర్తి చేసి
కరుణ మీఱ మాకుఁ గామితార్థములెల్ల
ఘనతనొసఁగి యేలుకొను గిరీశ

సీ. అనుచు సూతుఁడు నైమిశారణ్యవాసులై
యలరుచుండెడు శౌనకాదులకును
రమణీయ బసవపురాణోక్తమైన యీ
భల్లాణరాయభూపాలచరిత
వినిపించు క్రమమును బనిమీఱ నానేర్చు
విధమున రచియించి విమలభక్తి
దనర మీకొసఁగితిఁ దగ మీర లిందుల
తప్పుల క్షమచేసి దయదలిర్ప

నిమ్మహాకావ్య మెప్పుడు నిద్ధరిత్రి
నేర్పుతో విస్తరిల్లి బుధేంద్రు లెల్లఁ
బొగడ నాచంద్రతారార్కమగుచునుండు
నటుల నొనరించి మముఁ బ్రోవుమయ్య శర్వ.

ఇట్టిపద్యములు రుక్మిణీపరిణయమున లేవు. కావున రుక్మిణీపరిణయముకంటె రాజశేఖరవిలాసమే ముందు రచియింపఁబడినదని నాయభిప్రాయము. సింధుకటక దేశాధీశుఁడగు భల్లాణుఁడను రాజు శివభక్తిపరాయణుఁడై జంగము లేమి యర్థించినను లేదనకుండ యిచ్చెదనని శపథము చేసెనని నారదుని మూలమున విని యీశ్వరుఁడాతని బరీక్షింప నెంచి జంగమవేషధారియై వచ్చి, యానాడు విటునితోఁ గలసియుండని వేశ్యను దెప్పింపుమని రాజునడిగి యాదినమునఁ దాను ఆపట్టణమందలి ప్రతివేశ్య యింటను విటుఁడై యుండుటయు రాజు విటునితో నుండని వేశ్యనుగానక, తనభార్యను వేశ్యావేషముతో జంగముకడకంప నీశ్వరుఁ డాతనిభక్తికి మెచ్చి యాతని

భార్యహస్తమున బాలుఁడై యాదంపతులకు మోక్ష మొసంగినకథయే యీ రాజశేఖరవిలాసమున వర్ణింపఁబడినది. ఈకథ నెందఱో కవులు ద్విపదగాను, పద్యకావ్యముగాను, దండకముగాను ననేక విధముల రచియించియున్నారు.

రాజశేఖరవిలాసమునకుఁ బిమ్మట రచించినది రుక్మిణీపరిణయము. పేరునుబట్టి యిందలికథ తెలియుచునేయున్నది. యౌవనమున రచించినదగుటచే నీప్రబంధమున శృంగారరసము నధికముగాఁ జూపుచు నైదాశ్వాసముల ప్రౌఢకావ్యముగా రచించియున్నాఁడు. ఇందు పీఠికాపుర వర్ణనము నీక్రింది పద్యములలోఁ జేసియుండెను.

సీ. పాదగయాక్షేత్ర పరమపవిత్రంబు
పురుహూతికాంబకుఁ బుట్టినిల్లు
యేలానదీజలావృత తటాకానీక
మఖలశక్తులకు విహారభూమి
తోరంపులవణపాథోనిధి తీరంబు
నిర్మల గౌతమీ నికటసీమ
కుంతిమాధవదేవు గురుతరస్థానంబు
విలసిత భీమమండలతలంబు

తే. సేతు కాశీ ప్రయాగాద్యశేష దివ్య
తీర్థరాజంబులందుఁ బ్రతిష్ఠఁగాంచి
సకలదోషాపనోదకశక్తి నలరు
పుణ్యసారంబు పీఠికాపురవరంబు.

ఈకావ్యమును శా. శ. 1637 (క్రీ. శ. 1715) అగు మన్మథాబ్దమున రచియించినట్లు కవి యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆరయ శాలివాహన శకాబ్దముల ద్రిగుణాంగ చంద్రులం
బేరగు మన్మథాబ్దమునఁ బ్రేమఁ బ్రబంధ మొనర్చి మీకిటుల్
చేరికతో సమర్పణముచేసితి నీకృతియాతమిస్రను
తైకరవ మిత్రతారకముగా భువిఁ జెల్వగుఁగాత శంకరా!

రుక్మిణీపరిణయమును సత్యవోలు భగవత్కవి, లింగనమఖ కామేశ్వరకవి, కొప్పర్తి నరసన్న, మణిగొండ వెంకటరమణ, రావూరి సంజీవరాయకవి ప్రబంధములుగా రచియించియున్నారు. అన్నిఁటిలో తిమ్మకవి రచనమే మేలుగానున్నదని తలంపఁబడుచున్నది.

ఈకవి మూఁడవరచనము సింహాచలమాహాత్మ్య మయిదాశ్వాసములు కలది. ఈగ్రంథమునకుఁ బిమ్మట నీలాసుందరీ పరిణయమను మూఁడాశ్వాసముల యచ్చ తెనుఁగు పద్యకావ్యమును రచియించెను కృతిపతియైన కుక్కుటేశ్వరస్వామి స్వప్నమునఁ గన్పడి

మ. మును కబ్బంబులనెల్లఁ జెప్పి యెలమిం బొల్పొందుచున్ నాకు న
ప్పనముల్ చేసిన ప్రోడవీవిపుడు గూర్పంబూను నీయచ్చపుం
దెనుఁగుం గబ్బమునిమ్ము నిచ్చలపుబత్తిన్మత్తియున్ బుత్తియున్
నెనరొప్పన్ సమకూర్చు చెప్పుడును నేనీయొద్దనే యుండెదన్

అని యానతిచ్చెనఁట!

మిథిలాపట్టణమందలి కుంభకుఁడను గొల్లదొర తనయయగు నీలాసుందరిని శ్రీకృష్ణుఁడు బరిణయమాడినకథ యిందుఁ జెప్పఁబడినది. తిమ్మకవి యైదవపుస్తక మచ్చతెలుఁగు రామాయణము, రామాయణకథ నాఱుకాండములలో క్లుప్తముగా నించుమించు ౧౩౦౦ పద్యములలో సంస్కృతశబ్దము లేకుండ రచించెను. రెండు అచ్చతెనుఁగు కావ్యములను రచియించుటచే నీతని కభినవవాగనుశాసనుఁడను కీర్తి వచ్చెనని చెప్పుదురు.

ఈతని యాఱవకావ్యము ద్విపద సారంగధరచరిత్రము. ఇందలికథ సుప్రసిద్ధమైనది. కాని యిందలి చిత్రాంగి రాజభార్య కాదు. రాజరాజనరేంద్రుని భోగస్త్రీ. ఈకావ్యముఁ దనకుఁ గృతియిమ్మని యీశ్వరుఁ డడిగినట్లును, ఈకావ్యరచనాకాలమున రావు వెంకటకృష్ణారాయప్రభువు పీఠాపురమును బరిపాలించుచున్నట్లును, ఈక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

కరుణాపయోధి శంకరుఁ డొకనాఁడు
గురుతర కౌండిన్యగోత్ర పావనుని
వరకూచిమంచి సద్వంశసంభవుని
గంగనమంత్రి శేఖరునకు నుత్త
మాంగనయగు లచ్చమాంబకు సుతుని
శివపదాంభోజసేవానిరూఢ
కవితామహారాజ్య ఘనధురంధరుని
సకలలక్షణ లక్ష్య సాహిత్యవిదుని
నకలంక గానవిద్యా విశారదుని
రావు వేంకటకృష్ణరాయ విశ్వంభ

రావతపరిగుప్త రాజమహేంద్ర
వరదేశభాగ భాస్వద్దివ్యపీఠ
పురమహారాజ్య విభూషాయమాన
పావనకంద్రాడ పట్టణాధిపుని
శైవకళారహస్య విజ్ఞాననిధిని
ఘనులు మెచ్చఁగ ననేకప్రబంధంబు
లొనరించి విఖ్యాతి నొందిన ఘనుని
తిమ్మసత్కవి నామధేయుని నన్ను
నెమ్మదిఁ గృపఁజూచి నీవొనరింపఁ
దలఁచిన సారంగధర చరిత్రంబు
వలనుగా గృతిసేయవలయు మాకనుచు.

ఈద్విపదలవలన తిమ్మకవి కందరాడ గ్రామమునకుఁ గరణమనియు, మహాకవియేగాక గానవిద్యావిశారదుఁడుకూడ ననియుఁ దెలియుచున్నది. పుంభావసరస్వతియగు నిమ్మహాకవి యీసారంగధరచరిత్రమును రచించిన కాలమును గ్రంథాంతమున వేసియున్నాఁడు కాని శాలివాహన శకాబ్దసంఖ్యగల భాగము శిథిలమై పోయినది.

“టగు సౌమ్యనామ సంవత్సరమున
ధగ మాఘబహుళ సప్తమియును దివిజ
గురువాసరమునకు గొదలె నీభక్తి ”

అనుభాగము మిగిలినది. సౌమ్యసంవత్సరము శా. శ. ౧౬౫౧ (క్రీ. శ. 1729) అయినది. ఈసంవత్సరముననే యాతఁడు భర్గశతకమును రచియించిన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. ధరలో నెన్నఁగ శాలివాహన శకాబ్దంబుల్ దగన్యామినీ
కర బాణాంగ శశాంకసంఖ్యఁ జెలువై కన్పట్టు సౌమ్యాహ్వయ
స్ఫురదబ్దంబున నిమ్మహాశతకమేఁ బూర్ణంబుగావించి శ్రీ
కరలీలన్బుధులెన్న నీకిడితి భర్గా! పార్వతీవల్లభా...

ఈకవి రచించిన యేడవగ్రంథము సాగరసంగమమాహాత్మ్యము. ఇదినాకు దొరకలేదు. ఇతని యెనిమిదవగ్రంథము సర్వలక్షణ సారసంగ్రహము ఇది మూఁడాశ్వాసములు కలది. ఆంధ్రమున లక్షణగ్రంథములనేకములుండఁగా తానుమరల రచించుటేలయని శంకించుకొని కవియే యిట్లు సమాధానము చెప్పియున్నాఁడు.

గీ. తెలుఁగునకు మున్ను లక్షణంబులు మహాక
వీశ్వరులు పెక్కు రచియించియుండిరి కేల
గూర్చవలెనన్నఁ బ్రౌఢిమకొఱకు నాకుఁ
దెలిసిన తెఱంగు నొకకొంత తేటపఱుతు.

క. నన్నయభట్టాదులు కృతు
లన్నిలిపిన లక్ష్యములను లక్షణములు యు
క్తిన్నమకిఁ గృతియొనర్చుచు
మున్నుగ నాంధ్రంబు చందము న్వివరింతున్.

కవియనినట్లు కొన్ని క్రొత్తలక్ష్యలక్షణములిందుఁ జూపట్టుచున్నవి. ఇందలి మూఁడవయాశ్వాసమంతయు రేఫద్వయనిర్ణయమునకై ప్రత్యేకింపఁబడినది. ఈలక్షణగ్రంథమును శా. శ. ౧౬౬౨ (క్రీ. శ. ౧౭౪౦) రౌద్రిసంవత్సరమున రచియించినట్లు క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

గీ. శాలివాహన శకవర్షసంఖ్యకరర
సాంగ శశిసాంఖ్యలను రౌద్ర్యబ్దమునను
భాద్రపద శుక్లపంచమివఱకుఁ బూర్ణ
మయ్యె నీకృతి నిపేర నగసుతేశ !

ఈకవితల్లజుని తొమ్మిదవగ్రంథము రసికజనమనోభిరామము వసుచరిత్రమును బోలిన ప్రబంధమును రచింపవలయునను నుద్దేశముతోఁ గవి యీగ్రంథమును రచియించెననియు, దీనిని పిల్లవసు చరిత్రమని యనెదరనియు ప్రతీతి కలదు. మిగుల కష్టపడి తాని గ్రంథమును రచించినట్లు కవి యీక్రింది పద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

సీ. బహుపురాణములు ప్రబంధము ల్లక్షణ
శాస్త్రము ల్వివిధకోశములు నాట
కము లలంకారశాస్త్రములును శోధించి
ప్రౌఢిమై నేతత్ప్రబంధ మేనొ
నర్చెద నిందులోన నొకించుకొక్కెడఁ
బరికింప నెఱసులు దొరలియున్న
నెన్నికసేయక హితకరుణామతిఁ
గనుఁగొని సారంబె కైకొనుండు

తే. మంచితేనియ జనులు వేమఱు కడంక
నరసి వడపోసి యునిచిన నందులోన
నలుసు లౌకొన్ని యందందఁ గలుగకున్న
భవ్యమతులార ! కవిబుధప్రవరులార !

సీ. వళుల యొప్పిదమున వఱలు నాళయమ్ముదు
పద విభ్రమంబుల బాగుమీఱి
కవిత చంపకమాలికా సుకాంతిశ్రీల
సరసిజ ముఖవికాసములఁ దనరి
మహిత చమత్క్రియా మధుర వాగ్రచనల
శుభలక్షణారూఢి సొంపెసంగి
ప్రవిమల శృంగార భావ గౌరవమునఁ
గన దలంకారగ వైఖరులఁ జెలఁగి

తే. ప్రబలు మత్కావ్యకన్యకా రత్నమఖిల
రసికజన సంతత మనోభిరామమగుచు
నిందుకొను శ్రీపి నిర్ధరామండలమున
నసదృశ విలాసలీలల నలరుఁగాత.

ఆంధ్రభాషయందు పేరెన్నికఁగన్న ప్రబంధములలో నిది యొకటియై తనరారుచున్నదనుమాట నిశ్చయముకాని వసుచరిత్రముతో సమానమైనదని చెప్పుటకు వలనుపడదు. వసుచరిత్రమునందున్న కవితావైచిత్ర్యములు, ఔచిత్యము, యమకము, శ్లేష, పదగుంభనము లిందు లేవు అది యుత్తమోత్తమ ప్రబంధము. ఇది యుత్తమ ప్రబంధము

కళ్యాణపురాధిపతియైన ఋతుధ్వజనుహారాజు వయస్యునితోడ వాహ్యాళికేఁగి హిమాలయ ప్రాంతారణ్యమున మనోహరముగా గానము చేయుచున్న గంధర్వకన్య గానమును విని యచ్చోటుకుఁ బోయి యామెనుగాంచి మోహితుఁడయ్యు నామెను బడయఁజాలక విరాళింగొనుటయు, నామెయు ఋతుధ్వజుంగాంచి మోహించియు

చెలులమూలమున వటనుండి తొలంగి చని పిదప విరహవేదనం జెందుటయు, వారిరువురుఁ దుదకుఁ దంపతులై యొకకుమార్తెం గనుటయు, నాకుమార్తె నొక గుహయందుంచి యాగుహకెవ్వఁడు వచ్చి యామెను బలుకరించునో యాతఁడే యామెభర్తయని యామె కుపదేశించి తల్లి గంధర్వలోకంబునకుఁ బోవుటయు, ననేకవేలవత్సరము లాకన్య యాగుహయందుండి తపంబు సేయుచుండుటయు, గౌతముఁడను ముక్కులేని బ్రాహ్మణుఁ డొకఁడు దుష్పథంబునఁ దిరుగుచు కొన్నాళ్లకు విద్యసంపాదింపఁ గోర్కెకలిగి యాగుహకుఁ బోయి యామెవలనఁ దద్వృత్తాంత మెఱింగి, యామె తపోబలముచేఁ బండితుఁడై, నాసాయుక్తుఁడై యామెను బరిణయంబాడి తిరుగుచు వృద్ధభార్యయు, పడుచుమగఁడు ననిచూచినవా రాక్షేపణ మొనర్ప సహించలేక, సుహృద్దుల యుపదేశమున, గోదావరిమండలమందలి వృద్ధగౌతమి సాగరసంగమమున స్నానమొనర్చి యిరువురు సమవయస్కులై సెంపొందుటయు ననునది యీగ్రంథమందలికథ.

ఈగ్రంథమును శా. శ. ౧౬౭౨ (క్రీ. శ. ౧౭౫౦) ప్రమోదూత వత్సరమున రచియించిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

సీ. రహిమీఱ బ్రహ్మపురాణోక్తమగుచు గో
దావరీఖండంబు దనరు నందు
వృద్ధస్రవంతీ సరిత్పతీ సంగమ
మాహాత్మ్య మెపుడు సన్మహిమనదియె
రసికజనమనోభిరామంబ నెడుపేరఁ
దెనుఁగున శాలివాహన శకాబ్ద

ములఁ గరగిరిరసభూసంఖ్యఁ దద్దయు
వఱలు ప్రమోదూత వత్సరమున

తే. నీప్రబంధంబు రచియించి నీకొసఁగితి
నిందుశేఖర నీకృప నిది ధరిత్రి
నాసుధాకర తారార్కమగుచుఁ గవిజ
నోత్తముల యిండ్ల నే ప్రొద్దునుండుఁగాత!

ఈమహాకవి రచియించిన పదియవగ్రంథము సర్వపురమాహాత్మ్యము. మూఁడాశ్వాసములుగల యీగ్రంథమును శా. శ. ౧౬౭౬ (క్రీ. శ. ౧౭౫౪) భావసంవత్సరమున రచించితినని యీక్రింది సీసపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. వలనొప్ప బ్రహ్మకైవర్తపురాణోక్త
మై సర్వనగరమాహాత్మ్య మలరు
నది యేను శాలివాహనశకాబ్దంబులు
పాటింప వేయునార్నూటడెబ్బ
దాఱగు భావ మహావత్సరంబున
భావనారాయణ దేవదేవు
నానతివలన నిట్లాంధ్రంబొనర్చి యా
స్వామికి దేవతాచక్రవర్తి

తే. కర్పణం బొనరించితి నధికభక్తి
నిమ్మహాపుణ్యచారిత్ర మిద్ధరిత్రి
నాసుధాకర తారార్కమగుచు నజ్జ
నోత్తములయిండ్లనే ప్రొద్దునుండుగాత!

ఈసర్పవరము గోదావరిమండలమునఁ గాకినాడకు సమీపముననున్నది. ఈక్షేత్ర మెచ్చటనున్నదియు నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

తే. ఘడమి గోదావరికిఁ దూర్పుకడను దుల్య
భాగకు నుదక్తటంబునఁ బశ్చిమమున
వారిరాశికిఁ గోసెఁడుమేర సర్ప
పురమహాక్షేత్రమభిరామ గరిమ నలరు.

సర్పవరమునందుగల మూఁడుసరస్సులకథ లిందు వర్ణింపఁబడినవి. ఆదిశేషువు ఒకసరస్తీరమున శ్రీమహావిష్ణునిఁ గూర్చి తపముచేసి యాయనకు శయ్యాగానుండ నను గ్రహమును బడసిన సరస్సు అనంతసరస్సు అనఁబడును. దీనినిబట్టియే దానికి సర్పవరమని పేరువచ్చినది నారదుఁడు బ్రహ్మసభయందు విష్ణుమాయకు లోఁబడనివాఁడను తానొక్కఁడనేయని గర్వోక్తులఁ పలికినందులకై తత్ఫల మనుభవింపుమని బ్రహ్మచే శపింపఁబడి భూలోకమునఁ దిరుగుచు సర్పవరమందలి యొక సరోవరమున స్నానముచేయ నాతనికి స్త్రీరూపము ప్రాప్తమైనది. ఆసరోవరమునకు నారదసరసి యని పేరు. స్త్రీరూపధారియైన నారదుఁడు నికుందుడను రాజును పరిణయమై యాతనివలన నూర్గురు సంతానమును బడసి రణరంగమున భర్తయును సుతులును సమసిపోవ నేకాకినియై క్షుధార్తయై యచ్చట గన్పడిన చూతవృక్షమునందలి ఫలమును గోయఁబోయి యందక, తనసుతశవంబుల జేర్చిచూచినను ఫలమందక విచారించుచుండ శ్రీమహావిష్ణువు వృద్ధబ్రాహ్మణరూపమునవచ్చి యొకసరో

వరమున స్నానమొనర్పుమని చెప్ప నందు స్నానమొనర్పఁగానే స్త్రీ రూపముపోయి నారదుఁడై శ్రీమహావిష్ణువును నుతించెను. ఆసరసికి ముక్తిసరస్సు అని పేరు నారదుని ప్రార్థనముపై శ్రీమహావిష్ణు వచ్చట భావనారాయణ నామమున నెలకొనియుండెను. ఆసరోవర మాహాత్మ్య మెక్కువగా నిందు వర్ణింపబడినది.

ఈకవి రచించిన కడపటిగ్రంథము శివలీలావిలాసము ఇంచు మించుగ నాల్గువందల పద్యములుగల ఈకావ్యమును గవి ముప్పది యొక్కదినములలోఁ జేసెనని యీక్రింది పద్యములో వ్రాసికొని యున్నాఁడు.

క　వినుఁ డీకృతి ముప్పదియొక
　　దినమునకుం జెప్పినాఁడ దేవునియానన్
　　జను లెన్నఁ గుక్కుటేశ్వరు
　　ఘన కరుణాదృష్టివలనఁ గవివరులారా!

ఈగ్రంథ రచనాకాలము శా. శ ౧౬౭౮ (క్రీ శ. ౧౭౫౬) ధాతసంవత్సరమున రచియించిన యీక్రిందిపద్యమువలనఁ దెలియు చున్నది.

గీ　శాలివాహన శకవర్ష సంఖ్య వసుశ
　　గాంగశశిసంజ్ఞ నలరు ధాతాబ్దమునను
　　దగరచించిన యీకృతి ధరణియందు
　　నాసుధాకర తారార్కమగుచునుండు

ఈకవిచంద్రుఁడు రచియించిన కుక్కుటేశ్వరశతకమునందు ౯౨ పద్యములు మాత్రమే లభించినందున నాశతక రచనాకాలము తెలియలేదు. మొత్తముమీఁద నీకవి క్రీ శ. ౧౭౧౦ మొదలు

౧౭౫౬ వఱకు గ్రంథరచనమునందుఁ దనజీవితమును గడపియున్నాఁడు. శివలీలావిలాస ముద్రితప్రతిలో నా గ్రంథరచనాకాలము "వసునవాంగశశిసంజ్ఞ" అనియున్నది. కానియది పొరపాటు. "వసునగాంగశశి" అనుటకు మాఱుగా "వసునవాంగ" అని 'గా' యను వక్షరము 'వా' యని పడినది. ఈయక్షరభేదమువలన నిరువది సంవత్సరకాలము భేదించినది 'వసునగాంగశశి' యనగా ౧౬౭౮ 'వసునవాంగశశి' యనగా ౧౬౯౮. శాలివాహనశకము ౧౬౯౮వ సంవత్సరము ధాతకానేరదు. ౧౬౭౮వ ధాత అయినది. కావున వసునగాంగసశి యనుటయే సరియైన పాఠము.

శివ్వుఁడు గంగను జాలరివాని కుమార్తెవు గమ్మని శపించుటయు నామె భూలోకంబున కేఁగ, ఏలూరు పట్టణంబుననుండెడి జాలరివానికి లభించి వానియింటఁ బెరుగుటయు నీశ్వరుఁడు జంగమవేషధారియై యచ్చటకుఁబోయి యామెను బరిణయమాడుటయు మొదలుగాఁగల కథ యిందు వర్ణితమైనది.

ఏనుగు లక్ష్మణకవి, వక్కలంక వీరభద్రకవి, యీదులపల్లి భవానీశంకరకవి, అను నీమువ్వురు సుప్రసిద్ధకవులును, గోదావరి మండలవాసులు తిమ్మకవితో సమకాలికులు సుభద్రా పరిణయాది ప్రబంధ నిర్మాతయగు జగ్గకవి తిమ్మకవికి సోదరుఁడు. ఏనుగు లక్ష్మణకవి, తిమ్మకవి కవితామాధుర్యమును గూర్చి యీక్రింది పద్యమును జెప్పినట్లు ప్రతీతి కలదు.

క. హాటకగర్భ వధూటీ
లాటన చవితాంఘ్రిపూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మాకూచిమంచితిమ్మయ మాటల్.

లక్ష్మణకవి యనినట్లు తిమ్మకవి కవిత్వము తేనియ తేటయే. ఈతని కవిత్వము నందింత మాధుర్యముండుటనుగూర్చి యొకకథ చెప్పెదరు "ఈయన యక్షరాభ్యాసమునాఁడు తల్లి యాతని కభ్యంజనము సేయుచో నెత్తిని జమురుపెట్టి యంతలోఁ గార్యాంతరమున లోపలకేఁగి యాపనిఁ జక్కఁబెట్టుకొని వచ్చునంతలోఁ గుక్కుటేశ్వరస్వామి యాబాలు ననుగ్రహింపఁదలఁచి వృద్ధబ్రాహ్మణ రూపమునఁ బొడసూపి యిరువది గణుపుల చెఱకు నొక్కదానిం దెచ్చి యిచ్చి యదృశ్యుఁడుకాఁగా నతఁ డాచెఱకుగడను భక్షించుచుండిన వదిచూచి కొంచెమిచ్చుతక్కువగా నీతని యీడువాఁడెయగు నీతని తమ్ముఁడు జగ్గన యాచెంత నాఁడుకొనుచున్నవాఁ డాచెఱకు నొడిచికొని యాతఁడు దినఁగా మిగిలిన పదికణుపులను దాభక్షించెనఁట. దానంజేసి యాయిరువురకును నిక్షురసోపమగు కవితాధార కల్గెను"

ఈకథయందలి సత్యాసత్యము లెట్లున్నను నీతనికవిత యిక్షురసోపమని పోల్చిన పోలిక యెంతయు సత్యమయి హృద్యముగా నున్నది.

రసికజన మనోభిరామమందలి శృంగార వర్ణనములను చదివిన యొక వేశ్య, యీగ్రంథమును రచించినకవి యెంతరసికుఁడో చూతమనివచ్చి తిమ్మకవిని దర్శించి యాతనిని కౌఁగిలించుకొనె ననియు, నతఁ డందులకుఁ దనయయిష్టమును జూపుచు పెడమొగము పెట్టెననియు నందుపై నావేశ్య

చ॥ చతురులలోన నెంతయును జాణవటంచును నేను గౌఁగిలిం
చితి నిటు మాఱుమోమిడఁగఁ జెల్లునె యో రసికాగ్రగణ్య!

అని ప్రశ్నింపఁగా

అ ద్భుతమగునట్టి బంగరపు బొంగరపుంగవంబోలు నీ కుచ
ద్వితయము ఔొమ్మునాటి యలవీఁపున దూసెనటంచుఁ
జూచితిన్

అనితిమ్మకవి యాపద్యమును బూరించి యుత్తరమిచ్చెననియు నొక కథ వాడుకలో నున్నది. ఇందలి సత్యాసత్యనిర్ణయము పాఠకలోకమే చేసికొనునుగాక! ప్రశ్నోత్తరములతో నున్న యీపద్యము మనోహరముగా నున్నదనుటకు సందియము లేదు

ఈతిమ్మకవికి గురువైన దెందులూరి లింగయారాధ్యుఁడు గోదావరిమండలమందలి పుల్లేటికుఱ్ఱు నివాసియనియుఁ దమ మాతామహునకుఁ బ్రపితామహుఁడనియు విమర్శాదర్శక నడకుదుటి వీరరాజుపంతులుగారు, ఈఁదులపల్లి భవానీశ కవికృత ధర్మఖండము పీఠికలో వ్రాసియున్నారు. ఈలింగనారాధ్యుని 'అయ్యగారు' అయ్యగారు అని పిలుచుచుండెడివారనియు, నప్పటినుండియు నాతని వంశీయు "లయ్యగారి" యను గృహనామము గలవారనియు వీర రాజుపంతులు గారు వ్రాసిరి. ఇందుగుఱూర్చి అయ్యగారి వీరభద్రకవి చరిత్రమునఁ జర్చించియున్నాఁడను.

రాజశేఖరవిలాసము :—

మ. గురుపత్నిన్ వరియించు ద్రోహి తనుఁ గన్గోరాదటంచున్
సుధా
కరురాకల్ మదినెంచి పద్మిని సువక్త్రంబుం గడున్వంచె న
ట్లరయం బుణ్యవధూమణుల్ ధరణి నత్యంతో గ్ర
దోషాత్మునిన్
నరవిన్నన్గొన నొల్లకుందురుగదా చర్చింప నెంతేనియున్. ౧ అ

ఉ. ప్రేమఁ బడంతి యోర్తు మకరీమయపత్త్రమునంద మొప్పను
ద్దామగతిం గుచాగ్రములదానిడికొంచు వసించి యవ్విట
గ్రామణిఁ జూడఁ బయ్యెదఁ దిరంబుగఁ జేర్పక వచ్చెఁ
గాన్కలా
స్వామికి రత్నకీలిత సువర్ణపుబంతులు దెచ్చె నోయనన్ ౨ ఆ

చ. శివశివ! సేవ యెంతయును జేసినఁ గైకొనుఁగాని యావిట
ప్రవరున కించుకేనియును బాఱదు మోహము నెమ్మనంబునం
ద విలిపుడెంత లెమ్మనుచుఁ దా బతిమాలిననుంగఱంగఁ డీ
భువిఁ జలికూటిపై నిడినఁ బొందలరారెడు వెన్నకైవడిన్ ౩ ఆ

రుక్మిణీపరిణయము :—

చ. సరిసరి మీవిచారమిఁక జాలు శిరీషసుమోపమాన భా
సురసుకుమారయై సకలసూరిజనాభినుతోల్ల సద్గుణా
కరయగు రుక్మిణిం బసులకాపరికియ్య మదిం దలంతురే
గురుతర రత్నహార మొకక్రోఁతిమెడం దవిలింపఁ జూతురే ౧ఆ

శా. నీకుం జెప్పెడిదేమి భూమిసుర! యానీ రేజపత్త్రాక్షుతో
నా కార్యంబు సమస్తముం దెలిపి యానందంబు గావించి య
స్తోకానేకపవాహవాహినులతోఁ దోడ్తెమ్ము పొమ్మంచుఁ దా
నేకాంతంబునఁ గొన్నిమాటలపుడే యేర్పాటుగాఁ దెల్పినన్
౨ ఆ

శా. నీవున్నేమును గ్రీడసేయుదుము పూర్ణేందుశాలా మేడపై
భావింపన్మను పిన్ననాఁడు గనకాభాతిన్ హితంబయ్యె మా

త్రోవన్ రాకుము వద్దు వద్దికను నీతోఁ జెల్మి పల్కాటలునుం
గావింపం గొఱగాదు నీకొక నమస్కారంబు తారాప్రియా!
౩ ఆ

ఉ. కన్నియరూపవైభవము కన్నులఁ గట్టినయట్లయుండు వి
ద్వన్నుత రుక్మిసేయు నహితక్రియలన్నియు మున్నవిందు నిం
కెన్నియొ నేల భీష్మకనరేంద్రుని ప్రోలికివచ్చి వైరులన్
ఖిన్నులఁజేసి పోఁదటిమి నీలకచన్ వరియింతుఁ గూరిమిన్
౪ ఆ

శా. ఆదామోదర భోజకన్యలటు లన్యోన్యాననాలోక నా
హ్లాదస్ఫూర్తిఁ జెలంగ నంగజుఁడు ప్రత్యాలీఢపాదస్థుఁడై
కోదండంబు గుణధ్వనుల్ నిగుడఁ జేకొద్దిన్ వడిందీసి బల్
పూఁదూఁపుల్ పరఁగించె నిర్భరపయిన్ బుంఖాను
పుంఖంబుగన్ ౫ ఆ

నీలాసుందరీ పరిణయము :—

చ. కొలమును గల్మితాల్మియును గూర్మియుఁ దెంపును
జవ్వనంబునుం
జెలువము విద్దెయుఁ గానముఁ జేవయుఁ బ్రోడతనంబుఁ
దెల్వియుం
గలిగిన పిన్నపాపనికిఁ గన్న నిడం దగునంచుఁ దీర్పరు
ల్వాలుపుదురట్లు గావున వలంతిక నీకిఁకఁ జెప్పనేటికిన్ ౧ ఆ

ఉ. చక్కెరవింటిజోదు నెకసక్కెము లాడఁగఁ జాలు పక్కి రా
జక్కివజీరు చెల్వు చెవిఁ జక్కఁగ నాటిన నాఁటనుండి యు

మ్మక్కయదేమొ కాసి యెదనంటిన కూరిమి యంతకంతకున్
వెక్కసమై పెనంగొనుచు వేమఱుబాయదిఁ కేమిసేయుదున్
2 ఆ

తే. చెప్పవలసినలాగునఁ జెప్పినార
మింతెకాకిపుడెన్న మీకిరువురకును
గలుగు కూర్ములు గనుఁగొన్నఁ దెలిపినట్లు
మెలఁగుదురె యంచు నగుచు నమ్మొలఁతిలకుగ 3 ఆ

అచ్చతెలుఁగు రామాయణము :—

ఉ. వెన్నునిఁజూపుమంచుఁ బదివేలవిఠంబులఁ గన్నబిడ్డ ని
న్నిన్నకఁ బ్రక్కఁజేయు మిడిమేలపు నంజుడు దిండిరాచబ
ల్మన్నియఁ జెండవే బిరుసు మానిసి సింగపు మేనుపూనియో
యన్నపసిండిబొజ్జదొరకైన నినుం గొనియాడఁబోలునే.
బా. కాం.

తే. కోడలా యింక బంగారు గోడలేల
మేడలేటికి రతనంపు వాడలేల
మాడలేటికి బలుతాచజాడలేల
వాడలో నీవు ద్రిమ్మరనోడిచనిన అ. కాం.

ఉ. ఇంతకొఱంత యేల విను మేచిజగంబుల తాలుమాలుగా
వింతునొ ప్రొద్దవేఁడియుడిగింతునొ సంద్రములొక్కమాటు యిం
కింతునొ నల్వగ్రుడ్డులుడికింతునొ వేల్పులఁబట్టిబిట్టు దూ
లింతునొ కొండలెల్లఁ బెకలింతునొ నిక్కపుటుంగఁ జేయువే.
అ. కాం.

చ. తెఱవను జూపకున్నఁ దొలి దేవర ప్రేవులు ప్రోవులై పడన్
బెఱికెద నాదలల్దలఁగఁ బెట్టెద జుట్టులు వట్టి నేలపై
జిఱజిఱఁ ద్రిప్పికొట్టి మెయిఁజిప్పిలి నెత్తురు లుబ్బిపాఱఁగా
జఱజఱ నీడ్చివైచెద నసంగ దొసంగులనెల్ల ముంచెదన్
కి. కాం.

చ. జగములతల్లియై పుడమిజవ్వని గాదిలిపట్టియైన యి
మ్ముగుదలమిన్నఁ దెచ్చితివి మోసము ఱుంగక నీకు నెవ్వరుం
దగ దిదియంచుఁ దెల్పఁగలదంటలు గల్గమిఁ జేసి యిట్టి గీ
డగపడె నింకనైన విడనాడక రాముని ప్రాపుఁ జేరుమీ.
సుం. కాం.

మ. ఒరునింటం జెఱనున్న చేడియను లోనొక్కంతయున్నానలే
క రహిం జేకొనువాని నొల్లర రయంగా బల్లిదుల్బీరము
ల్నెరపంజాలెడు రాచమానిసి మదిన్నెవ్వేఁడి యిచ్చేఁత కే
కరణిం జొచ్చినపాట నొప్పదు నినుం గైకొంట మాకుగ్మలీ.
యు. కాం.

తే. అంత రాముఁడు వేడుక లలర నేల
చూలితోఁగూడి నెమ్మదిఁజొక్కి పెక్కు
జన్నములుఁ జేసి పజలనిచ్చలును బాడి
మెసఁగఁ బ్రోచుచుఁ జగమెల్ల నేలుచుండె. యు. కాం.

రసికజన మనోభిరామము :—

శా. పీటన్నాటిగనంగసంగర కళావిక్లాంత కాంతామణీ
కోటీపీనపయోధరాగ్ర వితతాంకూరన్నిదాఘోదక

వ్యాటీకాపహృతిక్రియారభటిఁబెంపారుం బ్రభాతంబునం
బాటీరాచలకూటనిర్గత జగత్ప్రాణార్భక వ్రాతముల్ ౧౯

మ. బలవద్దర్పక వీరకాహళరవప్రాయంబులై మించి సా ౨౦
పలరం బాంథనితంబినీజనఘనస్వాంతంబు లెంతేనియుం
గల చెన్నాల రసాలపల్లవలవగ్రాసావలేపోల్లస
త్కలకంఠ ప్రమదా నిరంతర కుహూకారంబులప్పట్టునన్.

మ పురముల్ద్రోయినఁ బోవనీ బుధులు తప్పుల్వట్టినం బట్టనీ ౩౯
తరుణుల్గుందినఁ గుందనీ ప్రజలు వంతంజెందినం జెందనీ
సరవార్నవ్విన నవ్వనీ సచివ! నేసత్ప్రీతి దద్దేవతా
హరిణాక్షీ నిబిడోపగూహన సుఖాయత్తుండనై యుండెదన్.

చ గురువరవర్ణినీమణినిగూడిన ద్రోహివటంచెతింగియున్ ౪౦
బరువడి లింగధారివని భావమునందలపోసి యేమిని
న్నిరిశుఁడు నెత్తిఁబెట్టుకొనెఁ గీడుదలంపక చంద్ర! యెట్టి దు
శ్చరితులనైనఁ బ్రోచుఁగద శంభుఁడహా! తనుఁగొల్చువారలన్

మ బిసినీకాంత వియోగసంజనిత గర్భీభూత తాపజ్వరో ౫౦
ల్లసదార్తింగృశియించుచున్న యెడఁ గల్యప్రాజ్ఞవైద్యుఁడు నే
గ్పునఁగం దత్ప్రబలోపతాపముడుపన్ హేలాగతిందెచ్చు బ
ల్లసిందూర పుటుండయో యనఁగ మార్తాండుండుదోఁచెన్
భువన్

సర్వలక్షణసారసంగ్రహము :—

తే.గీ. సంస్కృతపదంబుఁ దగ విశేషణము జేసి
సంధిగూర్పంగ నాలనుశబ్దమునకు

మొదల రేఫముగ దియును సదయురాలు
పుణ్యురా ల్గన్యురాలన భుజగభూష. ౧ అ

క. అబ్బుర మబుబర మ్రబం
బబ్బరము నటంచు గవుల యనుమతి వలనన్
నిబ్బరముగఁ బలుకందగుఁ
గబ్బంబుల యందు నచల కన్యారమణా ౨ అ

గీ. బీఱువోవుట గురురేఫ మాఱు మొగము
మాఱి మసగుటయును మాఱు మాఱడగుట
మాఱు వడుటయు నేమాఱు మాటలాడ
మీఱుటయు బండిఱాలుస మేరుచాప. 3 అ

శివలీలా విలాసము :—

చ. సరిసరి మంచి జాణవె విచార మిఁకేటికి నన్యకామినీ ౧అ
సురత విహారలంపటతఁ జొక్కుచు మేలములాడ వచ్చె నీ
కరణి మెలంగుచుండుటకుఁ గాదను వారలు లేరు ధాత్రిపై
హరిహరి యింత మండగపు టాటలఁ గంటిమె యొందు నే
నియున్.

ఉ అక్కట నీవు నన్నిటుల నారడిఁ బెట్టి కలంప జూచుటల్ ౨అ
నిక్కముగా మదిం దెలియనేరక యూరక మోసపోతినిం
కెక్కడి సత్యశౌచములు హీనకులంబు వెలందిఁ బెండ్లియై
డక్కగ నెత్తిఁ బెట్టుకొని టక్కులు పల్కెద వేమి చెప్పుదున్

భర్గశతకము :—

మ. ధర మృద్దారుశిలామయ ప్రతిమలన్ దైవంబు లంచుం బఱ
స్పర వాదంబులఁ బోరుచున్ నిబిడ సంసారాంధులై మేలు చే
కుఱకే మర్గములోని కండెలగతిన్ ఘోరార్తులై ప్రాకృతుల్
కరముం జచ్చుచుఁ బుట్టుచుందురుగదా! భర్గా! పార్వతీ వల్లభా!

మ. అపవర్గంబొనఁ గూడునో చిరసుఖాహ్లాదంబు చేకూరునో
జప హోమాధ్యయ నార్చనాదిక మహామత్కర్మ ముల్డించిదు
ష్కపటోపాయ విజృంభమాణ ధరణీ కాంతాధమాగాని
ష్కపట భ్రాంతి జరింతు రార్యులిల భర్గా! పార్వతీవల్లభా!

శా. ఆఁకొన్నప్పుడు వంటకంబయిన బియ్యంబైన జావైనఁ గూ
రాకైన న్ఫలమైన నీరమయినన్ వాళింగలట్టిచ్చుచున్
జేకోనాఁ బర దేశులం గృహులకున్సిద్ధంబు గావింప ఛీ!
కాకున్న స్మతియేటి కొంపలవి భర్గా! పార్వతీవల్లభా!

మ. మడతెల్వల్లు నృపాలుతోఁ బలు మఱున్మారాడు పెండ్లాముతోఁ
జెడుజాడం బ్రచరించు నాత్మజునితోఁ జేట్పాటు గోర్లెంకతోఁ
బోడవం జూడగ వచ్చు కార్మోదవుతోఁ బోరాడు చుట్టంబుతోఁ
గడ తేరందరమా గృహస్థునకు భర్గా! పార్వతీవల్లభా!

సర్వపుం మాహాత్మ్యము :—

మ. నలినాక్షాయ నమోఽస్తుతే భగవతే నానాజగద్వ్యాపినే ౧౮
ఖల హృద్దర్ప తమస్సహస్ర ఘృణయే కైవల్య నాథాయ ని
ర్మల కారుణ్య గుణాయ ధాతృగురవే మన్దాకినీనామ శై
వలినీ ప్రోద్భవ కారణాయ యనుచున్ వాక్రుచ్చి కేల్మోడ్చినన్

ఉ. ఎక్కడి దానవీవు కమలేక్షణ నీవు వసించు నుక్కప 2అ
ట్టెక్కడ నీ మనోరమముఁ డెవ్వఁడు నీ తలిదండ్రు లెవ్వరీ
చక్కని జాళువా పసిఁడి చాయలఁ గేరెడు మేను గందఁగా
నొక్క తె విక్కడం దిరుగు చుండఁగఁ గారణ మేమి చెప్పుమా!

చ. అతితర వేదశాస్త్ర నిగమాంత పురాణ కథా విధాన వి
శ్రుతుని దరిద్రుఁ జేయుదువు చూడ నికృష్టుఁ బ్రకృష్ట భాగ్యసం
యుతునిఁగఁ జేయుచుందుదువహో పరికింప జగంబు లందు న
ద్భుతముగ దమ్మ నీమహిమతో యజనాభ విలాసినీ మణీ 3అ

కుక్కుటేశ్వర శతకము :—

సీ. న్యాయపద్ధతి భూషణము ధరాధిపునకుఁ
బోలఁతికి మానంబు భూషణంబు
శమదమంబులు భూషణములు నిశ్చలునకుఁ
బొసఁగ నింటికి సతి భూషణంబు
నరునికల్మికి భూషణము దాన వైఖరి
భూసురునకు విద్యభూషణంబు
వలిన బంధుఁడు భూషణము నభోవీధికిఁ
బుడమికి సస్యంబు భూషణంబు

గీ. బుధులకెప్పుడు నీపదాంభోజ యుగళ
పూజనాసక్తి వెలలేని భూషణంబు
భూనుతవిలాస! పీఠికాపురనివాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

సీ. అనయమ్ము రాజ్యాంతమున నరకము ధ్రువ
మ్మని స్మృతుల్ వచియింప వినఁగ లేదా

మును హరిశ్చంద్రాది మనుజేంద్రుల నఘులై
చనిరన్న సత్కథల్ వినఁగ లేదా
దండధరుండు మీఁదటి దురాత్ములఁ బట్టి
వెతఁ బెట్టు ననుమాట వినఁగ లేదా
మహిలోన "జాతస్యమరణంధ్రువమ్మని"
విబుధులు పలుకంగ, వినఁగ లేదా

గీ. కానిదుర్మతులయి ప్రజఁగలఁచి ధనము
గూర్పఁ జూతురు బేలపై కూళదొరలు ధానత ...



# 351 పైఁడిపాటి వేంకటనృసింహకవి



ఇతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు శఠమర్షణ గోత్రుఁడు; లక్ష్మీపతి కవీంద్రునకును వెంకాంబకును బుత్రుఁడు; లక్ష్మణపండితునకును మంగాంబకును బౌత్రుఁడు

ఈకవి లక్ష్మీనృసింహావిలాస మనుమూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి, మాల్యశైలమందలి నరసింహస్వామి కంకితము చేసెను. మఱియు, మన్నారుకృష్ణశతకము. రామచంద్రశతకము నను రెండు శతకములను రచించెను ఇతఁడు తన గోత్రసూత్రాదులను లక్ష్మీనృసింహావిలాసమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు

గీ. అవనిసురలము శఠమర్షణాఖ్యగోత్ర
సంజ్ఞగల పైఁడిపాటివంశజుల మాఱు
వేలకృతిని యజుశ్శాఖ వెలసి వాక్య
సిద్ధి కలిగినమావృత్తి శిష్టహితము

క. ఘనమైన యజుర్వేదం
బున కాపస్తంబసూత్రము ఘటించె మహా
జనసమ్మతి నామాసీ
శునిశాసనమునఁ దదీయసూత్రము నందున్

చ. ప్రవిమలపుణ్యకీర్తి హరిభక్తిఁ గవిత్వతరోక్తిఁ గల్గి యీ
భువిఁ దగి పైఁడిపాటికులభూషణు లొప్పుదు రట్టివంశసం
భవు లగువారికెల్ల శఠమర్షణభద్రిణబాదరాయణ
ప్రవరసమేతమై యవనిపై శఠమర్షణగోత్ర మొప్పెడున్.

ఆంధ్రనామ సంగ్రహమును రచించిన పైఁడిపాటి లక్ష్మణ కవియు నీతఁడు నొకేవంశములోనివా రని యనుకొంటిని. కాని యది నిజముకాదు ఆలక్ష్మణకవి కౌండిన్యగోత్రుఁడు కావున నాతనికి నీతనికిని సంబంధము లేదు.

నెల్లూరు మండలమునందలి కందుకూరు తాలూకాలోని పైఁడిపా డీతనినివాస మైనట్లును, పైఁడిపాడునకును దత్ప్రాంతగ్రామములు మూఁడిఁటికిని నీతనివంశీయులు కరణము లైనట్లును, కవి యీక్రింది సీసపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. క్షితితలంబున నొప్పు కృష్ణాపినాకినీ
మధ్యనదీమధ్య దేశభూమి
గడుఁ బూర్వవార్ధికిఁ బడమట యోజన
దూరమై తగు కందుకూరు మఱియు
నదియనీమానామమైయొప్పు నాకందు
కూరికిఁ దనరు వాయువ్యదిశను
బాలేరు దానికిఁ బొలస్త్యదిశఁ బైడి
పాడొప్పుదానికిఁ బశ్చిమమున
నగడుఁ జటుకుపాడు నిరృతిని వెంపాడు
చెలఁగు గాడ్పుమూలనిలవరయన

నమరుపురచతుష్టయంబివిత్పణకాష్ఠ
జలసమృద్ధి సిరుల నలరుచుండు.

పూర్వ మొకప్పుడు గోపరాజు రామనయను నమాత్యశేఖరుఁ డప్పటిగోలకొండప్రభువును మెప్పించి, యేడుగడియలకాలము తానా ప్రభుస్థానము నధిష్ఠించు నధికారమును సంపాదించె ననియు, నా

సమయమున నాతఁడాంధ్ర దేశమునందదివఱకు గ్రామకరణికములను జేయుచున్న బ్రాహ్మణేతరులను దప్పించి, యావృత్తులను నియోగ బ్రాహ్మణులకొసంగెననియు, నాయేడుగడియలలో నాలువేల గ్రామముల కట్టిమార్పు చేసెననియు, నందుచే వారాలువేల నియోగులని యప్పటినుండియుఁ బిలువఁబడుచుండిరనియు, నొకకథ చిరకాలాను గతముగా వచ్చుచున్నది. ఆకథ నీక్రిందిపద్యములోఁ గవి గ్రంథస్థము చేసినట్లు గన్పట్టుచున్నది.

గీ. గ్రహణవేళ గోపరాజు రామన గోల
కొండప్రభువుచేతఁ గొనినదాన
మహిమ దుష్టమతుల మడియించి స్థావర
జీవనంబు ద్విజులఁ జేర్చె మున్ను

వ. తదీయానుగ్రహాలబ్ధం బైనయేతద్గ్రామచతుష్టయస్థావర జీవనజీవితు లైనమదీయవంశజుల జననక్రమంబు వర్ణించెద.

పైనచెప్పిన శతకద్వయ రచనానంతరమీ నృసింహావిలాసమును రచియించిన ట్లీక్రింది వచనభాగమువలనఁ దెలియుచున్నది.

వ. ఇట్లు. శ్రీనివాసదేవుని యనంతావతారంబులందవతారత్రయంబుచిరకాలాభ్యుదయంబుగావున రామకృష్ణదైవంబులకువృత్త నీసశతకద్వయంబు చెప్పి యర్పించి, నృసింహదేవునకు భవ్యంబగు కావ్యంబుఁ జెప్పి యర్పింపందలంచి ..."

నృసింహవిలాసమున సంస్కృతాంధ్రకవుల నీక్రిందిసీసపద్యములోఁ గవి వర్ణించియున్నాఁడు.

సీ. వాగ్వరశాసనత్వంబు వాగ్వరశాస
నత్వంబు వాల్మీకి నన్నపలకు
ధర్మకశాస్తృతిత్వంబు ధర్మకశాస్తృ
తిత్వంబు శుకతాత తిక్కనలకు
వరకవితావిభుత్వము వరకవికవితావి
భుత్వము భోజరాట్పోతనలకు
గోత్రాత్మజానుతి గోత్రాత్మజానుతి
ప్రబలకాళిదాస భాస్కరులకుఁ

కృతుల నిట్లితరేతరహితము గల్గి
మృదుపదోక్తప్రబంధార్థమిహిరకిరణ
గణవిధూతజనౌఘాంధకారులైన
సంస్కృతాంధ్రకవీంద్రుల సన్నుతింతు.

ఈతనితండ్రి కవీంద్రుఁడని చెప్పెను గాని యాతఁడు రచించిన గ్రంథము లేవియో తెలియ లేదు.

మన్నారుకృష్ణశతకమునందు కవి తననామాదికము నీక్రింది సీసపద్యమునఁ జెప్పినాఁడు.

సీ. సురుచిరాపస్తంబసూత్రవిప్రాజ్ఞుఁడై
ప్రాజ్ఞుఁడై శ్రీపైడిపాటికులజుఁ
డై శతమర్షణయుతగోత్రధర్ముఁడై
ధర్ముఁడై సూనృతతపము పెంపుఁ
గనినలక్ష్మీపతికవిఘనాఘనునకు
ఘనునకు సుతుఁడ వేంకటనృసింహ

నామధేయుఁడ భవన్నర్తనచరితంబు
చరితంబు నొకసీసశతకకృతిని
జెప్పి యర్పించితిసుధీవిశేషదాని
దానివిని నన్నుఁ గైకొను దైవరాయ...౧౧౨

మన్నారుకృష్ణశతకము, "చారుతరమందహాస పోలూరివాస వారిజాక్షితకృష్ణ మన్నారుకృష్ణ" యనుమకుటముతో రచించిన 112 పద్యములు కలసీసపద్యశతకము ప్రతి పద్యమునందును. ముక్తపదగ్రస్తాలంకారము కలదు. ఈశతకము పదిభాగములు చేసి ఒక్కొక్కభాగమున కొకదశకమని పేరుపెట్టినాఁడు. ఆదశకములకు స్తుతి, దాససంగతి, పితృమాతృ, బాల, చోరత్వ, జారత్వ, గోపాలన, దుష్టనిగ్రహ, శిష్టప్రతిపాలక, అవతార దశకములని పేర్లు. పోలూరు ఎచ్చటిదో తెలియదు ఉత్తరార్కాడు మండలములో నెల్లూరు తాలూకాలో నొకపోలూరున్నది. నెల్లూరు మండలమున దరిశితాలూకా పోలూరివారి ఖండ్రిక యున్నది. ఇతనికవిత్వశైలి తెలియుటకై రెండుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

సీ. తుదముట్టఁడే మహాదృఢుఁడు లీలాశుక
లాభుక సూక్తుల ననుసరించి
దరిఁజేరఁడే పురందరనామవిర్థరు
శ్మరశివు నిన్ను వినుతి చేసి
ప్రకృతివీడ్కాంచఁడె నారాయణతీర్థులు
తీర్థపాదుని నిన్నుఁ దెలియఁబలికి
వ్యాజసంసృతి వీడఁడే జయదేవుండు
దేవుండ వగునీదు సేవఁ జేసి

భక్తివారలు యుష్మదుపాస్తిపరులు
పరులు జడులకు వారలఁ బ్రణుతిచేతుఁ
జారుతరమందహాస పోలూరివాస
వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౦

సీ. సిద్ధింప నేర్చునే శ్రేయోనిశాంతంబు
శాంతంబు నావంటిచపలమతికి
సుఖకూడ నేర్చునే సంపన్నిదానంబు
దానంబు నావంటిహీనగతికిఁ
జేరఁగ నేర్చునే చింతావియోగంబు
యోగంబు నావంటిభోగరతికిఁ
బొసఁగంగ నేర్చునే భూతహితత్వంబు
తత్త్వంబు నావంటిదైన్యకృతికిఁ

గాన నిటువంటిపతితుఁడ నైననాకు
నాకుజాతునికట్ల నీనామమబ్బెఁ
జారుతరమందహాస పోలూరివాస
వారితామితతృష్ణ మన్నారుకృష్ణ!

రామచంద్రహరిశతకము :—

ఈశతకమునందుఁ గూడ మన్నారుశతకమునందువలె పదకొండు దశకము లున్నట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. స్తుతివాక్యోన్నతి, దాససంగతి, మనోదుర్వృత్తి, సంసారపద్ధతి, మాయాకృతి, తత్త్వసంతతి, యభేదఖ్యాతి, దీనావనస్థితి, సర్వేశదశావతారనుతి, కించిన్నీతి, నాసాప్పున

ద్భుతరీతిం గృతిరుద్రసంఖ్యాదశకంబుల్ సమ్మతిదానినా
యతకారుణ్యత నన్నుఁ గైకొను ముపేంద్రా! రామచంద్రా
హరీ!

శా. పారంబెంతటఁ గానరాక నడుమ న్భంగక్రియల్గల్గి దు
ర్వారంబై జడతాభివృద్ధిగతసత్త్వంబై ఘృశంబైన సం
సారాంభోనిధిఁ జిక్కినాఁడ వేడలన్ శక్యంబె వేలేమహా
త్కారుణ్యంబున నన్ను ...

మ చదువ న్గేలియొనర్పరాదు సుఖమూశాపాశికి న్లేదు కూ
డదు కాంతాతతితోడివాదు దురదృష్టం బిష్ట మీఁబోదు భూ
తదయాళుత్వము గీడుదేదు క్షమచేతశ్శాంతికిం బోదు నీ
రదనీలోపమనన్ను ...

మ. మునుదర్శింపవశంబుగాని తనమోము న్దర్పణోపాధిఁ గ
న్గొనిన ట్లాత్మగురూపదేశమున యోగు ల్గాంతు రేకాంతద
ర్శనయోగైక్యసమాధిచేఁ దనరి యప్రత్యక్షమై యున్నయా
త్మను గారుణ్యత నన్ను ....

ఈకవి కాలమునుగూర్చి (శ్రీ) వీరేశలింగము పంతులుగారు "ఈకవియొక్క కాలమేదియో కానరాదుగాని, యితఁడాధునికుఁ డయినట్టు తెలియవచ్చుచున్నది" అని వ్రాసియున్నారు.

[ 'అయ్యలరాజు నారాయణకవి ఇతనికి మేనల్లుడు' అని గ్రంథకర్త సూచనగా నొకచో వ్రాసినారు. వివరములు వ్రాసియుండ లేదు. అందుచే యీకవి పదిహేడవశతాబ్ద ఉత్తరార్ధమున యుండును అని తలంపవలయును. ]

# 352 అయ్యలరాజు నారాయణామాత్యుఁడు



ఇతఁడు ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు; కౌండిన్యసగోత్రుఁడు; సూరనార్యునకును గొండమాంబకును బుత్త్రుఁడు. ఇతఁడు హంసవింశతి యనునైదాశ్వాసముల శృంగారప్రబంధమును, దశావతార కథాసంగ్రహమును, బద్యకావ్యమును, ఆంజనేయశతకమును రచియించెను.

దశావతార కథాసంగ్రహమునందుఁ దనతండ్రిని, యాతని పూర్వుల నీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. కౌండిన్య సద్గోత్ర కల్పకంబగు పర్వ
తప్రెగ్గడెవ్వాని తాతతాత
కవిచకోరనిశాకర యశస్స్ఫురదయ్య
లామాత్యుఁ డెవ్వాని యబ్బకబ్బ
కుకవితాక్షుద్రద్రుకుద్దాలసముఁడు
భాస్కరమంత్రి యెవ్వానిఁ గన్నతండ్రి
హంసవింశతి ప్రబంధాకల్పు నారాయ
ణాఖ్యుఁడౌ నేనే మహాత్మ్ము సుతుఁడ

గీ. నట్టి యయ్యలరాజాన్వయాంబురాశి
భగణహృన్నాథుఁ గొండమాంబాసనాథు
నిఖిలకకుబంతరాళ నిర్నిద్రకీర్తి
మజ్జనకు సూరపామాత్యు మదిఁ దలంతు.

హంసవింశతిలో తనవంశజులైన పూర్వపుకవీంద్రులను యీ క్రింది పద్యములో నుతిఁ జేసి యున్నాఁడు.

ఉ. అయ్యలరాజుఁదిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుండగుకొండధీరునిం
జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితా రచనాఢ్యులైన మా
యయ్యలరాజు వంశజుల నాది కవీంద్రుల సన్నుతించెదన్,

ఈపద్యములోఁ జెప్పఁబడిన యయ్యలరాజు, తిప్పయమంత్రికిఁ దండ్రియైన యయ్యలరాజనుటకు సందియము లేదు. అంతకుఁ బూర్వ మీవంశమునకు 'రాయకవి' యను గృహనామము కలిగియున్నను, నీయయ్యలరాజునుబట్టియే వీరి కయ్యలరాజువారను నింటిపేరు వచ్చినది. ఈపద్యమును నిందున్నట్లుగాఁ జదివితిమేని, అయ్యలరాజు కూడఁ గవియే యని యర్థమువచ్చును. కాని యయ్యలరాజునకు బిమ్మటనున్న ఖండబిందువును దీసివేసితిమేని యయ్యలరాజును గవిగాఁగాక తిప్పనమంత్రికిఁ దండ్రిగా మాత్రమే చెప్పెనని తలంపవచ్చును. అయ్యలరాజు కవియని, యాయనకుమారుఁడును జెప్పలేదు. రామభద్రయ్య రామాభ్యుదయమును రచించెను భాస్కరుఁడు శైవమత శాస్త్రమును జేసెను. తక్కినవారే గ్రంథములను రచించిరో తెలియదు. ఈ కవి రచించిన హంసవింశతిని శ్రీరామున కంకితము చేసెను.

హంసవింశతియొక్క యముద్రితప్రతులు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నందున్నవి. ఆపుస్తకముల పట్టికను ప్రకటించిన వారీ కవియింటిపేరు పుత్తేటి వారని వ్రాసియున్నారు.

అట్లు వ్రాయుటకు వారికిఁగల యాధారమేమియో తెలియలేదు. హంసవింశతి ముద్రితప్రతిలో పుత్తేటి ప్రశంస కన్పట్టలేదు. ఈ హంసవింశతికిఁ బీఠిక వ్రాసిన కడపనివాసులగు జనమంచి శేషాద్రిశర్మగారీకవినివాసము కడపమండలములోని పుల్లంపేట తాలూకా యందలి పొత్తపియను గ్రామమని తెలియవచ్చినదని పీఠికలో వ్రాసి యున్నారు. అదియే పుత్తేటియై యుండునా యని సంశయము కలుగుచున్నది. కథాసందర్భమునఁ బంచమాశ్వాసములో ననేక పట్టణములయొక్కయు గ్రామములయొక్కయు నామములను జెప్పిన యీ కవి తన నివాసమును జెప్పియుండలేదు. రామాభ్యుదయమును రచించిన యయ్యలరాజు రామభద్రయ్య గృహనామము పుత్తేటివారని వాకొని యున్నారు. ఆతని వంశీయుఁడగుటచే నీతని యింటిపేరుఁ బుత్తేటివారై యుందురని యూహించి యముద్రితగ్రంథపట్టికలను రచియించినవారట్లు వ్రాసియుందురు, కాని యీ కవి గృహనామము పుత్తేటివారనుట కాధారములు లేవు.

అయ్యలరాజు త్రిపురాంతకుఁడు, రామభద్రకవి, భాస్కరకవి, వీరలనివాసము కడపమండలములోని యొంటిమిట్టయైన ట్లాకవుల చరిత్రములోఁ దెలిపియున్నాఁడను. ఇతఁడు తనను గూర్చి చెప్పుకొనిన యీ క్రింది పద్యగద్యములనుబట్టి ధనవంతుఁడనియుఁ బరాపేక్ష లేనివాఁడనియుఁ బరాపేక్ష లేకుండఁ గవిత్వము చెప్పఁగలవాఁడనియు నెఱుంగనగుచున్నది.

సీ. ఎవనికీర్తి కుభృద్భవ కుభృద్ధర బుధ
కరి సైంధవ సమిద్ధ హారిణ రుచిర

ఎవని మేధంబు రుద్భవక భుగ్ధవ విధూ
దృవ యురుద్ధవ గురు ప్రతి విఘాతి
యెవని యీావహిమరుగ్భవ సరిద్ధవ లస
ద్భువన భృత్త్రిపురభిద్భూరి మహిమ
యెవని రూపమృతి భుగ్ధవసుతోద్వ్రతీ
దుద్వీడ్భృదాప్త పుత్త్రోల్లసనము

తే. మంత్రిమాత్రుండె యతఁడు మర్మంత్రిమంత్ర
తంత్రసంత్రాసకరణ స్వతంత్రుఁడ యల
రాజవంశసుధావార్ధి రాజ సూర
యార్య నారాయణామాత్య వర్యుఁడలరు

వ. వెండియు నఖండ తేజఃకాండ మార్తాండమండల ప్రచండుండును నిజ వితరణాకర్ణన కృశీభూత పారావార పునరభ్యుదయ కారణానూన దాన ధారాప్రవాహ సంజాత మహావాహినీ వ్యూహుండును నిస్తుల ప్రశస్త సమస్త సద్గుణ రత్నరత్నాకరుండును గౌండిన్యసగోత్ర పవిత్రుండును, గొండమాంబాగర్భ వారాశిచంద్రుండును నగు నయ్యలరాజు నారాయణామాత్య దేవేంద్రుండు గొండొక శుభవాసరంబున నత్యంత సంతోషింతాంతఃకరణుండై ...

గద్య :— ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రాయ్యల రాజాన్వయ సుధావార్ధి పూర్ణిమాచంద్ర నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారాయణామాత్య ప్రణీతంబయిన హరివంశంబు''.

ఈ వర్ణనమును బట్టి కవి యాత్మశ్లాఘనా పరాయణుఁడేని, కాక యత్యుగ్రస్వేచ్ఛాల జారప్రియుఁడేని యై యుండునని చదువరు లనుకొనకపోరు. పై గద్యపద్యములవలెనే గ్రంథమంతయు నుండు నని పాఠకులు సంశయ పడనక్కఱలేదు. ఈతని కవిత్వము ద్రాక్షా పాకమై మృదుమధుర పదభూయిష్ఠమై పాఠకుల హృదయములకు విందుసేయుచుండును కృత్యవతరణికలో దేవతాస్తుతితో పాటుగ భగవద్భక్తుల స్వీకరింపిపద్యములో స్మరించియుండుటచే నీతఁడు భక్తాగ్రేసరుఁడని తెలియుచున్నది.

తే. ఆత్మఁ బ్రహ్లాద రుక్మాంగ దాంబరీష
శౌనక వ్యాస శుక పరాశర విభీష
ణార్జున వసిష్ఠ పుండరీకాఖ్య భీష్మ
దాల్భ్య నారద ముఖ్యులఁ దలఁతు భక్తి.

ఇంతటి భక్తిపరుఁడైన యీ కవి తనయనుపమకవితాధారను కేవల జారత్వకథాసంయుతంబగు నిట్టి శృంగారరసప్రబంధ నిర్మాణమున కుపయోగించుట యాశ్చర్యముగనే యున్నది. ఈ శృంగార కావ్యము నందలి కథయిది :—

ఉజ్జయినీ పురంబున విష్ణుదాసుఁడను వైశ్యునకు నిరుపమాన సౌందర్యవతియగు హేమవతి యను భార్య కలదు. ఒక యోగిని యాపట్టణమేలు చిత్రభోగున కాహేమవతి యందచందముల నెఱింగించి యామెపై నాతనికి మోహముదయింపఁ జేసినది. ఆ భూపాలుఁడు హేలయను దూతికాముఖమున వైశ్యభామినికిఁ దనభావ మెఱింగించినాఁడు. ఆమె భయమునొంది యాదూతికకు

ఉ. అమ్మక చెల్ల! యిట్టి పలుకాడుదురే! మఱి యత్తమామలుం
గ్రమ్మి తలారులై మెలఁగఁగా మగఁడుం బులిరీతిఁ దెంపుగా
బమ్మెర రొప్పుచుండఁగను బాంధవులెల్లరు గాచియుండఁగాఁ
గొమ్మరొ! యిట్టి కార్యమొనఁగూడునె? యూడిన హానిచేదదే

అని ప్రత్యుత్తర మిచ్చినది హేల యంతటితో విముఖురాలు కాలేదు. ఎంతటి కష్టములు వచ్చినను, ఎన్ని యసత్యము లాడినయైనను, స్వేచ్ఛావిహారమును గోరుట స్త్రీకి అవసరమనియు, అంతటి సుఖదాయక మగు పదార్థ మింకొకటి లేదనియు నీక్రింది రీతిని బోధించినది

సీ. కోటగోడలనైన మీటుగా నెగఁబ్రాకి
దాఁట నేరని దేటి తలిరుబోడి
ఘుమఘుమార్భటితోడ ఘోషించు నదులైన
నీఁది పోనని దేటి యెమ్మెలాడి
తనమీఁది తప్పు నొక్కనిమీఁద నిజముగాఁ
బెట్ట నేరని దేటి బిసరుహాక్షి
ధవుఁడైనఁ దనజాడ తగదని పట్టిన
నిర్వహింపని దేటి నీటుకత్తె

తే. తలవరులు గన్నచోఁ దేని తాల్మిఁ బూని
బొంకు తథ్యంబు తథ్యంబు బొంకు గాఁగ
నెంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి
చక్కటికిఁ దేని దది యేటి సరసురాలు.

ఎట్టకేలకు హేమావతిని రాజుతోఁ గలయుట కొప్పించినది. ఇంతలో విష్ణుదాసున కిరువదిరోజులకుఁగాని తిరిగి రాఁజాలనని దూర

దేశప్రయాణము తటస్థింప నాతఁడేఁగుచుఁ బ్రేమతోఁ బెంచిన రాజహంస నింటికడ జాగ్రతగ నుండుమని హెచ్చరించి పోయెను.

హేమవతి సింగారించుకొని రాజుకడకుఁ బయనమైపోవుచు హంసకడకు రాఁగా నామె యుద్యమము నెఱింగి హంస యామెకిట్లు, పరపురుష గమనము పాతక మనియుఁ గష్టహేతువనియు బోధించినది

ఉ. అక్కట భర్తగాపురము నాఱడి పుచ్చి నృపాలమాళితోఁ
బొక్కి రమించు నందులకుఁ జొచ్చినఁ దావక బంధు వర్గముల్
దక్కవ చేతురమ్మ చరిత్రవతముల్ చెడునమ్మ జాతికిం
బక్కన నిందఁజెంది తలవంపులు దెత్తు రఁటమ్మ మానినీ !

సీ. అత్తమామలు గన్న నాఱడిపుత్తురు
బావ పరీక్షింప నేవ గించు
మఱఁదులు గాంచిన గఱ్ఱకటి నెంతురు
వదినె లెఱింగిన వాసి చెడును
బంధువుల్ గనినచోఁ బరఁగ నిందింతురు
తోడికోడలు చూడ నాడికొనును
బతిగనుఁగొన్నచోఁ బ్రాణహాని యొనర్చు
వాడవారెఱిఁగిన వన్నెదఱుగు

తే. నరయ నిదిగాక యన్నిట నాడుపుట్టు
పుట్టఁబాపంబు పుట్టినఁ బుట్టినింటి
కేని మఱిచొచ్చునింటికిఁ గీర్తి ఘనత
దేక యపకీర్తి దెత్తురే తెలివలేచట

ఈరీతిగా నయభయములతో నెంతబోధించినను నామెహృదయము మరలలేదు. రాజులు మంచివారుకారు కావున రాజును గోరుకొనక మఱియొక యందగానిని జూచుకొమ్మని కూడ నీక్రింది పద్యములలో హంసబోధించినది.

తే. మానవతి నీవు పరసంగమమున కాస
పడఁ దలంచితివేనిఁ జేపట్టుకొంచె
మైన చక్కని యొక యందగాని తోడఁ
గూడి యాడక రాజులఁ గోరఁ దగునె

మ. అధిపుల్ యుక్కఱ ఫణిస్వరూపు లధరంబాసించు రీతి భూ
మిధవుల్ కాలకరాళకీలిసదృశు ల్మన్ననఁ బొందించుచు
ట్లు ధరాధీశులు మత్తదంతిసము లేలా నీకుఁ జెల్లాట మా
డ ధరాభృత్కుచయుక్తైఱంగెఱిఁగి వేడ్కం గోర్కులీడేర్చుకో!

ఈ యుపదేశమును నామె హృదయము నాకర్షింపలేదు.

"అప్పుడత్తెఱవ చిత్తంబెఱింగి మరాళం బక్కటా! యిత్తరుణి దుష్కర్మాయత్తతం బరాయత్త చిత్తవృత్తియయ్యె నిట్లగుట మదీరితసునీతి వాక్యంబులు దీనికిం బరుషంబులై తోఁచుచున్నయవి సమదమదన ప్రదర వేదనాదోధూయమానంబైన దీని మానసంబు సామంబునంగాని చక్కంబడదని చింతించి యుపాయం బారయుచుండె".

ఈకథాలాపములతో మొదటిరాత్రి గడచినది. రెండవరాత్రి మరల నట్లే హేమవతిరాగా హంస, జారత్వము చేయఁబూనిన కామిని కెట్టి ధైర్యసాహసములుండవలయునో నీకుఁ దెలియునా

యని ప్రశ్నించి జారిణి తనయుపపతితోఁ గలిసియున్నప్పుడు నిజభర్త యరుదెంచినకథ యొకటిచెప్పి యప్పుడట్లు తప్పించుకొనవలయునని యడిగి యామె ప్రత్యుత్తరంబీయలేకపోఁగా, నాజారిణి యెట్లు తప్పించుకొనియెనో యాయుపాయమును జెప్పి యిట్టి శక్తి యున్నంగాని పరపురుషసాంగత్య మపేక్షింపఁ గూడదని చెప్పునంతలోఁ దెల్లవాఱిన నామెమరల నింటికిఁబోయెను. హంసయు నిట్లే యిరువది రాత్రు లిరువదికథలు చెప్పి యావైశ్యవనితకు రాజు సాంగత్యము కలుగకుండఁ జేసెను.

హంస చెప్పిన యిరువదికథలు కలది కావున హంసవింశతియని యీగ్రంథమునకుఁ బేరువచ్చినది. ఈ కథలన్నిటియందును భర్తలను వంచించి యుపపతులతోఁ గలసియున్నప్పుడు భర్తలరుదెంచుటయు నప్పుడుపపతులకు ధైర్యము చెప్పి తాముసత్యములు పల్కి తమకును దమ యుపపతులకును నాపదలు రాకుండఁ దప్పించుకొనిన యుపాయములే వర్ణింపఁబడినవి. కథయంతయుఁ జదివినపిమ్మట హంసయడిగెడి ప్రశ్నకు హేమవతియే కాదు సామాన్యులెవ్వరును బ్రత్యుత్తరమీయలే నంతటి విషమ పరిస్థితి ప్రతికథయందును గానవచ్చును. ఇది శుకసప్తతివంటిగ్రంథమే. ఇరువదికథలకే శృంగారరసమిందుఁ బారములనంటి వెల్లువవలెఁ బ్రవహించినది. ఇది కూడసప్తతియైనచోఁ గూలములు తెగి చదువరులను మొగము మొత్తి వికటించునేమో యనికాఁబోలు కవి వింశతితోఁ దృప్తిచెందినాఁడు.

ఈ కవి పలుతావుల వ్యాకరణనియమముల నుల్లంఘించినాఁడు త్వార్థకసంధులు, తత్సమసంధులు, ద్రుతసంధులు మొదలైన్ని వింతరూపములు కూడ యథేచ్ఛముగా నిందుఁబ్రయోగింపఁబడినవి కొన్నితావుల నాప్రయోగములు శ్రుతికటువులై పూర్వాచారపరా

యణువైన కవులహృదయములకు కంటకములుగాఁ గాన్పించుచుండునుఁ ఆదోషములను విడిచి చూచితిమేని యిందలి కవిత్వము తేనెలొలుకుచుఁ జాలమాధుర్యముగా నుండును.

ఈ హంసవింశతికథలను నలచక్రవర్తికి ఉబుసుపోకకై తత్పురోహితుండగు ప్రత్యుత్పన్నమతియనునాతఁడీరీతిగ చెప్పినట్లు చెప్పుచుఁ గవిత్వ మీవిధముగ నుండవలయునని యీక్రిందిపద్యములో సూచించియున్నాఁడు.

ఉ. చెపఁదొడంగెఁ దేనియలు చిల్కఁగ ద్రాక్షలు రాలఁగ బ్రపుం
దిప్పలు చిమ్మరేఁగఁ గడుఁ దీయని యిక్షురస ప్రపూరముల్
చిప్పిలి పర్వఁగా నమృతశీకరముల్వడిఁ గ్రుమ్మరింప న
ప్పప్పయిదారయంచుజనులందఱు నోఁదలలూఁచి మెచ్చఁగాన్

ఈపద్యమునందలి సూచనలకుఁ దగినట్లుగానే యీతని కవిత్వమున్నది. కాని, యిట్టి గ్రంథపఠనము వయసులో నున్న యువతీయువకుల కుద్రేకము జనింపఁజేసి పెడదారులఁ ద్రొక్కించునేమో యని భయము కలుగుచుండును.

అట్టిభయమున కవకాశము లేదని తెలుపుటకై కవి గ్రంథాంతమున హేమవతీ చిత్రభోగుల హృదయపరివర్తనము నీక్రిందిపద్యములలో వర్ణించినాఁడు.

తే. కథలు రేత్రెల్పుటయె కాదు కరుణఁ బ్రొద్దు
వోని యపుడెల్ల రాయంచ పూని చెప్పి
నట్టి నయవాక్యములచేత నైన సన్మ
నీష హేమవతీమంజుభాష యపుడు.

క. పరపురుష సంగమం దిహ
పర సుఖ దూరంబుఁ గానఁ బాతివ్రత్య
స్ఫురణ గల సతులు మదిఁ గో
ర రటంచును నిశ్చయించి ప్రమదం బెసఁగన్.

"హేమవతీ వృత్తాంతం బంతయు నాత్మీయ దూతి విన్నవించిన విని కంపితశిరస్కుండై కొంతతడవు చింతించి మహారాజ చంద్రుండును నీతిజ్ఞుండును నిశ్శంకుండును వివేకధురంధరుండును గావునఁ జిత్రభోగ నృపాలుండును దనమనంబున

ఉ. మున్నలరావణాదులు సముద్ధతి సాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రిట్లగుట నుర్విజనావళులల లన్యకాంతలం
బన్నఁగఁ గోరరాదు కడుఁ బాతకమంచు దలంచి యింతిపై
నున్న మనంబు ద్రిప్పి యథోచిత పద్ధతినుండె భూవరా!

ఈతని కవిత్వమునందు విశేషములు కొన్ని కలవు. ఒకే యర్థ మిచ్చు వేఱువేఱుపదముల నొక్కొక్కపద్యమునఁ గూర్చియున్నాడు. ఉదాహరణమునఁ గొన్నిపద్య మిచ్చుచున్నాఁడను.

సీ. వెలయ హరిశ్చంద్రు విధమున నలుని పోఁకను
బురుకుత్సు చాడ్పునఁ బురూర
వుని లీల సగరు లాగునఁ గార్తవీర్యు మ
ర్యాదను గయు క్రియ నంబరీషు
మతమున శశిబిందు మహిమ నంగుని కేవఁ
బృథుని మాడ్కి మరుత్తు వృత్తి భరతు
నీతి సుహోత్రుని భాతి భార్గవుఁ బలె రాము
పోలిక భగీరథుని పొలుపు

న, శిబి సంగతి మాంధాత నయమునను
యయాతి కరణి, దిలీపుని యట్ల రంతి
నీతి నాచక్రవాళపరీతభూత
ధాత్రి పాలించు నవిభుండు దద్విభుండు.

ఈపద్యమున నార్గురు చక్రవర్తులును, బదునార్గురు మహారాజులును బేర్కొనఁబడిరి. ఇతఁడు నదులయొక్కయు గ్రామముల యొక్కయు, పక్షులయొక్కయు పేరులపట్టికలును నింక ననేకపట్టికల నవకాశమును గల్పించుకొని సమకూర్చుచు వచ్చినాఁడు. ఒక కథలో వైద్యుఁడు విటుఁడు. ఆయవకాశమును గ్రహించి యౌషధముల పేర్ల నేకరువు పెట్టినాఁడు. ఒకకథలో జారిణి, సాలెవనిత ఆయవకాశమున సాలెవాని యుపకరణముల నన్నిఁటి పేరులను సమకూర్చియున్నాఁడు. ఇట్టి వనేకములిందుఁ గలవు. గ్రంథవిస్తరభీతిచే నుదాహరణమీయలేదు ద్వాత్రింశత్సాలభంజికయందు కొఱవి గోపరాజుకూడ నిట్టిపట్టికలనిచ్చియున్నాఁడు. ఈతఁడీవిషయమున నాతని ననుకరించి యుండును

ఇతఁడు రచించిన దశావతారసంగ్రహమును ఆంజనేయ శతకమును నాకు లభ్యము కాలేదు. కావున వానిని గూర్చి యేమియు వ్రాయనను వైనదికాదు. శతకకవుల చరిత్రమున నాంజనేయశతకమునుగూర్చి వ్రాయఁబడియున్నది ఆశతకముయొక్క మకుటము "నఖగర్తపురాంజనేయ నత జనగేయా"యని. నఖగర్తపురము గోరుగుంతలపాడునకు సంస్కృతీకరణము. ఈ గోరుగుంతలపాడు నెల్లూరుమండలములో కుచ్చర్లకోట తాలూకాల్లో నున్నది ఈ కవి యాగ్రామవాసుఁడై యుండునని శతకచరిత్రకారులు వ్రాసియుండిరి. ఈ శతకమును నాకు లభ్యము కాలేదు.

ఈ కవికాలనిర్ణయముచేయుటలోఁ గొంత వివాదమున్నది. హంసవింశతికిఁ బీఠిక వ్రాసిన జనమంచి శేషాద్రిశర్మగారు. ఇతఁడు మూఁడు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నున్నవాఁడని చెప్ప వచ్చునేమోయని క్రీ. శ. ౧౫౧౫వ సంవత్సరమున వ్రాసియున్న వారు. వీరి యూహ ననుసరించి యితనికాలము ౧౪౬౯ – ౧౫౧౫ అగును. బ్ర॥ శ్రీ వీరేశలింగముపంతులుగారు ౧౫౦౦ సంవత్సర ప్రాంతమనిరి. శతకచరిత్రకారులు క్రీ. శ. ౧౬౬౦ ప్రాంతమయి యుండుననినారు. ఈ కవి తమపూర్వులను వర్ణించిన పద్యమునుబట్టి యీాతని వంశవృక్షమిది.




తనవంశములోని కవులను వర్ణించిన పద్యములో నొకభాస్కరుని వర్ణించినాఁడు. ఆభాస్కరుఁడు రెట్టమతకావ్యమును రచించిన భాస్కరుఁడనుకొని పైని యట్లువ్రాసియుంటిమి. కాని యాభాస్కరుఁడు రెట్టమతశాస్త్రమును వ్రాసినవాఁడగునో కాదో చెప్పఁ

జాలము. ఇతఁడు భాస్కరుని పేర్కొనియెనే కాని, గ్రంథమును పేర్కొనలేదు. రెట్టమతశాస్త్రమును పేర్కొనియున్నచో ఆగ్రంథ రచనాకాలము ౧౨౨౦ అని కవులే చెప్పియుండుటచే, నీతఁడా కాలమునకుఁ దరువాతివాఁడని చెప్పియుందుము. అయ్యలరాజు రామభద్రకవి తాత పర్వతయ్య యొకఁడున్నాఁడు. ఆతఁడును, పై వంశవృక్షములోని పర్వతయ్యయు నొక్కఁడని చెప్పుట కాధారము లేదు. రామాభ్యుదయము నందును, హంసవింశతియందును, రెట్టమతశాస్త్రమునందును, ఇవ్వఁబడిన పేరులనుబట్టి యొక వంశవృక్షము నీయవలయునని యత్నించితిని గాని యది కుదిరినది కాదు. కాని యీ గ్రంథత్రయకర్తలు నొక వంశములోని వారని, వారి పేరులనుబట్టి నిశ్చయింపవచ్చును. రామభద్రుని తాత పేరు పర్వతయ్య. నారాయణామాత్యుని వంశమునకు మూలపురుషుఁడు పర్వతయ్య. ఈ పర్వతయ్య మనమఁడు అయ్యలయ్య. రెట్టమతశాస్త్ర కర్త అయ్యలయ్య. నారాయణామాత్యుని తాత భాస్కరుఁడు. రెట్టమతశాస్త్రకర్తలలో రెండవవాఁడు భాస్కరుఁడు. రామభద్రుని తండ్రి అక్కయ్య. రెట్టమతశాస్త్రకర్తయగు నయ్యలయ్య తండ్రి పినక్కయ్య.

నారాయణామాత్యుని కాలమును యితరాధారములనుబట్టి నిర్ణయింపవలసియున్నది. హంసవింశతిలో

తే. ఈడము నళంద బందర యింగలీషు
కళము మొదలయిన పేటల గారలెల్ల
సారభద్రవ్యములు పేరసారమాడఁ
బిలుప నంపిరి దమతమ పేటలకును

వలంతులని పిలువఁబడియెడి డచ్చివారిని ఇంగ్లీషువారిని చెప్పియుండుటచేతను, ఇంగ్లీషువారీ దేశమునకుఁ బదునేడవశతాబ్ది ప్రారంభమునను డచ్చివారంతకుబూర్వమునను వచ్చియుండుటవలనను, ఈ కవి పదునేడవ శతాబ్దికి పూర్వుఁడు కాఁడనుట నిశ్చయము. ఇంతకంటె నీతనికాలమును సరిగా నిర్ణయించుట కాధారములు లేవు. ఇతరాధారములు లభించువఱకు నీతనిని క్రీ. శ. ౧౭౦౦ ప్రాంతమువాఁడని నిర్ణయింతము.

ఈతని కవిత్వశైలిని దెలిసికొనుట కిదివఱకిచ్చియున్న పద్యములే చాలియున్నను మఱికొన్ని పద్యముల నిటఁబొందుపఱచుచున్నాఁడను. బైచరాజు వేఁకటనాథకవియుగూడ పంచవింశతిని రచించియున్నాఁడు

ఉ. కేరఁగరాదు నవ్వ గిలిగింతలు వెట్టఁగరాదు చెక్కులం
జీరఁగరాదు గుబ్బల ఖచక్కునఁ గ్రుమ్మఁగరాదు కేళిలో
మీరఁగరాదు పైకొని రమింపఁగరాదు గళారవంబు లిం
పారఁగ సల్పరాదు మదిరాక్షులు భర్తలఁ గూడు వేళలన్.
ఆ ౧

చ. జలకము లాడఁగోరి బురుసాపని చీర సడల్చి సందులో
పలికిఁ జనంగ నీదు నునుఁబల్కు వినంబడఁ దల్పుఁ దీయఁగా
వెలువడి వచ్చితిన్ వలపు వెల్లువ దొట్టఁగ నంచు నాయకుం
గులుకుమిటారి గబ్బి చనుగుబ్బలఁ గౌఁగిటఁ జేర్చి పల్కెనక్
ఆ ౨

చ. తిడసెని దేము ధూర్తుఁడలదర్పకుఁ బోలినవాఁడు భార్యయుం
గడు రతిఁబోలురూపుసిరిగల్గినజవ్వని యేమి ద్రోహముం

గడిమి నౌనర్చిగో యనుచుఁ గాలము నిల్వక వచ్చి గట్టిగా
గడనిడుతల్పుఁ జూచి ఘనగర్జితభావముఁ బిల్చె శిష్యునిన్ ఆ ౨

ఉ. కందువమాటలాడి వగకాగితనంబులు సూచి సన్నలిం
పొందగఁ సల్పి చేరికల నుల్లము రంజిలఁజేసి తమ్ములం
బందఁగ నిచ్చి మెచ్చి భుజమందుఁ గరంబిడి నవ్వుచేష్టఁ గే
ళిందమి రేఁచి గుబ్బలు భళీయని నల్పిర తైరచిత్తుఁడై. ఆ 3

ఉ. శాంతములయ్యె నెండలు నిశాంతములయ్యె వధూకుచంబుల
త్యంతము వాడి వేఁడిమికిఁ దాఁతములయ్యెఁ బయోజముల్ప్రశా
క్రాంతములయ్యె వాతెఱలు కాంతములయ్యె మహోష్ణవస్తులా
శాంతములయ్యెఁ దావులు నిశాంతముల౯ హిమవారి వారికిన్
ఆ 3

ఉ. వాకిలి దీసి చొక్కటపు వాలుగకన్నులఁ దేలఁజూచి నా
ళీకదళాక్షి కుందనపులిబ్బుల నేలెడు గుబ్బచన్నొనల్
సోఁకఁగఁ గౌఁగిలించి నెఱసౌంపునఁ గేళిగృహాంబులోనికిం
దోకొనిపోయి వానిరతి నూతన సంభవ పారవశ్యయై... ఆ ౪

శా. ఈలీలన్ వెసబొంక నేర్చిన నృపత్యేకాగ్రచూడామణీ
కేళీసంభ్రమ భూమిపాల సురతక్రీడాచమత్కార చ
ర్యాలాలిత్య కథాప్రయత్నమున కత్యాసక్తితోఁ బొమ్ము లే
దా లోలాంబక! యూరకుండుమని కాదంబేంద్రుఁడిట్లాడఁగన్
ఆ ౪

ఉ. చన్నులకన్న మున్నొప్పెడము సాహసము ల్పెళికించు దృష్టికిన్
మున్నుఁగఁ బుట్టుఁబెద్దలను మోసముపుచ్చు మనీషయావనా

సన్నితఃన్న మున్నెయగు సత్యమసత్య మసత్యమెన్నఁగా
విన్నఁగ సత్యమంచు ధృతి డీకొనుధీరత పువ్వుబోండ్లకున్.

ఆ ౨

ఉ. అంతట నొక్కనాఁటినిశియందు శశిగ్రహణంబు గాన్పఁద
చ్ఛాంతికి స్నానదానములు సల్పను వేఁకువజాము వచ్చుప
ర్యంతము పట్టు నందనుక రాఁడిపుడింటికి నాఁథుఁడంచు దా
దెంతయు వచ్చి చెప్పిన మృగే లాత్మల వేడ్కలూనుచున్

ఆ ౨



# 353 తాడేపల్లి పానకాలరాయకవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు వెంకయామాత్యపుత్త్రుఁడు:

ఇతఁడు వైద్యశాస్త్రార్థ సంగ్రహము అను పద్యకావ్యమును మానసబోధశతకము, చిత్తబోధశతకము పార్థసారథి శతకము, రామశతకము, రుక్మిణీపతిశతకము, లక్ష్మీశతకము, మంగళాద్రి నరసింహశతకము అనుశతకములను రచించియున్నాఁడు. ఈతని నివాసము కృష్ణానదీతీరమగు తాడేపల్లియను గ్రామము. ఇదికృష్ణా మండలములోనిది.

మంగళగిరియందున్న పానకాలరాయదేవుని నామమే తల్లి దండ్రులీతని కుంచినట్లు చెప్పుచున్నారు. ఆనృసింహస్వామిపై నీతఁ డొకశతకమును రచించియుండెను. వైద్యశాస్త్రార్థ సంగ్రహము నందీతఁడు వ్రాసికొనిన గద్యయిది:-

"ఇది శ్రీవేణుగోపాల వరప్రసాదలబ్ధ శశ్వద్విశ్వైశ్వర్య శాశ్వతవైభవ విలాస సకలక్షోణీమండలాధిప మార్తాండమండల మండిత వచోజేగీయమాన నానానఘటనాఘటన కరణీయ నిర్వహణ చాతుర్యధుర్య శక్తిత్రయ చతురుపాయ షడ్గుణౌదార్యాద్యఖిల రాజయోగలక్షణ విచక్షణ గర్వితప్రతిపక్షక్షమాధినాథదుష్ప్రధాన నికరమనోభయంకర చతురచమత్కార రసగుంభితామేయ మధుర వచన రచనానల్ప ప్రవీణ దశవిధ ప్రాణగణిత ప్రముఖ విద్యాధురంధర నయయుగంధర భిషగ్విద్యాపితామహ పితామహాన్వయ

పయఃపారావార రాకాసుధాకర శ్రీవత్సగోత్రతిలక ఆపస్తంబ సూత్ర పవిత్ర తాడేపల్లి వేంకనామాత్య పుత్త్ర సకలసుకవిజన విధేయ పానకాలరాయ నామధేయ ప్రణీతంబైన.

ఈగద్యనుబట్టి యీ కవి వైద్యవిద్యయందే కాక రాజనీతి కోవిదుఁడైనట్లును గణితశాస్త్ర ధురంధరుఁడైనట్లును తెలియుచున్నది. ఈతని వైద్యశాస్త్రార్థసంగ్రహము ముద్రింపఁబడలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందొక యసమగ్రమయిన ప్రతియున్నది.

1. పార్థసారథి శతకము:– "పార్థసారథీ" యనుమకుటముతో ౧౦౮ చంపకోత్పలమాలలను గలిగి యున్నది. చెన్నపట్టణమునఁ దిరువళిక్కేణి యందున్న శ్రీపార్థసారథిస్వామిపైఁ జేయఁబడినది.

చ. పుడమిని తాడెపల్లి కులముఖ్యుఁడ విప్రుఁడ పానకాలు రా
యుఁడ భవదంకితమ్ముగ శతోత్పలచంపకవృత్తముల్ ముకం
బడర రచించినాఁడను దయామతిఁగైకొని ధన్యుఁ జేయవే
తడయక నంచు మ్రొక్కెదను తప్పకప్రోవవె పార్థసారథీ... ౧౦౬

మచ్చు పద్యములు:

చ. చపలుఁడ బుద్ధిహీనుఁడను జారుఁడ చోరుఁడఁ బాపకర్ముఁడన్
గపటిని నన్నుఁ బ్రోచుటకుఁ గర్తవు నీవని నమ్మియుంటి నో
తపనశశాంకనేత్ర నిరతంబును వేడుకమీఱ శ్రీరమా
ధివఖల దూర దేవనుత దీనదయాపర పార్థసారథీ... ౭౨

ఉ. చిన్నికుమార మన్న దిన జెల్లున నీకని పల్క తల్లి లే
తన్నను నీవు నమ్మవటులైనను జూడుము నాదు వక్త్రమం
చు న్నిఖిల ప్రపంచమును జూపితి వౌతలవాకిటన్ గృపా
సన్నమతిన్ యశోదకుఁ బ్రసన్నుఁడవై మునుపా... ౧౮

చ. ఉడుతను లేడినిన్ కరిని నూసరవెల్లిని గొండబిల్వనున్
బడవరి పక్షినిన్ బడుగుబాపని బూవులవాని చాకినిన్
బుడుతని బానిసెన్ గడకు బోయతయింతి నరణ్యచోరునిన్
గడువడి నేలు నీవనరు గాంచఁగ వింతగు పార్థసారథీ ౨౧

(౨) మానసబోధశతకము:- "మనసా హరిపాదములాశ్రయింపుమా" యను మకుటముతో ౧౦౨ చంపకోత్పలమాలలుగల యీమానసబోధశతకమునందలి యీ క్రింది పద్యమువలన కవి నామము తెలియుచున్నది.

ఉ. పాయక తాడిపల్లికులపావనుఁడై విలసిల్లు పానకాల్
రాయనిచేఁ బ్రణీతమయి రంజిలు మానసరాజయోగ సం
ధాయకవంద్య సంస్తవ శతంబనిశంబుఁ బఠించి మోక్షసం
ధాయతఁ బొందెదీవు మనసా హరిపాదము లాశ్ర
యింపుమా ౧౦౧

(3) ఈ కవి "శ్రీహరిపద్మములు కోరి భజించుచిత్తమా" అనుమకుటముతో ౧౦౮ చంపకోత్పలమాలలు గల చిత్తబోధశతకమును రచియించియుండెను. ఆశతకమున గ్రంథకర్త నామమును దెలుపు పద్యము నిక్రింద వ్రాయుచున్నాఁడను.

చ. పుడమిని తాడెపల్లికులముఖ్యుఁడ విప్రుఁడ పానకాలురా
యుఁడ భవదంకితమ్ముగ శతోత్పల చంపకవృత్తముల్ ముదం
బడర రచించినాఁడను దయామతి గైకొని ధన్యుఁజేయవే
తడయక యంచు శ్రీహరిపదములుగోరి భజించుచిత్తమా ౧౦౬

శ్రీహరిపాదముల నాశ్రయింపుమని మనసునకు బోధించు శతక మొకటియు, చిత్తమును బోధించు శతక మొకటియు, నొకఁడే రచించునా యని కొందఱు సంశయము నొందుచున్నారు. ఏల రచించకూడదో నాకర్థమగుట లేదు. శేషప్పకవి, నరసింహ శతక మొకటియు, నృకేసరిశతక మొకటియు రచింపలేదా ? ఈ రెండు శతకములును పానకాలరాయడే రచించినట్లుశతకాంతపద్యములవలన స్పష్టముగాఁ గనఁబడుచున్నది. కాసులపురుషోత్తమకవి "మనసా హరిపాదములాశ్రయించవే" యను మకుటముతో నొకశతకమును రచించియుండెను. అది యిప్పుడు దొరకుట లేదు. అందుచే, పానకాలరాయనిదని చెప్పెడు మానసబోధశతకము పురుషోత్తమకవిదేమో యని కొందఱు సంశయించుచున్నారు. పానకాలరాయకవి యేకార్థద్యోతకమగు రెండు మకుటములతో రెండు శతకములు వ్రాయుటవలన నందొకటి పురుషోత్తమకవి కిచ్చివేయుటకుఁ గొందఱు ప్రయత్నించుచున్నారు. పురుషోత్తమకవి కుమార్తె కనఁబడకపోతే పానకాలరాయలకుమార్తె నాతని కిచ్చివేయుటేటిన్యాయము. బలవత్తరమగు సాక్ష్యము లభించిననే గాని యీమార్పు పండితసమ్మతము కాఁజాలదు. పానకాల

రాయలశతకమకుటాంతశబ్దము "ఆశ్రయింపుమా" అయి యున్నది. ఘురుషోత్తమకవిది "ఆశ్రయించవే" అయియున్నది. ఈభేదమును గూడపాఠకులు గమనింపవలసియుండును.

పాపరాజరాయని యీశతకములు రెండును మానవులహృదయమును భగవంతునిపై మరల్చుటకుఁ బ్రోత్సహించుచు దేవుని ప్రభావములను దెలుపునవిగా నున్నవి. శైలి రమ్యమైనది. ఇచ్చునకు శతకమునకు మూఁడుపద్యము లుదాహరింపఁబడుచున్నవి.

చ. శ్రుతముగ బుద్ధ్యహంకరణచిత్తములార వినుండు మీకు నే
హితముగఁ జెప్పెదన్ మనకధీశుఁడు నల్వురకాది మూలమ
చ్యుతుఁ డతిమాయనుం దతనిసొంపుగఁ బట్టెదఁ దోడుగండుమీ
కతి సుఖమబ్బు నందు మనసా. ... ... ౪౫

ఉ. కూరిమితోడనైనఁ దగుకోరికనైనను బ్రాణభీతిచేఁ
దూఱుచునైన వైరమునదూఁగుచునైనను భక్తినైన వే
మాఱు హరిందలంప నసమాన సుఖంబుఘటిల్లుఁ గాన వే
సారక నీవు నేఁడు మనసా ... ... ౪౬

చ. నిలయము కాలఁగా జడుఁడు నీటికినై నుయిద్రవ్వినట్లు నీ
విల నవసానవేళఁ బరమేశ్వరుఁ గొల్చి తరింతునంచు నా
సలఁ బడనేల నేఁడె హరిసర్వశరణ్యరమేశపాహిమాం
జలజదళాక్ష యంచు మనసా ... ... ౫౬

చ. ఉరమునఁ గల్గు రత్నరుచి రోజ్జ్వలహారము వెట్టివాఁడు దా
నరయగ లేనిమాడ్కి భవదంతిరాత్మను గానవైతి వ

స్థిరము సుమీ యొడల్ తెలిప దెచ్చుక యింతట నైన భక్తితో
త్వరత ఘటిల్లు శ్రీహరి ... ... ... ౨౧

ఉ బట్టలఁ గొట్టి చిట్టెలుక పట్టెడు పొట్టకుఁ గొంచనట్టు లి
ట్టటు మెలంగి మోక్షగతులారయ నేరని చెట్టపెత్తి వి
వెట్టల గట్టుబట్టెదవొ! ఏటికి బుట్టఁగ గిట్టఁగా నయో
దట్టపు భక్తి శ్రీహరి ... ... ... ౨౨

చ చిరిగినచీరమాని మఱుచీర ధరించినమాడ్కి మాటికిన్
విరివిగ దేహమున్విడచి వేఱొక దేహములోనఁ జొచ్చుచో
దరలని మాయలోనఁబడి తల్లడపాటునఁ దన్ను కాడుచుక్
దరిఁగన వేల శ్రీహరి ... ... ... ౨౦

ఈ కవి కాలము తెలియదగిన యాధారములు నేమియు గాన రాలేదు.



# 354 తాడిపల్లి పానకాలరాయకవి

ఇతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు; ఇతని తండ్రి వెంకన్న; తల్లి మహాలక్ష్మి; తాత సుబ్బారాయఁడు; ముత్తాత రంగామాత్యుఁడు.

సకలవైద్యార్థసంగ్రహమును రచించిన తాడిపల్లి పానకాలరాయ కవి యింకొకఁ డున్నాఁడు ఆతనిచారిత్రము నింతకుఁ పూర్వమీగ్రంథమున వ్రాసియుంటిని.

ఈ పానకాలరాయకవి నేత్రదర్పణమను చిన్నపద్యకావ్యమును రచియించి శ్రీకృష్ణునకంకితము చేసెను. ముప్పదియైదుపద్యములు గలయీచిన్నగ్రంథమున నేత్రరోగవివరములును దచ్చికిత్సలును దెలుపఁబడినవి. కవి తననుగూర్చి యీక్రింది పద్యమును వ్రాసికొనినాఁడు.

సీ. శ్రీవత్సగోత్రుఁ డంచితపటుశాస్త్రసం
ఖ్యావనీదేవ కులాగ్రగణ్యుఁ
డగుతాడిపల్లి రంగామాత్యపుత్రుండు
రాజపూజ్యుఁడు సుబ్బరాయఁడతని
తనయుఁడౌ వెంకన్నకును మహాలక్ష్మాంబ
కును తనూజులము ముగ్గురము వందు
చెలఁగి వెంకటరాయ శ్రీసీతపతిరాయ
లకు సహోదరుఁడ నేఁ బ్రకటముగను
పానకాల్రాయఁ డనువాఁడ భవ్యయశుఁడ
నఖలరాజాధిరాజ సభాంతరాశ్రీ

పూజితుడఁ సర్వవిద్యావిరాజితుఁడను
సుజనసేవ్యుఁడ హరిభక్తి సుమహితుఁడను

ఇతనినివాసము కృష్ణానదీతీరమున బెజవాడసమీపమున నున్నతాడిపల్లియనుగ్రామమని కవియే యిట్లుచెప్పుకొనియున్నాఁడు.

"వ అట్టిసీమాప్రదేశమున నుదగ్భాగంబున నింద్రకీలాచలంబునకు మధ్యప్రదేశంబున మంగళాచలంబునం గలకృష్ణానదీతీరంబున.

క. పదిరెండు పర్వతంబులు
విదితంబుగ నదులు రెండు విభుఁడున్నృసింహుం
డద నైనదుర్గమొక్కటి
పదపడి ముదమలరు తాడిపల్లిధరిత్రిన్

ఈగ్రామమునుబట్టి యీకవిగృహనామమును దీనికిసమీపముననున్న మంగళగిరియందలి దేవునిబట్టి యీకవినామమును వచ్చినది.

ఈతాడిపల్లి కొండవీటిసీమలోనిదని చెప్పుచు నాకొండవీటిసీమను ఈక్రిందిసీసపద్యములలో వర్ణించినాఁడు.

సీ. రాజాధిరాజ విరాజితసత్పురి
పాటి యైనది కొండవీటిసీమ
సకలవర్ణాశ్రమాచార సత్కర్మ బా
హాట మైనది కొండవీటిసీమ
సంగీతసాహిత్యరసవిద్యల నిరా
ఘాట మైనది కొండవీటిసీమ

అతులితానర్ఘ్య వజ్రాకరవితతిచేఁ
బాటిల్లినది కొండవీటిసీమ.

ప్రకటితైశ్వర్యసౌఖ్యసంపదలఁ బొదల
నఖిలజనముల కానంద మతిశయిల్ల
జగతి నేబదియారు దేశములలోన
నీటుగా నెన్నఁదగు కొండవీటిసీమ.

ఈగ్రంథాంతగద్య యిట్లున్నది

ఇది శ్రీవేణుగోపాలచరణధ్యాన పరాయణ శ్రీవత్సగోత్రోద్భవ తాడేపల్లి రంగామాత్యపుత్ర బాలగోపాలప్రసాదలబ్ధ సకల విద్యాప్రవీణ పానకాలరాయ ప్రణీతంబయిన నేత్రదర్పణంబు సర్వంబును సంపూర్ణము.

పైనివ్రాసినసీసపద్యములో కవితండ్రిపేరు వెంకన్నయని యుండఁగా నీగద్యలో రంగమాత్య పుత్ర యనియున్నది గద్యయే పొరపాటు. సీసపద్యమే సరియైనదని భావింపవలసియున్నది.

శైలి తెలుపుటకై రెండుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. అర్థి పరోపకారార్థ మిదంశరీరం
బని శ్రుతివచనంబు దెలుప
తనర ధర్మోవివర్ధతి యంచు నెప్పుడు
శాస్త్రపురాణముల్ చాటుచుండ

గురుతుగా ధర్మస్యత్వరితాగతి యటంచు
సాధుసంఘుంబు హెచ్చరిక సేయ
నరయ సమస్తలోకాస్సుఖనోభవం
తని వేదవేత్తలొయ్యనవచింప
వినుచు బాగుగ నేరాజు కనికరమున
మొదట రోగార్త జనులను బ్రోచుకొఱకు
వైద్యులను నిల్పి నత్యంత వైభవమున
నతనిపుణ్యంబు బ్రహ్మకు నైనఁ గలదె

ఉ ఆమలకంబు మిర్యములు నారయ గానుగవిత్తు లొప్పుగా
సామునంద నందుఁగణసంఖ్యలగుంటక రాకునీటితో
ప్రేమనునూరి కన్నులను బెట్టిన నామలకాంజనంబుచేఁ
గా మెరలక్షిరోగములు కాచలు తీటలు మానుఁ గేశవా

ఈకవికాలము తెలియఁదగిన యాధారములు గ్రంథమున నేమియు లేవు



# 355 దర్భా గిరిరాజకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు లోహితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు ఔబళన్న జానకమ్మలకుఁ బుత్త్రుఁడు; గోపాలమంత్రి చెంగమాంబికలకుఁ బౌత్రుఁడు, అభినయదర్పణకృతికర్తయగు విచిత్రరాయావతంసబిరుదాంకితుఁడు నగు వెంకటగిరికవి యీతనికి సోదరుఁడు.

ఈ కవి, వాదవిజయము, రాజమోహనకొరవంజి, శాహేంద్ర చరిత్రము, రాజకన్యాపరిణయము, లీలావతీ కల్యాణము, సర్వాంగ సుందరీవిలాసము అనుయక్షగానములను రచియించెను ఇతఁడు తంజావూరు రాజ్యపరిపాలకుఁడగు శాహ మహారాజునాస్థానకవి ఈశాహమహారాజు బహుకృతిరచనాదక్షుఁడగు విద్వత్ప్రభువు. ఈతని చారిత్రము నీగ్రంథమున మఱియొకచోట వ్రాసియున్నాఁడను ఇతఁడు రచించినగ్రంథములలో "లీలావతికల్యాణము" శరభోజి మహారాజున కంకితమైన ట్లీక్రిందిద్విపదలవలనఁ దెలియవచ్చుచున్నది.

"గిరిరాజనుతలీల శరభోజిభూపాల
సురతకేళి నన్ను చొక్క జేసితివి.
శ్రీసద్గుణోదార సింధు గంభీర
భోసలాన్వయచంద్ర భూసుత్రదేవేంద్ర
జననాథ దినరాజ శరభోజిరాజ
వినుము నీదాన నావిన్నపంబొకటి-

శాహాజీమహారాజున కీశరభోజి తమ్ముఁడు శాహాజీ క్రీశ ౧౬౮౪ మొదలు ౧౭౧౧ వఱకును శరభోజి ౧౭౧౧ మొదలు ౧౭౨౮ వఱకును, తంజావూరును బరిపాలించిన మహారాష్ట్రప్రభువులు. కావున మనయీగిరిరాజకవియు నాకాలమున నున్నాఁడనుట స్పష్టము. సర్వాంగసుందరీవిలాస గ్రంథాంతమున "లేఖనసమాప్తిః పుష్యశుద్ధప్రతిపదాస్థిరవాసరతంజాపుర్యాంతారణాఖ్యేలిఖితం" అనియున్నది. తారణసంవత్సరము ౧౭౦౪ అయినది.

వాదవిజయమొక్కటిదప్ప శాహామహారాజున కంకితము చేయఁబడిన నాటకములు నాల్గింటిలోను శాహాజీ నాయకుఁడు. యెవ్వతెయో యొకకన్య నాయిక. వీరిరువురి ప్రణయగాథలే యిందువర్ణితములు లీలావతికల్యాణముకూడ నట్టిదే అందు లీలావతి నాయిక శరభోజి నాయకుఁడు ఆకాలమున నిట్టినాటకరచనకుఁ బ్రోత్సాహ మధికముగానుండెనని యిదివరలో వ్రాసియుంటిని.

వాదవిజయమునందలి విషయమేమియో తెలియలేదు అందలి కృత్యాది ద్విపదల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

శ్రీ గిరిజానాథు జితరిపుయూథు
నాగచర్మాంబరు నాగకేయూరు
ఈశు సర్వేశు త్యాగేశు నేప్రొద్దు
భాసురముగా మనః పద్మంబునందు
తలఁచి సద్భక్తిచే దనరివధీర
జలనిధి గంభీర శత్రు సంహార

రతిపతిసమరూప రవికుల దీప
సతతశుభాచార సద్గుణాస్సార
చోళమహీపాల సురుచిరశీల
లాలిత కవిపాల రమణీయలీల
వాసవ సంపూర్ణ వైభవ విమల
భోసలకులశాహ భూపాలచంద్ర
పొంకంబు మీఱ పెంపొంద నీమీఁద
అంకితంబుగ నతుల వైఖరిని
వాదజయంబను వరనాటకంబు
మోదంబుతోడుత మునుకొనియిపుడు
గావించెదను నేను కవులునుతింప
భూవలయంబున పూజ్యమైపొగడ

గ్రంథనామమునుబట్టి యిందలి విషయము భిన్నముగా నుండునని తోఁచుచున్నను, ఇదియును శృంగారనాటకమే, అని నాయూహ.

ఈ కవి పద్యకవిత్వశైలి తెలియుటకై లీలావతీ కళ్యాణము నుండి రెండు పద్యముల నుదాహరించు చున్నాఁడను.

ఉ. పన్నుచుఁగానిపోని పదపద్యము లూరకె యూరవేని య
భ్యున్నతిగాంచి మంచి బుధులుండినచోటికి వచ్చు కాకవుల్
కన్నపుటచ్చు రావళుల గంతలు గట్టి మహీశతాళికిన్
చెన్నుగ నమ్మఁ జూచు జడచిత్తులకున్ సయిదోడు లేగదా!

ఉ. పూచెను మాధవీలతలు పూవుల తేనెలుద్రావి జుమ్మనన్
లేచెను గండుతుమ్మెదలు లేమల యీలువు గొల్లలాడఁగా
జూచెను పంచసాయకుఁడు సోమరి తెమ్మెరపిల్ల లెల్లెడన్
వీచెను జూడవమ్మ వనవీథుల కాంత వసంత వైఖరుల్.

ఈ కవినివాసము తంజావూరని యే భావింపవలసి యున్నది

